బట్టలన్నీ
ఉతికేందుకు
కీ డిటర్జెంట్ పౌడర్ కన్న
మరింత
మంచిదేది ?



# కొత్తది! మెఱుగు పరచ బడింది!




## కీ

**అంతేకాదు,
ఇంకా దీని ధర
యితర ప్రముఖ
డిటర్జెంట్ల కన్న
30% తక్కువే!**

ఈ మెఱుగుదలలు చూడండి!



ఇప్పుడు కీ మరింత సమృద్ధిగా నురగ నిస్తుంది



ఇప్పుడు కీ బట్టలకు మరింత తెల్లదనాన్ని, తళతళను ఇస్తుంది

గోద్రెజ్
ఉత్పాదన

**అందరికీ కనిపించే ఆ అదనపు తెల్లదనం, తళతళ–కొత్త, మెఱుగు పరచబడిన కీ లో**

CHAITRA-G-167 TEL

**మా పాఠకులు, రచయిత(త్రు)లు ఏజంట్లు, ప్రకటనకర్త లందరికి క్రిస్మస్ శుభాకాంక్షలు! —సం॥**

## ముఖచిత్రం

ఈ వారం 4.12.81 ఆంధ్ర సచిత్ర వార పత్రికకు వేసిన సుహాసిని ముఖచిత్రం మోడ్రన్ డ్రెస్‌లో ఏమంత బాగోలేదు ? అందాల ఆంధ్ర పత్రికకు చీరకట్టు ముఖచిత్రాలే బాగుంటాయి. కనుక మన భారతీయ స్త్రీ సంస్కృతిని ప్రతిబింబించేవే ముఖచిత్రాలు ప్రచురించగలరు.

శ్రీమతి రమాశకుంతల, లక్కరాజు ప్రపుల్లచంద్ర (వరంగల్)

## కథలు

27—11—81 నాటి ముఖ చిత్రము బాగుంది. మంచి మొగుడు, చివరి పాటం కథలు నాకు బాగా నచ్చినవి.

కె. విజయనాగేశ్ (బోడసకుర్రుపాలెం)

*   *   *

యువతరం అభిమాన జంట చిరంజీవి మాధవిల ముఖచిత్రంతో అందాలను వెదజల్లింది. ఈ వారం ప్రచురించిన కథల్లో పరోపకారమా పర్వదిబ్బ అన్న కథ చాలా ఇంట్రెస్టింగ్‌గా వుంది నేటి సమాజంలో వాస్తవికతని అద్దంపట్టినట్లు చిత్రించే రచనా శైలి గల కథలు ప్రచురిస్తున్నందులకు అభినందనలు.

ఎల్. ప్రపుల్లచంద్ర, శ్రీమతి రమాశకుంతల [ ధర్మవరం ]

*   *   *

27- 11—81 సంచిక ముఖ చిత్రం ఆకర్షణీయంగాఉంది. మంచిమొగుడు, చివరిపాటం కథలు చాలా బాగున్నాయి.

బి. నాగరత్నం (కోడుమూరు)

*   *   *

4 12,81 సంచికలోని గోవిందరాజు సీతాదేవిగారి "చావను గాక చావను" కథ సందేశాత్మకంగా ఉన్నది.

పి. రామచంద్రారెడ్డి (కొత్తచెరువు)

*   *   *

4 12 81 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురితమైన "నడుస్తున్న చరిత్ర" 'గడ్డిపువ్వు' చాలా బాగున్నవి. మిగిలిన మామూలుకథలు పర్వాలేదు.

సీరియల్స్ రెండూ ఒకదానికి మరొకటి పోటీ పడి మమ్ము సంతృప్తి పరుస్తున్నవి

మురళీకృష్ణ, శేఖర్, కామేశ్వరి, రాధ (దర్శకరత్న శ్రీ దాసరి అభిమాన సంఘం సభ్యులు, తిరుపతి)



4.12.1981 తేదీనాటి ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని కథలలో గీతోపదేశం, చావనుగాక చావను రెండు కథలు చాలా బాగున్నాయి.

ఎండి జావీద్‌పాష జి. బ్రహ్మేశ్వర్‌రెడ్డి (అలంపూర్)

*   *   *

"సిమి" ముఖచిత్రంలో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక వెరైటీగాఉంది. గీతోపదేశం కథ ముగింపు బాగుంది.

పి. పాండురంగారెడ్డి (చిత్తూరు)

*   *   *

సిమి ముఖచిత్రం గల 11.12.81 ఆంధ్ర పత్రికలోని 'గీతోపదేశం' సత్యం మందపాటి రచన చాలా బాగుంది.

కృపానాధ్ (కెసరాపగర్)

*   *   *

11 12 81 సిమి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక ఎంతో ఆకర్షణీయంగా ఉన్నది. "గీతోపదేశం", సంచారిణి దీపశిఖ, కరుణ కథలు చాలా బాగా ఉన్నాయి.

కోట ఉమామహేశ్వరీదేవి (బేస్తవారపేట)

*   *   *

11.12.81 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం నటిసిమి అందాన్నిచ్చింది. "కరుణ" కథ చిన్నదైనా చాలా బాగున్నది

షేక్ హుస్సేన్, హిరాలాల్ (ముమ్మిడివరం)

*   *   *

ఆహా! ఎన్నాళ్లకు ఒక గొప్పకథ చదివాను! 11.12.81వ తేదీ సంచికలో శ్రీ సోమసుందర్‌గారి కలం చిందించిన "సంచారిణి దీపశిఖ" నన్ను నిలువెల్లా స్పందింప జేసింది.

కథలోని మొదటి వాక్యాన్ని చిరునవ్వుతో చదివిన నేను, ముగింపు మాటలు చదువుతూ దుఃఖాన్ని ఆపుకోలేక పోయాను

లేకి సంభాషణలతో, కృత్రిమ పాత్రలతో విసుగు కలిగించే కథలు తెలుగు పత్రికారంగాన్ని ముంచేస్తున్న ఈ రోజుల్లో "సంచారిణి దీపశిఖ" లాంటి కథ ఎడారిలో ఒయాసిస్!

పెమ్మరాజు బుచ్చిబాబు (హైదరాబాద్)

## ఫొటో డిటెక్టివ్ డైరీ

20- 11- 81తేదీ నాటిపత్రికలో ఫొటోక్కుని డైరీ చాల బాగుంది.

కె. ఎస్. రెడ్డి (మార్కాపురం)

## లోకం పోకడ

ఈ వారం 11 12 81 నటి సిమి ముఖచిత్రంతోవెలువడిన 'ఆంధ్రసచిత్రవారపత్రిక' మిక్కిలి మనోహరంగాఉంది. ప్రతివారం ఉమెన్‌గారు "లోకం పోకడ" శీర్షికలో రాజకీయాలను చాలా చక్కగా మాకు తెలియచేస్తున్నారు.

చంద్రశేఖర్‌దేశాయ్ (కర్నూలు)

## సీరియల్స్

ఈ వారం 27—11—81 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రచురించిన మామూలు కథలూ బాగున్నవి. 'జీవితవనంలో కొత్తగాలి, సీరియల్ మంచి ఇంట్రెస్టింగ్‌గా వుంది

పి. వరలక్ష్మి (కృష్ణాపురం)

*   *   *

27—11 . 81ఆంధ్ర సచిత్ర వార పత్రిక ముఖ చిత్రం అత్యంత ఆకర్షణీయంగా ఉంది. జీవితవనంలో కొత్తగాలి సరియల్ ఇంట్రెస్టింగ్‌గా సాగుతోంది సంధ్య పాత్ర చిత్రీకరణ బాగుంది. ప్రమీల లాంటి స్నేహశీలి, కిరన్ లాంటి సహృదయుడు దొరకడం చాలా అరుదు రచయిత్రికి మా అభినందనలు.

ఎం. నాగపద్మజ (విడుబ్రోలు)

*   *   *

27—11—81 తేదీన వెలువడిన చిరంజీవి, మాధవిల రంగుల ముఖ చిత్రం చాలా ఆకర్షనీయంగా ఉన్నది. జీవితవనంలో కొత్తగాలి సిరియల్ కథ చాలా ఇంటరెస్ట్‌గా ఉన్నది.

పి. ఎస్. మురళీకృష్ణ (నాయుడుపేట)

*   *   *

చిరంజీవి, మాధవి ముఖ చిత్రంతో వెలువడిన 27—11—81 ఆంధ్ర సచిత్ర వార పత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది.జీవితవనంలో కొత్తగాలి,కోరిక తీరెవేళ, సిరియల్స్ చాలా సాఫీగా సాగుతున్నాయి.

చాగంటి శంకరశాస్త్రి (యనమదుర్రు)

*   *   *

జీవితవనంలో క్రొత్తగాలి కుందుర్తి ఇందిరాదేవి గారు వ్రాస్తున్న ఈ సిరియల్ నా మనసుకు ఎంతో ఆనందం కలిగిస్తున్నది. ప్రతి వారం ఎదురు చూడడమే నాకు ఒక డ్యూటి అయిపోయింది

వి. అమరనాద్ (బెంగుళూరు)

*   *   *

విస్సకోట సుశీలాదేవిగారి 'కోరిక తీరెవేళ' సిరియల్ కథ చాలా ఆసక్తికరంగా ఉండినది. ముఖ్యముగా ముగింపు చాలా బాగున్నది.

డి. సువర్ణ (పాదలకూరు)

*   *   *

11 .12 81 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో కొత్తగా వెలువడిన "తార" సిరియల్ నాకుమొదటిలోనే ఎంతగానో నచ్చినది.

డి. ఆర్. లక్ష్మి (ఇచ్ఛాపురము)

# ఆంధ్రసచిత్రవారపత్రిక


వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938 – 1972]

శుక్రవారం : 1–1–'82

దుర్మతినామ సం. పుష్య శు షష్ఠి

**సంపుటము 75 సంచిక 17**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు 67–60

ఆరు మాసాల చందా రు 33–80

విడిప్రతి వెల రు. 1-25 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**

గాంధీనగరం, విజయవాడ–520 003


## విషయానుక్రమణిక


ముఖచిత్రం: హిందీ నటి తమన్నా

**కథలు :**

ప్రభువునందు నిద్రించెను ... 6

నువ్వంటే నాకెంతో ఇష్టం .. 16

డెవమెట్ ... 29

విళ లేని వల టోపీ (పెద్దకథ) .. 60

**సీరియల్ కథలు :**

తార ... 22

జీవితవనంలో కొత్తగాలి ... 46

**వ్యాసాలు, శీర్షికలు**

ఉత్తరాలు — 4, లోకంపోకడ—5, 'క్రిస్ క్రాస్' గజిబిజి—20, రుచ్యపథం—28, పచ్చకామెర్లకి కొత్త టీకాలు — 34, డాక్టర్ సలహాలు — 35 సినిమా — 38, ప్రశ్నావళి 56, బొమ్మల మహాభారతం 58 ఫొటోక్విజ్ — 67, వారఫలం — 68, వంటలు 69, హైదరాబాద్ నోట్ బుక్ 70 అవీ—ఇవీ—అన్నీ — 74







మిట్టమధ్యాహ్నం పాస్టరుగారి వాటాలో భోజనానంతరం అందరూ ఆదమరిచి నిద్రపోతున్నారు ఇవతల మా వాటాలో మా ఆవిడ కూడా నిద్రపోతూ ఉంది.

నేను పడక్కుర్చీలో కూచుని భగవద్గీత తిరగేస్తున్నాను

"పరిశుద్ధ పరిశుద్ధ పరిశుద్ధ ప్రభువా!"

మార్తా గొంతు స్పష్టంగా వినిపిస్తోంది. భక్తిపారవశ్యంతో పరిసరాలను మరిచి మరీ పాడుకుంటోంది

ఆ నిశ్శబ్ద వాతావరణంలో ఆమె స్వరం నాకు మైమరపు కలిగించింది

మార్తమ్మ ఎవరో వినాలని పాడటం లేదు తనకై తానుగా దేవుణ్ణి స్తుతిస్తోంది

మార్తా సుగుణ వింతలో వింత విరిసి పోయింది!

నాలుగేళ్ళ క్రితం మురికిదారంలా నాసుకు పోయి బెరుకు బెరుగ్గా మా వాటావైపు చూస్తూ ఉండిన ఆ మార్తమ్మేనా ఈ మార్తా సుగుణ!

పదహారేళ్ళకే యవ్వనం పొంగారే శరీరంతో, నల్లగా ఉన్నా అందంగా కళకళ లాడుతూ చలాకీగా తిరుగాడుతూ ఉందిప్పుడు.

మా ఇంటి వాసనైన పాస్టరుగారింట్లో పని పాటలు చెయ్యడానికి ఎక్కడో పల్లెటూరి నుంచి వచ్చిన దూరపు బంధువుల పిల్ల మార్తమ్మ

మార్తమ్మ తండ్రి తాగి తాగి చచ్చిపోయ్యాట్ట! పిల్లల్ని పోషించలేక ఆమె తల్లి కూతురు మార్తా సుగుణని ఇంతదూరాన పట్నంలో ఉంటున్న ఈ పాస్టరు గారింటికి పంపింది.

మార్తమ్మ తెల్లవారకముందే లేచింది మొదలు రాత్రి పదింటిదాకా వంచిన నడు మెత్తకుండా ఇంటెడు చాకిరీ చేస్తున్నా, పాస్టరుగారి భార్య తిడుతుంది పాస్టరు గారి అబ్బాయిలు, అమ్మాయిలు చీటికి మాటికి కొడతారు. అన్నీ చూస్తూ కూడా పాస్టరుగారు ఏమీ అనరు.

ఇన్ని అనుభవిస్తూ కూడా మార్తమ్మ ముఖంలో ఎంత ప్రశాంతత! ఎంత వినయం!

అందుకే మార్తా అంటే మా దంపతు లిద్దరికీ ప్రాణం. పిల్లలులేని మాకు ఆ అమ్మాయిపై అంతులేని వాత్సల్యం. నా భార్య మరీను.

వాళ్ళు క్రిస్టియన్లు మేం హిందువులం. అయినా మానవతాబంధం మతం కంటె బలమైందికదా!

మార్తా నన్ను 'బాబాయి' అంటుంది; మా ఆవిణ్ణి 'పిన్ని' అంటుంది ఆ అమ్మాయి తీరికైనప్పుడల్లా కూడబలుక్కుని తెలుగు బైబిలు చదువుతుంది. ప్రతి ఆదివారం తప్పనిసరిగా చర్చికి వెళ్తుంది.

"బాబాయ్! మీకు చక్కనిబాబు పుట్టాలని ప్రభువును ప్రార్థించాను పరలోక మందున్న ప్రభువు నా ప్రార్థన తప్పక వింటాడు" అనేది

ప్రార్థనల వల్ల సంతానం కలుగుతుందన్న విశ్వాసం నాకు లేకపోయినా, మాయెడ మార్తమ్మకున్న అభిమానం గమనించి నా హృదయం వాత్సల్యంతో నిండిపోయేది

భగవద్గీత పేజీలు తిరగేస్తున్నానన్నమాటే గాని ఆ అమ్మాయి స్వరమే అంతటా నిండి నిబిడీకృతమై ఏమీ బుర్ర కెక్కడంలేదు.

పుస్తకం మూసి ప్రక్కనే ఉన్న స్టూలుపై పెట్టి పడక్కుర్చీలో వెనక్కి మేనువాల్చాను కళ్ళు ఎప్పుడు మూతపడ్డాయో తెలియదు. సుగత నిద్ర ఆవరించింది.

"బాబాయ్!" దీనాతిదీనమైన పిలుపు ఎక్కడో సుదూరాన వినిపిస్తున్నట్లు తోచింది.

"బాబాయ్!"

ఉలిక్కిపడి కళ్ళు విప్పాను

ఎదురుగ్గా మార్తమ్మ తలొంచుకుని నించుని వుంది

"ఏమ్మా మార్తా ?"

"దేవుడు పాపుల్ని నిజంగా క్షమిస్తాడా?"

మార్తమ్మ గొంతులో ఏదో తెలియని వేదన, భయం వినిపించాయి. పాస్టరు గారింట్లో అష్టకష్టాలు పడుతున్నా ఆ అమ్మాయి ఎప్పుడూ ఇంత దీనంగా కనిపించి ఎరగదు.

"నువ్వే చెబుతావుగా మార్తమ్మా! నీ ఏసు ప్రభువు పాపుల్ని రక్షించడానికే అవతరించాడని. ఇప్పుడనుమానం ఎందుకొచ్చింది ?'

"ఎంతటి పాపాన్నయినా క్షమిస్తాడా అని ?"

ఒక్క క్షణం నా గుండె వేగంగా కొట్టుకున్నట్టయింది.

మార్తమ్మ ముఖం వైపు దీక్షగా చూశాను.

అశుభం శుభం ఎరక్క ఎప్పుడూ ఏసు ప్రభువునే స్తుతిస్తూ, బైబిలే చదువుతూ ఉండే ఈమె ఎందుకిలా మాట్లాడుతూ వుంది ?

"మార్తమ్మా! ఇలా కూచోమ్మా! ఏమైంది చెప్పు" అన్నాను అనునయంగా.

మార్తా కూచోలేదు. ఏమీ చెప్పనూలేదు ఓ నిముషం అలాగే తలొంచుకుని నించుని తరవాత నెమ్మదిగా తమ వాటావైపు వెళ్ళిపోయింది

నా మనస్సు ఆందోళనతో నిండిపోయింది

పాపం!... ఎవరు అంతగా పాపం చేసేవారు ?

ఏ పాపమూ ఎరుగని మార్తమ్మకు ఎందుకింత చింత?

పడక్కుర్చీలో మళ్ళీ వెనక్కివాలి కళ్ళు మూసుకున్నానుగాని నిద్ర పట్టనేలేదు. ఆ రోజంతా మార్తమ్మను గురించిన ఆలోచనే కలకవేస్తూ ఉంది

మార్నాటి నుంచీ మార్తమ్మలో మార్పు గమనించాను ఎప్పుడూ కళకళలాడుతూ ఉండే ఆమె ముఖంలో ఇప్పుడు కళవళపాటు కనిపిస్తూ వచ్చింది.

అప్పుడప్పుడూ మా వాటాలోనికి వస్తూ నా భార్యతో మాట్లాడుతూ ఉన్నా వెనకటి చలాకీతనం లేదు. ఎప్పుడూ పరధ్యానంగా ఉంటూంది. పాస్టరుగారి భార్య తిట్లు రెట్టింపుగా వినబడుతున్నాయిప్పుడు.

అయినా మళ్ళీ ఆ ప్రస్తావన నాదగ్గర తేలేదు మార్తమ్మ

అందువల్ల ఆ విషయం దాదాపు మరిచిపోయాను

ఓ మూడు నెలలు గడిచాయి

ఓ రోజు రాత్రి పక్కవాటాలోంచి ఉన్నట్టుండి దభీదభీ మని చప్పుడు వినిపించింది ఎవర్నో గొడ్డును బాదినట్టు బాదుతున్నారు !

నేనూ, మా ఆవిడా కళ్ళు విప్పార్చుకుని, చెవులు రిక్కించుకుని వినసాగాము

తిట్లు వెనకటిస్థాయిని మించినా, పాస్టర్ భార్య స్వరంమటుకు ఎందుకో తగ్గి ఉంది.

"అమ్మో !" అంటూ మార్తమ్మ నెమ్మదిగా మూలుగుతూ ఏడుస్తూ ఉంది.

"తప్పుడుముండ ! ఎక్కడెక్కడో తిరిగొచ్చి ఏమీఎరగని నా పిల్లాడి మీద అపవాదు వేస్తావా ?" అంటూ బూతుల వర్షం కురిపిస్తోంది పాస్టరు భార్య.

పాస్టరు భార్యకు అన్నిబూతులు వచ్చునని నేను కలలోకూడా అనుకోలేదు.

"ప్రభువు నిన్ను క్షమించడు మార్తా !" అంటున్నాడు పాస్టరు నిశ్చలంగా

"ఇట్లాంటి ముండల్ని క్షమిస్తాడా ప్రభువు ?" అంటూ మళ్ళీ తిడుతూ మరో విడత బాదింది ఆయన భార్య.

"అమ్మా ! మీ కాళ్ళు పట్టుకుంటానమ్మా ! ప్రభువు మీద ప్రమాణంచేసి చెబుతున్నాను నిజంగా పెద్దబ్బాయిగారే నమ్మా ! ఎంత ఏడ్చినా, దండం పెట్టినా వినలేదు."

## తపఃఫలము

శీలం చెడనిచోట
కాలం శపించినవాడు
కుంతి కొడుకైతేనేం — మరి ఏ కుంతి కొడుకు అయితేనేం ...?
జన్మసార్ధకత పుట్టినచోటు బట్టి కాదు
మనీషి కట్టిన మానవతా పీఠం బట్టి ...
తలపుల తలవాకిలి తీసి

త్యాగానికర్థం ప్రేమించటంలో వెతికాడు
ఔదార్యశబ్దం శిలువ మేకుల్లో చూపాడు
కారుణ్యసిద్ధి కనుకొలకుల్లో నిలిపాడు ..
ఈ తపసంతా పశులపాకలో శిశువైన వాడిది
ఈ తపనంతా ఒకతల్లికి కొడుకై లోకానికి తండ్రైనవాడిది ...

తలపుల తల వాకిలి తీసి
మనిషికంటే ముందు మంచితనాన్ని పిలిచాడు
పూవుకంటే ముందు తావిని తోరణంగా నలిచాడు
కలలకంటే ముందు కన్నీళ్ళ కర్థం ప్రతిపాదించాడు ..
ఈ తపసంతా కాలస్వరం పురిటి కేకైన పసివాడిది
ఈ తపనంతా లోకహితం లోహితమైన శుద్ధాత్మది

నిజానికి
మరియా తల్లికాదు లోకతపము
జీసస్ కొడుకుకాదు తపఃఫలము ...

— సాంధ్యశ్రీ

## ప్రభువునందు నిద్రించెను

ఆ వాడు మార్తమ్మ చేసిన ప్రస్తావన ఏఖిటో ఇప్పుడర్థమైంది.

నా హృదయం విషణ్ణమైపోయింది మా ఆవిడ ఏకంగా ఏడవడం మొదలెట్టింది

"దొంగలంజ! నా ఇంట్లో ఒక్కక్షణం ఉండటానికి వీల్లేదు, పద బయటికి"

ఇంట్లోంచి బయటికి ఈడుస్తున్న చప్పుడు వినబడుతోంది.

"అయ్యా! అయ్యా! మీరైనా కనిక రించండి, ఏసుప్రభువుతోడు. నేను చెప్పిం దంతా నిజమయ్యా! కావాలంటే అబ్బాయి గార్ని అడగండి."

"ఛీ! ఛీ! నువ్వుచేసే చెడ్డపనులన్నింటికీ ఏసుప్రభువు సాక్షా? నోరెత్తావంటే నోటి మీద తంతాను-పద బయటికి" పాస్టరు గర్జించాడు

"ఇది మాటల్తో పోదు" అంటూ పాస్టరు భార్య, మార్తమ్మ ఎంత మొత్తుకుంటున్నా లెక్కించకుండా ఆమె జుట్టు పట్టుకుని బరబరా ఈడ్చుకొచ్చి వెలుపలికినెట్టి గేటు వేసేసింది.

మేమిద్దరమూ వరండాలో నించుని నిర్ఘాంతపోయి చూస్తూనే ఉన్నాం.

మార్తమ్మ! ఎప్పుడూ భగవంతుణ్ణి స్తుతిస్తూ, బైబిల్ చదువుకుంటూ ఉండే పవిత్రమూర్తి మార్తమ్మ! మమ్మల్ని పెస్సీ, బాబాయి అని ఎంతో ఇదిగా పిలుస్తూ సొంత కూతురులాగే వర్తించిన మార్తమ్మ!

మార్తమ్మను కళంకపరిచి కొండంత అపవాదు నెత్తినివేసి బయటికి నెట్టేశారు. దిక్కులేని మార్తా సుగుణ!

నా కళ్ళు చెమ్మగిల్లాయి మా ఆవిడ కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తూ గబగబానడిచి గేటు తీసుకుని బయటికి వెళ్ళింది.

నేను కూడా ఆమె వెంట వెళ్ళాను.

మురిక్కాలవ ప్రక్కగా చీకట్లో కూచుని కుమిలి కుమిలి ఏడుస్తోంది మార్తమ్మ. మా ఆవిడ ఆ అమ్మాయిని పొదువుకుని "మార్తా" అంది చీరచెంగుతో కన్నీరు తుడుస్తుంటూ.

"పెస్సీ" బావురుమంది మార్తమ్మ.

"ఏలీ ఏలీలమ్మా సబక్తానీ" (ఓ దేవా! ఎందుకు నన్ను చేయి విడిచితివి?) బైబిల్లో

# KERAGEM

కేరాజెమ్ అనేకసార్లు పడకట్టిన అసలైన

## కొబ్బరినూనె

నల్లగా నిగనిగలాడుతూ చిత్తుగా
జుట్టు పెరగడానికి

**కేరాజెమ్**

శుద్ధమైనది సువాసనతో కూడినది
కొబ్బరినూనెలలో అమూల్యము




కేరళా స్టేట్ కోకోనట్
డెవలప్‌మెంట్ కార్పొరేషన్
లిమిటెడ్
(కేరళ ప్రభుత్వపు సంస్థ)
త్రివేంద్రమ్-695 014(కేరళ)

EP KSCDC 102 81 Tel

ఆంధ్రప్రదేశ్‌లో సెల్లింగు ఏజంట్లు: నరసయ్య & కంపెనీ,

3–5–784/6–5 కింగ్‌కోఠి,
బషీర్‌బాగ్ రోడ్డు, హైదరాబాదు–1.
ఫోన్ నెం. 220782.

11–22–28 రాజరంగయ్యప్పారావువీధి,
విజయవాడ–1, ఫోన్ నెం. 77328.

గంగానమ్మపేట, తెనాలి–1.
ఫోన్ : 166.
ఏలూరు బజార్, గుంటూరు–3

## ప్రభువునందు నిద్రించెను

ఎక్కడో చదివిన వాక్యం గుర్తుకొచ్చింది నాకు.

"నే నెక్కడికెళ్ళను పిన్నీ? ఇట్లా చేసుకుని పోతే మా అమ్మావాళ్ళు మాత్రం రానిస్తారా? నాకేది దారి?" ఏడుస్తూనే అంది మార్తా.

"మరెక్కడికీ వెళ్ళద్దు మార్తా! మా ఇంట్లోనే ఉండు. మీ అమ్మా నాన్నలం మేమే అనుకో." అంది మా ఆవిడ దృఢ స్వరంతో.

"అవును మార్తమ్మా! లోపికి వెళ్దాం రా" అంటూ ఆమె తల నిమిరాను.

"వొద్దు పిన్నీ! అమె మంచిది కాదు. నేను మీ ఇంట్లో వుంటే మిమ్మల్ని నానా మాటలూ అంటుంది."

"ఫరవాలేదులే రా మార్తా!" అంటూ ఆ అమ్మాయిని లేవదీసి లోపలికి తీసుకొచ్చాము.

వాళ్ళ కాటాలో నిండుని పాస్టర్లూ; ఆయన భార్యా మావైపు క్రూరాతిక్రూరంగా మిర్రిమిర్రి చూస్తున్నారు. అయినా మేమేమీ లెక్కచెయ్యలేదు.

ఎంత బతిమాలినా ఆ పూట మార్తమ్మ భోజనం చెయ్యలేదు.

ఓ మూల చాపమీద ముడుక్కుని పడుకుంది.

మార్తమ్మ భవిష్యత్తును గురించి ఆలోచిస్తూ పడుకున్న నా మనస్సంతా అల్లకల్లోలమైపోయింది.

ఈ లోకంలో దిక్కులేనివారి గతి ఇంత దయనీయమా!

మార్తమ్మ నిజంగా దిక్కులేనిదే! ఈ నాలుగేళ్ళలోనూ ఆ అమ్మాయిని చూడటానికి వాళ్ళ ఊరునుంచి ఒక్కరు కూడా వచ్చిన పాపాన పోలేదు.

ఈ మార్తమ్మ ఎక్కడ పుట్టిందో, ఎక్కడ పెరిగిందో, ఇక్కడ నాలుగేళ్ళు బొక్కెడు కూటికై పడి వుండి అరవచాకిరీ చేసింది. తుదకీనాటికి పాస్టరుగారి పెద్దబ్బాయి పుణ్యమా అని కన్యాత్వంకాస్తా కోల్పోయింది.

ఇంకేం మిగిలింది మార్తాకి?

మార్నాటి మంచీ మార్తా మా ఇంట్లోనే ఉంది. పొద్దస్తమానమూ బైబిలుచదువుతు కూర్చునేది.

### రేడియో విశ్వవిద్యాలయం!

క్లాసురూమ్ తరగతులకు హాజరు కాలేని ఉద్యోగులకు, గృహిణులకు, మిగిలినవారికి వుపయోగపడే విధంగా జపాను ఆకాశవాణి విశ్వవిద్యాలయాన్ని ప్రారంభిస్తున్నారు. ఇటీవలే జపాను పార్లమెంటు యీ చట్టాన్ని అనుమతిస్తూ, ఉన్నతవిద్య అందరికీ అందుబాటులో వుండాలని అభిప్రాయ పడింది. దీనిని 1984 లో ప్రారంభిస్తారు. ఇంట్లోనే రేడియో, లేక టెలివిజన్ ముందు కూర్చుని మీరు పాఠాలను విని డిగ్రీలను సంపాదించుకోవచ్చు. వివిధ సంస్థలనుండి సుమారు 300 మంది ప్రొఫెసర్లు విజిటింగ్ ప్రొఫెసర్లుగా తమ వుపన్యాసాలనిస్తారు.

డాక్టరుతో సంప్రదించి మార్తా గర్భభారాన్ని తొలగించే ప్రయత్నం చేద్దామనుకున్నాము. కాని మార్తమ్మ అందుకు ససేమిరా ఒప్పుకోలేదు.

"వొద్దు బాబాయ్! ప్రభువు చిత్తం ఎట్లా వుంటే అట్లా జరుగుతుంది. జరిగింది చాలక ఆ పాపం చెయ్యలేను. చేస్తే మళ్ళీ చర్చిలో అడుగు పెట్టలేను."

అంతటితో ఆ ప్రయత్నం విరమించుకున్నాము.

మార్తాను గుణకు మా వాటాలో ఆశ్రయం యిచ్చినందుకు పాస్టరు ఏమీ అనలేదు. కాని పాస్టరు భార్య మటుకు ఒహటే గొణుగుడు.

ఇక ఆ ఇంట్లో ఉండడం దుస్సాధ్యం అని తెలుసుకున్నాము. కాని ఉన్న పళాన్న అద్దె కొంప లెక్కడ దొరుకుతాయి!

ఓరోజు స్కూల్ నుండి వచ్చేసరికి మా ఆవిడ మొఖం అంతా గంటు పెట్టుకునిఉంది. మార్తమ్మ ఓ మూల పడుకుని ఏడుస్తూంది.

అర్ధాంగిని ఓ పక్కకుపిలిచి కారణం అడిగాను.

"ఏమిటో పాడుమాటలు; పోనీయండి."

"ఏమైందో చెప్పవేమండు" కొంచెం గట్టిగానే అడిగాను.

"ఏవుంది? పాడుముండల నోటికి మంచి

మాటలెలా వస్తాయి ? పాస్టరు భార్య మూసై పెద్దగా పోట్లాటకు లంకించుకుంది. మికూ, మార్తాకు అల్లికట్టేసింది. దాంతో మార్తమ్మ ఏడుస్తూ కూచుంది. వాళ్ళ ఊరికి వెళ్లిపోతానంటూ ఉంది.''

ఎంత నీచపుమాట !

క్రోధావేశంతో నాలోని అణువణువూ ఉడికిపోయింది.

ఆ పళాన్నవెళ్లి పాస్టర్నీ, అతగాడి పెళ్లాన్నీ ఉతికేద్దామనిపించింది.

''పోనీండి. వెధవగొడవ. నలుగురూ వింటే మనకేవల్లదనం. అర్జంటుగా ఎక్కడైనా వేరే ఇల్లు చూడండి. అద్దె ఎంతైనా కానివ్వండి'' శ్రీమతి పురమాయించింది.

నాకు మార్తమ్మ వైపు కన్నెత్తి చూడ్డానిక్కూడా భయంవేసింది.

అదె కొంపలకోసం నా అన్వేషణ ఆక్షణం నుంచీ తీవ్రతరంచేశాను.

కాని ఆ మర్నాడు సాయంత్రం నేను ఇంటికొచ్చేసరికి మా ఆవిడ దిగులుగా కూచుని ఉంది

''మళ్లీ ఏవైంది?''అన్నాను పక్కవాటా వైపు మహాకోపంగా చూస్తూ.

''మార్త వెళ్లిపోయిందండి''

''వెళ్లిపోయిందా ! ? ఎక్కడికి ?''

''వాళ్ళ ఊరికి ఎంత వొద్దన్నావినలేదు. తనవల్ల మనకు అపవాదు రావడంకన్నా తను చావడం మంచిదంది మీరు రాకముందే వెళ్లిపోతానని పట్టుపట్టింది. విధిలేక ఓ వొందరూపాయలిచ్చిపంపాను.''

నిశ్చేష్టుణ్ణై కుర్చీలో కూలబడ్డాను.

''మార్త దేవతండి ఆ అమ్మాయిని అన్నవాళ్ళు పురుగులుపడి చస్తారు'' అంది కసిగానూ, బిగ్గరగానూ.

నేను నోటమాటరాక కూచున్నాను.

''వెళ్తూ వెళ్తూ ఎంత ఏడ్చిందని ! మనం చూపిన కరుణకి వందనాలు చెల్లిస్తున్నాననీ, వాళ్ళ ఏసుప్రభువు మనల్ని ఎప్పుడూ కాపాడతాడనీ, పరలోకంలో ఉన్న ఆ దేవుడు అందరి పాపాలూ మన్నిస్తాడనీ, తాను జీవించి ఉన్నంతకాలం మనకోసం ప్రార్థిస్తాననీ ఏమేమో అని సెలవు తీసుకుని వెళ్లిపోయిందండి'' అంటూ నోటికి చెంగు అడ్డుపెట్టుకుంది మా ఆవిడ.

నా కళ్ళు కూడా చెమ్మగిల్లాయి.

గుంటూరు జిల్లాలో ఏదో మారుమూల పల్లెటూరట ! ఏ ఊరో ! ఎక్కడి కాకినాడ ! ఎక్కడి గుంటూరుజిల్లా ! ఎలా ప్రయాణం చేస్తుందో ! ఊరికి చేరాక తల్లీ, తక్కిన బంధువులూ ఎంతగా ఈసడిస్తారో ! చివరికి మార్తమ్మ ఏమైపోతుందో !

ఈ ఆలోచనలతో ఆ రాత్రంతా మా ఇద్దరికీ నిద్రపట్టలేదు.

''పరిశుద్ధ పరిశుద్ధ పరిశుద్ధ ప్రభువా!'' అని మార్త ప్రార్థిస్తున్నట్లే వినిపిస్తోంది.

ఏమైనా దేవదూతలాంటి మార్తమ్మను ఇంత చేసిన పాస్టరుగారింట్లో ఎంత మాత్రమూ ఉండదలచలేదు.

మర్నాడే మరో ఇంటికి మారాము.

రోజులు గడుస్తున్నాయిగాని మార్తమ్మ నుంచి ఒక్క ఉత్తరమైనా రాలేదు. ఒకవేళ పాస్టరుగారింటి అడ్రస్‌కు రాస్తుందేమో అని ఆ ప్రాంతపు పోస్టుమాన్‌కు కూడా చెప్పి ఉంచాము. కాని ప్రయోజనం లేకపోయింది.

మా యింటిలో మార్తమ్మను తలవని రోజు లేదు. నా శ్రీమతి మరీను ఆ రోజు మార్తమ్మను వెళ్ళనిచ్చినందుకే తన్ని తాను ఎప్పుడూ తిట్టుకుంటూ వుంది. సంతాన హీనులమైన మాకు మార్త ఇన్నాళ్ళూ పుత్ర నిర్విశేషంగా ఉంటూ వచ్చింది. ఇప్పుడు మార్తలేని ఇల్లు ఎలాగో ఉంది. అందునా ఆ అమ్మాయి తనఊళ్ళో ఎన్ని కష్టాలు పడుతూందో అన్న భావన కలిగాక మరీ బాధాకరంగా ఉంది.

''ఒకమారు వాళ్ళ ఊరు వెళ్లి మార్త ఎలా ఉందో చూసొద్దామండి'' అంటుంది మా ఆవిడ.

''ఏ ఊరని పోము? అదేవిటో నువ్వుసరిగ్గా కనుక్కున్నావు కావుగదా! పాస్టరుకొక్కడికే తెలుసు. అతన్ని ఎలా అడగను? అడిగితే మటుకు చెబుతాడా?''

''మీ స్కూల్ అడ్రస్ మార్తకు తెలియదూ? ఒక్క ఉత్తరం రాయలేకపోయింది'' నిట్టూరుస్తుంది.

అంతకు మించి ఏం చెయ్యగలం?

మార్తమ్మ వెళ్లిపోయి దాదాపు సంవత్సరం గడిచింది.

ఇన్నాళ్ళకు స్కూల్ అడ్రసుకు మార్తమ్మ దస్తూరిలో ఓ ఉత్తరం వచ్చింది. దానిమీద 'జగన్నాథం పంతులుగారు, స్కూలుమేష్టరు కాకినాడ' అని మాత్రమే ఉంది. విప్పి చూశాము. ఎప్పుడు రాసింది తారీఖు వేసి లేదు. చదివాము.

''బాబాయి గారికి,

మీ కూతురు మార్తమ్మ అనేక వేల వందనాలు చెల్లిస్తూ వ్రాయునది. చాలా ఆలస్యంగా ఉత్తరం రాస్తున్నందుకు మన్నించగలరు. మన్నించవలసిందిగా పిన్నికి కూడా చెప్పండి. ఏసుప్రభువు దయవల్ల నాకు కొడుకు పుట్టాడు. మొన్నటి క్రిస్టమస్‌కి నాలుగు నెలలు నిండివయ్యి. వాణ్ణి ప్రభువు సేవకుడుగా, మంచివాడుగా పెంచాలనుకుంటున్నాము. ఇక్కడ నా పరిస్థితి ఏమీ బాగాలేదు





వేవిక్కడికి వచ్చేసరికి మా అమ్మ చచ్చిపోయింది. అన్నలు నన్ను చీదరించుకొని ఇంట్లోకి రానియ్యలేదు. మా మేనత్త అన్నమ్మదగ్గరుంటూ ఏదో కూలి చేసుకుని బతుకుతున్నాము. ఇంక పెళ్ళి చేసుకోవడం నాకు ఇష్టంలేదు. కాని జనం అట్లా బతకనివ్వట్లేదు. ఇక్కడ చాలామంది దుర్మార్గులు నాపై కన్నువేసి వున్నారు. వాళ్ళను తప్పించుకొని బ్రతకడం కష్టంగా ఉంది. మీకు ఇష్టమయితే అక్కడికేవచ్చి ఏ పని మో చేసుకుని మీ నువవణ్ణి పోషించుకుందామని ఉంది. ఏ సంగతీ వెంటనే తెలుప వలసింది మా ఊరి అడ్రసు ఈ క్రింద ఇస్తున్నాను. మీ ఉత్తరం కోసం వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తుంటాను. తప్పు లుంటే మన్నించవలెను.

ఇంతే సంగతుల

ఇట్లు,

మీ కూతురు

మార్తామగుణ.

క్రిస్మస్ వెళ్ళిన మర్నాడు వ్రాసిన ఉత్తరం అన్నమాట! క్రిస్మస్ గడచి ఇప్పటికి రెండు నెలలు కావొస్తోంది. అప్పుడు వ్రాసిన ఉత్తరం ఇప్పటికి చేరింది.

జాలి చేతబట్టుకుని గబగబా ఇంటి కెళ్ళాను. శ్రీమతి చేతికిచ్చాను. చదువుకుంది.

"ఇంకా చూస్తారేనండి, బయల్దేరండి, వెళ్దాం. రెండునెల్ల క్రితమే కష్టాల్లో ఉంటే ఇప్పుడెలా ఉందో! వెళ్ళి మా రాన్నూ పిల్లాణ్ణీ తెచ్చుకుందాం" తొందరించింది.

"అనవసరంగా కంగారుపడకు, ఏ మీ జరగదు అంతదూరం ఇద్దరమూ ఎందుకు? నేను ఈరోజే వెళ్ళి తీసుకొస్తానులే" అని నచ్చచెప్పాను.

ఆ రాత్రే బస్సులో బయల్దేరాను.

ప్రయాణం చేసినంతసేపూ మార్తమ్మ భవిష్యత్తే నా మనస్సులో మెదిలింది

ఒక దుర్మార్గుడు చేసినపనికి ఆ అమ్మాయి జీవితశోభ అంతా పద్దెనిమిదేళ్ళకే నసిపోవడం నాకు మతరామూ ఇష్టంలేదు. మార్తమ్మ కొడుకును మేము పెంచుకుని ఆమెకు వివాహం జరిపించడం మా ధర్మం.

ఒకవేళ ఆమె అందుకు ఇష్టపడకపోతే...

అప్పుడయినా మార్తమ్మను బాగా చదివించి సంఘంలో ఒక మనిషిగా చెయ్యాలి.

ఈ తీర్మానంతో నా మనస్సు కుదుటపడింది. ఆ తరవాత బస్సు కుదుపులక్కూడా లెక్కించని కునుకు పట్టింది

గుంటూరు బస్స్టాండులో బస్సు ఆగిందాకా మెలకువరాలేదు.

అప్పటికి తెల్లవారిపోయింది. బస్సుదిగి మొహంకడుక్కుని కాంటిన్లో టిఫిన్ చేశాను. మార్తమ్మ వాళ్ళ ఊరివైపు వెళ్ళేబస్సు ఎక్కికూ మన్నాను.

బస్సు కదిలాక ఆ రోజు ఆదివారం అన్న మాట జ్ఞాపకానికి వచ్చింది.

నేను ఊరు చేరేసరికి మార్తమ్మ చర్చికి వెళ్ళి వాళ్ళ ప్రభువును ప్రార్థిస్తూ ఉంటుంది. నాకోసమూ, నా భార్యకోసమూ కూడా ప్రార్థిస్తూ ఉంటుంది. మేమంటే అంత అభిమానం మార్తమ్మకి.

పదిగంటలకు బస్సు వినుకొండ చేరుకుంది. అక్కణ్ణించి రెండుమైళ్ళు నడిస్తేగాని మార్తమ్మ ఊరురాదు

చకచకా నడక ప్రారంభించాను.

అరగంటలో ఊరి పొలిమేరల్లోని చర్చి గోపురం కనిపించింది. గంటలు మ్రోగుతున్నాయి; నా గుండె కూడా తెలియని రీతిలో మోగుతోంది

గబగబా చర్చి చేరుకుని లోనికి తొంగి చూశాను.

పాస్టరుగారు వేదికమీద నుండి దేవుణ్ణి ప్రార్థిస్తున్నారు. తక్కిన అందరూ మోకరిలి ఆయన్ని అనుకరిస్తున్నారు

## కాళ్ళతో నడిపేకారు!

జపానులోని టొయోటా మోటారు కంపెనీ వారు కాళ్ళతో నడిపే కారును తయారుచేశారు. దీనినుపయోగించటానికి చేతులవసరంలేదు. థాలిడోమైడ్ వలన వికలాంగులై పుట్టిన వారికోసం, చేతులు వుపయోగించలేని లేక చేతులులేని యితర వికలాంగుల కోసం కారు తయారుచేయటానికి చాలా కాలంగా కృషి జరుగుతున్నది. ఈ కారును కాళ్ళతో నడుపవచ్చు. మరికొన్ని భాగాలను తలతో లేక నోటి మాటలతో వుపయోగించవచ్చు.

వెనుకనుండి అందర్నీ పరికించాను.

ఊహుఁ... ఇలా తెలియదు అందరూ బయటికొస్తే గాని తేలదు ప్రార్థనలు పూర్తయ్యేదాకా అలాగే అక్కడే కాచుక్కూచున్నాను.

ఒక్కొక్కరే నాకు అభిముఖంగా వస్తున్నారు.

ఏదీ మార్తా! ?...

చివరికి ఎవరో ఒకావిణ్ణి అన్నమ్మగారి ల్లెక్కడో తెలుసుకుని ఆ వైపుగా కదిలాను

ఊరికో ప్రక్కన ఒంటి నిట్టాడి ఇంటి ముందు చెట్టునీడన గుక్కపెట్టి ఏడుస్తున్న పసివాణ్ణి సముదాయిస్తూ అటూ ఇటూ తిరుగుతున్న ముదివగ్గు కనిపించింది

"మీ పేరు అన్నమ్మగారా ?" సమీపిస్తూ అడిగాను.

"అవును బాబూ! నాపేరే అన్నమ్మ" అందామె చాలా వినయంగా.

"మార్తమ్మ..."

"ఇంకెక్కడి మార్తమ్మ తండ్రో!" అంటూ ఆమె గుండె బాదుకుంటూ వలవల ఏడవసాగింది.

"ఏమైందమ్మా? మార్తమ్మకేమైంది?" ఆదుర్దాగా అడిగాను.

"నా తల్లి - నా బంగారు తల్లి... ఆ తల్లిని ఇంకెక్కడ చూస్తామురో దేవుడో...!" ఆమె ఏడుపు అధికరించింది.

మార్తమ్మ కేమైందో ఆవిడ ఇక చెప్ప నక్కరలేకపోయింది

నాలో అణువణువూ స్తంభించినట్లయిపోయింది.

ఇకపై మార్తను ఓ ఇంటిదాన్ని చెయ్యలేను; చదువు చెప్పించి ఓ మనిషిని చెయ్యలేను. వెర్రిగా దిక్కులు చూస్తూ నించున్నాను.

"పరిశుద్ధ పరిశుద్ధ పరిశుద్ధ ప్రభువా!" మార్తమ్మ స్వరం గాలితో తేలియాడుతూ లీలగా వినిపిస్తున్నట్లు తోచింది

అప్రయత్నంగా నా కళ్ళ వెంట భాష్ప బిందువులు జాలువారసాగాయి.

అది చూసి ఆమె అంత దుఃఖంలోనూ "తవురెవురు బాబూ?" అంది.

"నేను... నేను... కాకినాడ..." అని ఏమో గొణిగాను కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"కాకినాడ జగన్నాథం బాబుగారా! ఎప్పుడూ మీమాటే బాబూ, బిడ్డకి! బాబాయి, పిన్ని

## ప్రభువునందు నిద్రించెను

అని వొకటే కలవరింత...కాకినాడ, కాకినాడ అంటూ అట్నాగే పోయింది బాబూ మీ మార్తమ్మ... ఈవూరి ... కొడుకులు దాన్ని బతకనియ్యలేదు నాయినో, మానవతి మార్తమ్మను ఏ ... కొడుకులో చెరిచి చంపేశారు తండ్రీ!'' నెత్తి మోదుకుంటూ వలవల ఏడుస్తోంది అన్నమ్మ.

పరిశుద్ధ హృదయం కలిగిన మార్తా సుగుణ దేహం రెండుకాళ్ల పశువుల ఆకలికి బలైపోయింది.

హే భగవాన్! ఎక్కడున్నావు ?

నాకూ కన్నీళ్లు పొంగిపొర్లి వస్తున్నాయి.

అయినా నిభాయించుకుని "మార్తమ్మను ఎక్కడ ఖననం చేశారమ్మా?" అన్నాను.

అర్థం కానట్లు చూసింది అన్నమ్మ.

"అదేనమ్మా! సమాధి!"

"రండి బాబూ! తవురు చూడకపోతే భూమి అడుగున మా మార్తమ్మ విలవిల కొట్టుకుంటాది" అంటూ పిల్లాణ్ణి ఎత్తుకుని ఉరవడించింది.

బరువెక్కిన గుండెతో ఆమెను అనుసరించాము.

ఊరికి మరో చివర్న ఉన్న శ్మశానంలోనికి దారితీసింది.

క్రైస్తవుల శ్మశానం!... వరసగా బండ రాళ్ల పాతి ఉన్నాయి.

ఓ చోట ఆగింది.

"ఇక్కడే బాబూ!..." అంటూ ఆపైన మాటరాక కూలబడి కుమిలి దుఃఖించసాగింది.

పాస్టరుగారింటిలో మా వాటా వైపు మొదటిసారి బెరుగ్గా చూసిన మార్తమ్మ, బాబాయి, పిన్ని అన్న వరసలు కలుపుకుని మమ్మల్ని ఆదరించిన మార్తమ్మ, పాస్టరు గారింటి చాకిరీ అంతా చేస్తూ వాళ్లచేత తిట్లూ, తన్నులూ తింటూ కూడా చలించని ప్రశాంత జీవి మార్తమ్మ, బైబిల్ పఠనం ఏమరక, చర్చిలో మైమరిచే వాస్తవ క్రైస్తవ స్త్రీ మార్తమ్మ నేడు ఇక్కడ శాశ్వత విశ్రాంతి తీసుకుంటున్నది.

"పరిశుద్ధ పరిశుద్ధ పరిశుద్ధ ప్రభువా!"

భూమి అడుగు నుండి దైవ సంగీతం మార్తా స్వరంలో వెలువడుతున్నట్లు తోచి నా వొళ్లు జలదరించింది.

అప్రయత్నంగా నా కళ్లు నిలువురాతిపై చెక్కబడిన అక్షరాలపై నిలిచాయి.

"...మార్తా సుగుణమ్మ 1981 సం॥ జనవరి 16 వ తేదీన ప్రభువునందు నిద్రించెను!"

"ప్రభువునందు నిద్రించెను!"

ఆ వాక్యంచూడగానే అప్పటిదాకా సంక్షుభితంగా ఉన్న నా హృదయం ఒక్కమారుగా అలలు అణగిన కొలనులాగా సుప్రశాంతమై పోయింది.

మా మార్తమ్మ ప్రభువునందు నిద్రించింది ఇకపై ఏ పాస్టరు కొడుకులూ, ఏ వూరి దుర్మార్గులూ ఆమెనేమీ చెయ్యజాలరు. ఈ నిద్ర నుండి మేల్కొలుపజాలరు.

అన్నమ్మ ఏదో అంటూంది

"బాబాయీ, పిన్నీ నా బాబును పెంచి పెద్దచేసి చదువు చెప్పిస్తే రత్తా మతం అనే భేదం వాళ్లకి లేదత్తా" అనేది మార్తమ్మ."

అన్నమ్మ చేతుల్లో కేరింతలాడుతున్న పసివాణ్ణి చూశాను.

నా హృదయం మరింత తేలికపడినట్లయింది.

"అవునమ్మా! ఈ బిడ్డ ఇక మా బిడ్డ. ఇలా ఇవ్వమ్మా!" అంటూ మార్తా కొడుకును ఎత్తుకున్నాను.

ఆ పసివాడి స్పర్శ నాకు అలౌకికమైన ఆనందం కలిగించింది.

"మార్తమ్మా! నువ్వు కోరుకున్న ప్రకారమే నీ బిడ్డని నీ ప్రభువుకు భక్తుడుగా, మంచివాడుగానే పెంచుతాను" అనుకున్నాను మనస్సులో.

"ప్రభువు తవుర్ని చల్లగా చూస్తాడు బాబూ!" అంది అన్నమ్మ గద్గదస్వరంతో. ఆమె కళ్లు ఆనందబాష్పాలతో నిండిపోయాయి.

మార్తమ్మ సమాధి వైపు కరువుతీరా చూసి "వస్తానమ్మా!" అంటూ పసివాణ్ణి ఎత్తుకుని వినుకొండ దిక్కుగా నడక సాగించాము.

ప్రభువునందు నిద్రించిన మార్తా సుగుణ ఆత్మకిక శాంతి కాక మరేమి ఉంటుంది?

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.



# నువ్వంటే నాకెంతో ఇష్టం

"సింహం"

"ఏమిటి జానకీ! నీ పిచ్చి నేనెప్పుడూ ఇంట్లోనే నిన్నంటిపెట్టుకుని వుండాలంటే ఎలా కుదురుతుంది?"

విసుగ్గా, కాల్తున్న సిగరెట్టుని గది మూలకి విసిరేడు రామం.

"ఎందుకు కుదరదండీ? సాయంత్రం ఆఫీసునుండి వచ్చేక మీరు చేసే పనేమిటి? ఫ్రెండ్స్‌తో అలా రోడ్ల వెంబడి తిరగకపోతే నేమి? కాస్త ఇంటిపట్టున వుంటే నేను సంతోషించేదాన్ని కదా! ప్రొద్దుననగా ఇంట్లోంచి వెళ్ళిపోతే మళ్ళీ రాత్రి ఏ పదింటికోకదా మిమ్మల్ని చూసేది! పెళ్ళయిన కొత్తలోనే నయం కాస్త ఇంటిపట్టునైనా వుండేవారు. ఇదిగో ఇప్పుడా ఏజెన్సీ తీసుకున్నాక మీతో మాటలే కరువైపోయాయి"

ఇంకాస్సేపయితే ఏడ్చెయ్యడానికి సిద్ధంగా వుంది జానకి

జానకి మనఃపరిస్థితి అర్థమయింది రామానికి

జానకి తన సాంగత్యం కోరుతోంది. ఆఫీసు వేళలు తప్పించి తక్కిన సమయాలలో తనతోనే గడపాలని ఆశపడుతోంది

రామం కళ్ళలో గర్వం తొణికిసలాడింది. భార్య నువ్వే కావాలంటే ఏ భర్త గర్వపడకుండా వుంటాడు?

రామం, జానకిలది లవ్ మ్యారేజి లవ్వంటే మరీ మన సినిమాలో చూపించే పిచ్చిలవ్వు కాదు రామం, జానకి ఒకే కాలేజీలో చదివేరు చదువుకునే రోజులనుండి ఒకరంటే ఒకరికి మంచి గౌరవముంది కాలేజి అంతా అల్లరిపిల్లాడిగా పేరు గాంచిన రామం జానకి దగ్గరికొచ్చేసరికి మౌనంగా తప్పుకునేవాడు మొదట్లో పెదగా పట్టించుకోకపోయినా తరువాత అది కనిపెట్టిన రామం ఫ్రెండు రామానికి, జానకికి లవ్వంటగట్టేరు. అంతవరకూ ఆ వుద్దేశ్యమేలేని వాళ్ళిద్దరూ అప్పటి నుండి ఒకళ్ళని జూసి ఒకళ్ళు సిగ్గు పడడం ప్రారంభించేరు అంటే [మన సినిమాల పరిభాషలో చెప్పాలంటే] ప్రేమ మొదలయిందన్నమాటేగా!

ఆ ప్రేమ మొదట్లో ఉత్తరాలు రాసుకోవడం, తరువాత పార్కులో కలుసుకోవడం వరకు పాకి చివరికి కాలేజి గోడలెక్కి కూర్చుంది.

ఇక లాభం లేదని జానకి తల్లిదండ్రులు రామం తల్లిదండ్రులతో మాట్లాడి ఆ వేసవి సెలవులోనే వాళ్ళిద్దరికీ పెళ్లి చేసేసారు అదృష్టవశాత్తు పెళ్ళయిన సంవత్సరమే ఇద్దరికీ డిగ్రీలొచ్చేసాయి.

తనకుద్యోగం దొరికితేగాని జానకిని కాపురానికి తీసుకు వెళ్ళనన్నాడు రామం. "ఫరవాలేదు పెద్దవాళ్ళం మేం వందరం వున్నాం గదా! నీకెందుకా భయం?" అన్నారు రామం అత్తమామలు, తల్లిదండ్రులు. కాని రామం ససేమిరా ఒప్పుకోలేదు.

పెళ్ళయిన రెండేళ్ళకి రామానికి ఉద్యోగం దొరికింది ఉద్యోగం రాగానే భార్యని తెచ్చేసుకున్నాడు రామం నిరుద్యోగ పర్వంలోనే తండ్రిపోయాడు. కుటుంబ భారం భుజాల మీద పడింది.

అయినా భార్య వచ్చిన సంతోషంలో కొన్నాళ్ళు ఆఫీసు, ఇల్లు తప్ప ఇంకెక్కడికీ వెళ్ళేవాడుగాదు ఇంతలో రామానికో కొడుకు పుట్టుకొచ్చాడు తమ్ముళ్ళిద్దరూ కాలేజి కొచ్చారు వచ్చే జీతం కుటుంబం గడవడానికి బొటాబొటిగా సరిపోతోంది. మరి మిగిలిన ఖర్చుల మాటేమిటి?

అందుకే రామం రెండు షాపుల్లో ఎకౌంట్సు రాయడానికి ఒప్పుకున్నాడు. డబ్బొచ్చే, ఇతర వ్యాపకాలేర్పరచుకున్నాడు.

అతనికి తెల్లవారిలేచిందగ్గర్నుండి ఆఫీసు, షాపులు, ఇతర వ్యాపకాలు చూసుకునేసరికి రాత్రి పదవుతుంది ఇంక భార్యతో మాట్లాడానికి తీరికెక్కడుంటుంది?

'అయినా మగాడనేవాడు ఎప్పుడూ బిజీగా వుంటేనే ఇంట్లో భార్యకి అతనిమీద గ్లామరు స్థిరంగా వుంటుంది అనేది రామం గట్టి అభిప్రాయం.

రామం భుజాలమీద చాలా బాధ్యతలున్నాయి అందులో మొదటిది ప్రేమించి పెళ్ళాడిన జానకికి ఏ లోటూ రాకుండా చూసుకోవడం, రెండోది కొడుకుని సక్రమంగా పెంచడం, మూడోది తమ్ముళ్ళిద్దరికీ చదువులు చెప్పించడం వీటన్నింటికీ కావలసింది డబ్బు అతనికొచ్చే జీతంలో ఇవన్నీ జరగవు. అందుకే అతను పై సంపాదన ఏర్పాటు చేసుకున్నాడు ఇవన్నీ చెబితే జానకికి అర్థం గావు. పైగా "మీరు బాగా మారిపోయేరు. "నేనంటే మొహం మొత్తింది" అంటూ శోకాలు తీస్తోంది. తనతో సమానంగా చదువుకున్న జానకి అంత సెంటిమెంటల్‌గా ప్రవర్తించడం రామానికి చాలా ఆశ్చర్యం కల్గిస్తూ వుంటుంది. అందుకే ఈసారి అతను ఆమెతో వాదన పెట్టుకో దల్చుకోలేదు.

'ఓకే... ఓకే.. అలాగే ఇక నుండి ఆఫీసు టైములో తప్పిస్తే మిగిలిన టైమంతా ఇంట్లోనే నీతోనే వుంటాను. సరేనా! ముందెళ్ళి మొహం కడుక్కునిరా. ఏడ్చేడ్చి మొహం ఎలాగయిపోయిందో చూడు."

లాలనగా జానకిని ఓదార్చి బాత్‌రూంలోకి పంపించాడు రామం.

* * *

ఆ రోజు నుండి రామం దినచర్య మారిపోయింది. ఉదయం ఏనిమిది గంటలకి నిద్ర లేవడం, మొహం కడుక్కొనివచ్చి వంటింట్లో జానకి ఎదురుగుండా పీటవేసుకుని కూర్చొని హస్కు వేసుకోవడం, ఆ హస్కులోనే డెయిలీ పేపరు గూడా చదివెయ్యడం, పదయ్యాక భోజనం చేసి ఆఫీసుకెళడం, సాయంత్రం అయిదున్నరయేసరికి ఇంటికి రావడం, మళ్ళీ జానకితో హస్కు, తొమ్మిదింటికల్లా భోజనాలు కానిచ్చేసి పదయ్యేసరికి జానకి పరిష్వంగంలో నిద్ర.

ఆదివారాలు వస్తే —

ఒకాదివారం జూ, ఇంకో ఆదివారం సింహాచలం; మరో ఆదివారం అప్పికొండ —

ఫినిష్ చూపినవన్నీ మరోసారి చూడడం అయిపోయింది.

నాలుగో ఆదివారంనాడు ఏంచెయ్యాలో బోధపడలేదు ఇద్దరికీ ఇంట్లోనే వుండి ఎంతసేపూ ఒకరి మొహం మరొకరు చూసుకోవడమంటే పరమ బోరు

## నీ డ ...

నీ అడుగులో అడుగేస్తూ —
నీ వెన్నంటి నడుస్తూ —
కాకాపడుతుంది - చెంచాగిరీచేస్తుంది
నీమీద వెలుతురున్నంతవరకే - !
కానీ పాపం —
చీకటి నీ చుట్టూ కమ్మితే
అదీ చీకటితో కలిసి
నిన్ను వెక్కిరిస్తుంది !

— రాళ్ళబండి కవితాప్రసాద్

"అబ్బ ... బోరు కొట్టేస్తోందండీ. ఏదైనా పిక్చరుకి పోదామా"

బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ అడిగింది జానకి.

"ఏ సినిమా కెళదాం ? వచ్చినవన్నీ చూసేసాం. పూర్ణాలో పాతపిక్చరు పరివర్తన ఆడుతోంది. దానికి వెళ్ళాము" అన్నాడు సిగరెట్టు ఆఖరి పఫ్ లాగి కిటికీలో నుండి బయటకు విసిరేస్తూ రామం.

"మహాశయా! మీ పెద్దలందరికీ ఓ నమస్కారం. నేరకపోయి సినిమా కెళ్దామన్నాను. నన్ను క్షమించండి"

అంటూ మంచం మీద కూలబడింది జానకి.

అయితే ఏంచేద్దాం? ఆలోచనలో పడ్డారు దంపతులిద్దరూ.

"నాదొక ఐడియా. జీడిపప్పు ఉప్మా చెయ్యి, నే సాయంజేస్తాను, ఈ సాయం కాలం గడిచిపోతుంది"

సలహాచెప్పాడు రామం. ఓకే అంటూ లేచింది జానకి వంటగదిలో ఉప్మా చెయ్యడానికి బయల్దేరారు భార్యాభర్తలు.

"ఇంకొంచెం నూనె వెయ్యి, ఆవాలు ఎండు మిర్చిలు ఇంకా వున్నాయిగా."

జానకి గోధుమరవ్వ కొలుస్తువుంటే మరికొంచెం రవ్వ పళ్ళెంలో పోసాడు రామం.

"మరో రెండు పచ్చిమిరపకాయలు వెయ్యి రుచి సువాసన వుండాలి గదా !"

పచ్చిమిరపకాయలు రెండు తీసి పోపులో వేయబోయాడు రామం.

"అబ్బబ్బబ్బ... ఊరుకోండి బాబూ ! ఆ మిరపకాయలు కూడా వేసేస్తే నోరు మండిపోతుంది. ఉప్మా అసలు నోట్లో పెట్టుకోలేరు. అయినా మీ కెందుకు వంటింటి గొడవ పోయి పేపరు చదువుకోండి. టిఫిను తయారుకాగానే నేనే పట్టుకొస్తాను."

ఓసారి రామం మీద విసుక్కుని ఉప్మా తయారు చెయ్యడంలో పడింది జానకి.

రామం నవ్వుకున్నాడు. మగవాడు బయట పనులు మానేసి వంటింట్లో కూర్చుంటే ఇలాగే అవసరమైనవి అనవసరమైనవి కలగజేసుకుంటూ వుంటాడు. ఆ విషయం జానకికి ఇప్పుడిప్పుడే తెలిసొస్తోంది.

ఆ మర్నాడు ... రామం ఆఫీసుకి సెలవు పెట్టాడు.

ఈ మధ్య అప్పుడప్పుడు ఇలాగే సెలవులు పెడుతున్నాడు ఆ సెలవునాడు సరదాగా ఎలాగ గడపాలో బోధపడడంలేదు జానకికి. ఎంతసేపూ ఒకళ్ళమొహం ఒకళ్ళు చూసుకుంటూ గడపడం చాలా బోరుగా వుంది ఇద్దరికీ

ఆ రోజు మధ్యాహ్నం పక్కింటి పిన్నిగారు, ఎదురింటి అక్కయ్యగారు వచ్చారు జానకితో హస్కు వేసుకు కూర్చోవడానికి.

"మావారింట్లోనే వున్నారండీ."

నసుగుతూ చెప్పింది జానకి.

"ఫరవాలేదులెండి. మేం మళ్ళీ వస్తాం"

అంటూ వెళ్ళిపోయారు వాళ్ళు. తనింట్లో వుండడం వలన జానకికి రోజూ మధ్యాహ్నం

కాలక్షేపానికి కుదరడం లేదు. దాంతో రిలీఫ్ లేక మరీ బోరు కొడుతోంది జానకికి. రామానికి కావలసింది కూడా అదే! అయినా పైకి-

"నేనింట్లో వుండడం వలన నీకు ఫ్రెండ్స్‌తో మాట్లాడుకోవడానికి వీలు అవడం లేదు కదూ!" అన్నాడు

"ఛ...ఛ... అదేం లేదు" అంది జానకి. ఆ అనడంలో డిల్లీనెస్ వుంది.

మనసులోనే నవ్వుకున్నాడు రామం.

తనెప్పుడూ ఇంట్లోనే వుండడం వలన ఇద్దరికీ మాట్లాడుకోడానికి సబ్జెక్టులేదు. వింతపేవూ ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకుంటూ ఏం మాట్లాడుకుంటారు? పోనీ ఎక్కడికైనా వెడదామంటే చంకలో పిల్లాడి నేసుకుని ఎక్కడికని తిరుగుతారు

"బజారుకెళ్ళి కూరలు తెండి" అంటూ పది రూపాయల నోటు, సంచి రామం చేతిలో పెట్టింది జానకి

జానకికి విసుగు వేస్తోందన్నమాట! వింత ప్రేమించి పెళ్ళాడినా ఇరవైనాలుగుగంటలూ

## నువ్వంటే నాకెంతో ఇష్టం

ఎదురుగా కూర్చుంటే విసుగెయ్యదూ!

ఆరోగ్యకరమైన మార్పే, వస్తోంది జానకిలో.

అయినా......

"అబ్బ... బద్ధకంగా వుంది... నేను వెళ్ళలేను జానకీ! ఫణిగాడ్ని పంపిద్దాం. ఒరే! ఫణీ!"

గట్టిగా కేక పెట్టాడు రామం.

"అతనెందుకు? అయినా అతనింట్లో లేడు. మీరే వెళండి."

అంటూ బలవంతంగా రామాన్ని వీధిలోకి నెట్టింది జానకి

ఇన్నాళ్ళకి జానకిలో తనకు కావలసిన మార్పు వచ్చినందుకు చాలా సంతోషించేడు రామం. ఇక తన నాటకం పూర్తిచెయ్యాలను కున్నాడు. ఆ రాత్రి జానకిని కౌగిట్లోకి తీసుకుని ముద్దుల ఫలహారం చేసిన తరువాత మొదలెట్టేడు:

"జానకీ! ఇప్పుడేమంటావు? నేను ఆఫీసు వేళల్లో తప్ప మిగిలిన సమయమంతా ఇంట్లోనే గడపడం వలన నన్ను చూసి చూసి నీకు విసుగెత్తి పోతోంది. నే నెప్పుడూ ఇంట్లోనే వుండటం వలన నీ స్నేహితులతో నువ్వు సరదాగా కాలక్షేపం చెయ్యడానికి కూడా నీకు కుదరడం లేదు అన్నింటికన్న ముఖ్యమైనది; వీధిలో కెళ్ళిన భర్త సాయంత్రమయ్యేసరికి తిరిగి ఇంటికి వస్తాడని ఎదురు చూడ్డంలోనే భార్యకు ఆనందం వుంది ఆ నిరీక్షణ ఎంతో మధురంగా వుంటుంది. కాని నీకు ఆ అవకాశం లేదు. అందుకే మన దాంపత్యంలోని మాధుర్యమంతా పోయినట్లనిపిస్తోంది. అవును కదూ! రేపటి నుండి నేను నా రొటీన్‌లో పడిపోతాను. అప్పుడొచ్చే ఆదివారం మనకెంతో విలువైనదిగా వుంటుంది"

చెప్పడం ఆపి లైటార్పేశాడు రామం.

ఆ మర్నాటి నుండి రామం తన పాత ధోరణిలో పడిపోయాడు

అయిదు రోజుల తరువాత వచ్చే ఆదివారం కోసం ఎదురు చూడసాగింది జానకి

# మీరెవరి మదినైనా కలవర పెట్టాలనుకున్నప్పుడు

## అమాయకత్వం చిందించే బొట్టు పెట్టుకోండి.

మీ కనురెప్పలలో తత్తరపాటు,
నడకలో వయ్యారంతోపాటు
నొసట శింగార్ కుమ్‌కుమ్ బొట్టు
పెట్టుకు చూడండి.
శింగార్ రంగులలోని
అత్యుత్తమ పదార్థాలతో
తయారైంది, మీ హావభావాలకు
సరితూగేలా...మీ బొట్టుల
అందాన్ని మరింత చేసేలా.

**శింగార్**

**కుమ్ కుమ్ బొట్టు**
**—భారతదేశపు**
**అత్యంత అందమైన**
**సౌందర్య తిలకం.**



# "క్రిస్మస్" గాథలు

మహాపురుషుల జన్మదినాలు మానవాళికి మహా పర్వదినాలు వారి జీవిత గాథలను స్మరించుకొని మననం చేసుకొని వారిని ఆదర్శంగా తీసికొని పురోగమించడం అవశ్య ఆచరణీయం కరుణామయుడైన 'క్రీస్తు' జన్మదినం కేవలం క్రైస్తవ మతావలంబులకు మాత్రమేగాక విశ్వప్రజానీకానికీ విశిష్ట పర్వదినం అదే 'క్రిస్మస్' శుభదినం !

## "క్రీస్తు" - అర్థము

"క్రీస్తు" అను 'హిబ్రూ' భాషా పదమునకు "అభిషిక్తుడు" అని అర్థము అనగా మానవకోటిని పాపపంకమునుండి వెలికిదీసి వారిని రక్షించుటకు అభిషేకించబడినవాడని ఒక అర్థము ఏ ఒక్క జాతికీ, ఏ ఒక్క దేశానికీ, ఏ ఒక్క కాలానికీ పరిమితంగాని, అలౌకిక భగవద్రాజ్యానికి "అభిషిక్తుడు" అని మరొక అర్థము భగవద్రాజ్య ప్రతిపాది యయిన




'క్రిస్మస్ తాత' —చిత్రం ఆర్ విశ్వనాథ్

యేసుక్రీస్తు జయంతి 'క్రిస్మస్' జగజ్జనులకు స్ఫూర్తిదాయకమైన శుభదినం ప్రమోద దాయకమైన పర్వదినం

క్రిస్మస్ పర్వదినాచారాలలో 'క్రిస్మస్ ట్రీ' అలంకరణ కడు ప్రాముఖ్యము వహించియున్నది ప్రతి క్రైస్తవ గృహమున ఒక చవుకు కొమ్మ నుంచి దాని నలంకరించుట పరిపాటి ఈ 'క్రిస్మస్ ట్రీ' గాథ ఒకటి ఉన్నది

## 'క్రిస్మస్ ట్రీ' పూర్వగాథ

క్రిస్మస్ చెట్టు ప్రతిష్ఠాపనాచారం తొలిదొలుత జర్మనీలో ఆరంభమయినది ఒకానొకసారి జర్మనీలో ఆ ప్రాంత జనులు "ఓక్" అనే చెట్టులో వర్షదేవత వసించునని, ఆ చెట్టునకు ఒకానొక బాలుని బలి నొసంగి వర్షదేవత అనుగ్రహం పొందవలెనని అందు కుపక్రమింపబోగా "బోనిఫేస్" అనే ఒక క్రైస్తవ మతబోధకుడు వారిని వారించి, ఆ చెట్టులో ఏ దేవతయూ లేదనీ, తానే స్వయముగా చెట్టును నరికి వారి మూఢనమ్మకాలను తొలగించి ఆ చెట్టుప్రక్కనే మొలకెత్తుచున్న చిన్న 'ఫర్' మొక్క నొకదానిని చూసి ఆ మొక్క వారు బలి ఈయదలచిన బాలునివలె నున్నదని తెలిపి ఆ ఫర్ మొక్కను క్రీస్తు బోధించిన పవిత్ర ప్రేమకూ, అమాయకతకూ నిదర్శనముగా ఒర్తింపచేసెను నాటినుండి 'ఫర్' మొక్కను క్రీస్తు ప్రబోధించిన ప్రేమకు సంకేతంగా నెంచి 'క్రిస్మస్ చెట్టు'గా క్రిస్మస్ సందర్భంలో అలంకరించుట ఆచారంగా రూపొందినది మన ప్రాంతంలో 'ఫర్' మొక్కలు లభ్యంగానందున వాటిబదులు 'చవుకు' మొక్కలు 'క్రిస్మస్ ట్రీ'లుగా అలంకరించబడుచున్నవి ఇదియే 'క్రిస్మస్ ట్రీ' అంతర్య గాథ !

క్రిస్మస్ వేడుకలలో మరొక ముఖ్యమైనది 'శాంటాక్లాస్'' ఆగమనం బాలల కత్యంత ప్రీతిపాత్రుడైన శాంటాక్లాస్ (క్రిస్మస్‌తాత) రెయిన్‌డీర్ జింకలచే లాగబడే 'స్లెడ్జ్' బండిపై బాలల కోసం ఎన్నో బహుమతులను తీసుకొని వస్తాడనీ ఎర్ర బట్టలు, తెల్లని గడ్డం, తలపై పొడవైన టోపీ ధరించి వచ్చి చప్పుడు గాకుండా తాను తెచ్చే రకరకాల కానుకలు రాత్రిపూట 'క్రిస్మస్ ట్రీ' క్రిందయుంచి వెడతాడనీ ప్రతీతి పాశ్చాత్య దేశాలలో ఈ నమ్మకం ప్రబలంగా వుంటుంది మన ప్రాంతంలోకూడ తమ పిల్లలకు తెలీకుండా పెద్దలే కానుకలు క్రిస్మస్ ట్రీ క్రింద రహస్యంగా నుంచి 'శాంటాక్లాస్' తెచ్చివుంటాడని పిల్లలను భ్రమింపచేస్తుంటారు కూడా

'క్రిస్మస్ ట్రీ'ముగ్గు —చిత్రం ఆర్ సత్యవతి





'కరుణామయుడు' —ఫోటో భీమిశెట్టి

## శాంటాక్లాస్ (క్రిస్మస్‌తాత) కథ

'శాంటాక్లాస్'అనబడే క్రిస్మస్ తాతయ్యకు సంబంధించిన ఒక పూర్వ గాథకూడ వున్నది క్రీస్తు జన్మించిన నాలుగు శతాబ్దాల తరువాత "లిసియా" అనే వర్తకుడుండేవాడు నిరుపేదయైన అతడు తన కుమార్తెలకు పెళ్ళి చేసే స్తోమతలేక బాధపడుచుండగా 'నికలస్' అనే బిషప్ వర్తకుడాతని ఆవేదనను గ్రహించి అతని కుమార్తెల పెండ్లికి సరిపడే ధనాన్ని సంచిలో నుంచి అతని ఇంట రహస్యముగా నుంచి వెళ్ళెనట ఆ సొమ్ముతో 'లిసియా' కుమార్తెల వివాహం చేసెనట ఆ 'నికలస్' తర్వాత "సెయింట్ నికోలస్" గానూ, క్రమంగా 'శాంటాక్లాస్' గానూ మారిపోయెనట ఆటు తర్వాత క్రమేణా శాంటాక్లాస్ అంటే పిల్లలకు కానుకలందించే 'క్రిస్మస్ తాతయ్య'గ నిలిచిపోయెనని పురాతన గాథ

మతోన్మాదుల దురాగతాలు – పాలకుల హెచ్చుమీరిన దౌర్జన్యాలకు నిలయంగా మారిన భూలోకంలో తన ప్రాణమును రుధిరమును క్రయధనంగ నిచ్చి 'సిలువకొయ్య' యనెడి నా మహాయజ్ఞ వేదికపై తనకుతానే యాగ పశువుగా సమర్పించుకొని కరుడుకట్టిన గుండెల్ని తన రక్తంతో కరగించి చీకటి బ్రతుకులలో కాంతి కిరణాలు వెదజల్లిన అవతార పురుషుడు క్రీస్తు ప్రేమ, కరుణ, త్యాగం, మానవసేవ ఇత్యాదిగా గల సుగుణ సంపత్తికి విపుల వ్యాఖ్యానం జీసస్ జీవనం విశ్వజనులకు పూజా భాజనం

క్రీస్తు సూక్తులు నేటి కల్లోల విశ్వానికి కమనీయ సుధాస్రవంతులు ఆ మహనీయుని ప్రబోధాన్ని ఆచరణలో ఆదర్శంగా అనుసరించేందుకు నిర్దేశితమైన ఈ క్రిస్మస్ శుభదినం నిఖిలప్రజాళికి ప్రమోదదాయక పర్వదినం !!

— మారుతి

# పాల్ నురుగల సైన్యం రావాలి! మురికిపై దాడిని చేయాలి!!




మురికి, జిడ్డు, మరకలపై పాల్ నురుగుల దాడి ప్రారంభం కానివ్వండి! పాల్ నురుగుల సైన్యాన్ని రంగంలోకి దిగనివ్వండి!!

మురికి, జిడ్డు మరకలతో ఇవి కలియబడడం చూడండి. వాటిని సమూలంగా నాశనంచేసి, తళతళలాడే స్వచ్ఛమైన తెల్లని బట్టలు మిగులుతాయి.



మురికిని నాశనంచేసే కోట్లాది నురుగుల బుడగలు యిముడ్చుకున్నదే—పాల్ డిటర్జెంటు బిళ్ళ.

ఉత్పత్తిదారులు:
ఆల్ట్రా మరైన్ అండ్ పిగ్‌మెంట్సు లిమిటెడ్
రాణిపేట, తమిళనాడు

Sista s UPL 25A 81 Tel



## (గత సంచిక తరువాయి)

కంచాలు ఎత్తి కడిగేసింది. అన్నింటిమీదా మూతలు సరిగా ఉన్నాయో, లేదోనని చూసి చేతులు పయటకొంగుతో తుడుచుకుంటూ తండ్రి ఉన్న గది దగ్గరకు వచ్చింది.

''నాన్నా'' ఎంతో బిగ్గరగా పిలిచాననుకుంది తార కాని, ఆ పిలుపు అతిమెల్లగా వినిపించింది రాఘవయ్యగారికి.

ఇంతవరకూ బుద్ధి తెలిసిన తర్వాత తండ్రి కెదురుగా నిలబడి 'నాన్నా, నాకిది కావాలి' అని అడగలేదు తార. అలాంటిది ఇవ్వాళ అలా నిలబడి 'నాన్నా' అని పిలిస్తే రాఘవయ్యగారికి ఆశ్చర్య మేసింది.

పిల్చిందేగానీ, తర్వాతి విషయం ఎలా చెప్పాలో తెలియక మళ్ళీ మౌనంగానే నిలబడి పోయింది.

'ఎందుకు పిల్చింది? ఏమైనా చెప్పటానికా, లేక ఏమైనా అడగటానికా?' అనుకొన్నారు రాఘవయ్యగారు.

''ఏమిటమ్మా? ఏంకావాలి?'' అనునయంగా అడిగారు.

కొద్దిగా తలెత్తి తండ్రివంక చూసి, మళ్ళీ వెంటనే కళ్ళు క్రిందికి వాల్చేసింది.

'ఎలా చెప్పాలి! ఎలా చెప్పాలి!' గొంతులో గురగురా తిరుగుతున్నాది.

సందేహంగా నిలబడిపోయిన కూతురివంక క్షణంసేపు నిశితంగా చూసి, లేచి దగ్గరగా వచ్చారు రాఘవయ్యగారు. తలమీద చేయివేసి ఆప్యాయంగా అడిగారు—''చెప్పమ్మా, ఏమిటి? ఒంట్లో బాగాలేదా?''

బాగున్నాయన్నట్లు తలాడించింది.

''మరేమిటి?'' కనుబొమలు కొద్దిగా ముడివేసి అడిగారు—

కళ్ళెత్తి తండ్రి ముఖంలోకి చూసి, మళ్ళీ తలదించుకుంది తార.

'ఇంకో పదిరోజుల్లో నా ఇంటిలక్ష్మి మరో ఇంటి మహాలక్ష్మి అవుతుంది'. ప్చ్! ఏమిటో— ఆడపిల్లలను కన్న ప్రతితండ్రి ఇలాగే బాధపడతా రేమో! కాని—కాని—నిన్నొదిలి నేనెలా ఉండ గలనో, ఏమిటో—''

అంత పెద్దమనిషి అలా బెంగగా అంటూంటే తారకు చాలా బాధ అనిపించింది. చిన్నపిల్లలాగా ఆయన గుండెలకు తల ఆనించి అలా నిశ్శబ్దంగా ఉండి పోయింది తార. తలమీద చేయివేసి నిమురుతూ లాలనగా అడిగారు—

''ఏమిటమ్మా, చెప్పు ఏంకావాలి?''

తండ్రి చేతులనుండి కాస్త అవతలకు జరిగి నిలబడింది.

పయటకొంగును వేలికి ముడివేసి, విప్పదీస్తూ అతిమెల్లగా అన్నది.

''నాకీ పెళ్ళి వద్దునాన్నా''

'ఏదో అడుగుతుంది' అనుకుంటూన్న రాఘవయ్యగారు తార మాటలకు తెల్లబోయారు 'ఛా! తార అలాగని ఉండదు ఏదో అంటే తనకలాగ వినిపించి ఉంటుంది. అంతే!' అనుకున్నారు అయినా అనుమానం తీర్చుకునేందుకు ''ఏమిటమ్మా నువ్వు అన్నది?'' అని అడిగారు.

''నాకీ పెళ్ళి వద్దు నాన్నా. ఆ వెంకట్రావు నాకు నచ్చలేదు''

రాఘవయ్యగారికి కణతల దగ్గర నరాలు బిగుసుకున్నాయి.

''మరి ఇన్నాళ్ళూ ఎందుకు చెప్పలేదు?''

మాట్లాడలేదు తార.

పేముపేము మంటూన్న గుండెలకు ధైర్యం చెప్పుకుంటున్నాది.

రాఘవయ్యగారికి అయోమయంగా ఉన్నది. అసలు ఈ పరిస్థితివిగానీ, ఇలా జరుగుతుందేమో అనిగానీ ఆయన ఇంతవరకూ ఊహించనే లేదు. అలాంటిది — ఒక్కసారిగా.

చేతులు రెండూ వెనక్కుపెట్టి అస్థిమితంగా, విరాగ్గా అటూ ఇటూ పచార్లు చేస్తున్నారు.

ఆ అడుగుల కదలికలో— ఆయనలో రగులు కుంటూన్న కోపం కాన వస్తున్నాది.

తారకు ఏడుపు వస్తోంది. 'ఏమిటే, నాన్న ఏం మాట్లాడరు!'

''ఎంత పొరపాటు జరిగిపోయింది నీకూ ఇష్టమేనే అనుకున్నాను గానీ, నీ అభిప్రాయం అడగాలనే తలంపే రాలేదు నాకు. ఇప్పుడెలా? ఇంత ఆలస్యంగా'' తనలో తాననుకుంటున్నట్లు అతి మెల్లగా అంటూన్న రాఘవయ్యగారు గబుక్కున కూతురి దగ్గరకు వచ్చారు. ''అమ్మా, తారా! దాదాపు అన్నీ సిద్ధమైపోయాక ఈ పెళ్ళి ఆగిపోతే ఎంత అప్రదిష్టో ఆలోచించు తల్లీ! ఇహ నీకసలు పెళ్ళంటూ చేయగలనా? ఏ కారణంతో పెళ్ళి ఆగిపోయినా అది ఆడపిల్లకే దెబ్బ తల్లీ! అయినా వెంకట్రావుకేం తక్కువమ్మా? అన్ని విధాలా మంచి సంబంధం! పైపెచ్చు మునసబు మామయ్యకు తెలిసినవాళ్ళు! నిన్ను బాగా చూసు కుంటారు!'' అనునయంగా తండ్రి చెబుతూంటే— అప్పటివరకూ భయం భయంగా ఉన్న తార మనసు లోకి ధైర్యం చరున పాకి వస్తున్నాది.

''అతడు నలుపు నాన్నా,'' మెల్లిగా అన్నది.

స్థాణువయ్యారు రాఘవయ్యగారు. ఆ మాట కాదనలేరు!

'అవును! తారకు చిన్నప్పట్నుంచీ నలుపంటే ఇష్టముండేదికాదు. నల్లగా ఉంటాయని నేరేడు పండ్లు కూడా తినదు! అలాంటిది వెంకట్రావుని ఇష్టపడుతుందా, లేదా అని కాస్తంత కూడా ఆలోచించలేకపోయాను! ఎంత పొరపాటు జరిగి పోయింది! వెంకట్రావు నలుపే! నిజమే! కానీ— కేవలం ఆ కారణంతో ఇంత దూరం వచ్చిన ఈ పెళ్ళిని ఆపటం ఉభయ కుటుంబాలకూ మంచిది కాద'ని నచ్చచెప్పటానికి ఎంతగానో ప్రయత్నించారు రాఘవయ్యగారు.

ఆయన మెల్లిగా చెబుతూన్నకొద్దీ తారలో పంతమూ, పట్టుదలా పెరుగుతున్నాయి.

అది గమనించిన రాఘవయ్యగారికి విసుగూ,

**జరిగిన కథ—3** రాఘవయ్య, నాగరత్నం దంపతులకు తార, సరళ—రామారావ్, రామ్మోహన్, చంద్రం సంతానం. అందరిలోకీ పెద్దది, అందం, వినయవిధేయతలు కల 'తార' అంటే రాఘవయ్య గారికి ప్రాణం. సరళ బడక్కస్తురాలు, పైగా గడుసు స్వభావం కలది. రామారావ్ అదో తరహా మనిషి! మోహన్, చంద్రాలకు ఇంకా బాల్యావస్థ వీడలేదు. చిన్నప్పట్నుంచీ పెంచి పెద్దచేసి, చదువు చెప్పిస్తున్న తమ్ముడు ప్రసాద్‌కు తార నిచ్చి పెళ్ళి చేయాలని నిశ్చయించుకొంటుంది నాగరత్నం. రాఘవయ్య కూడా కాదనలేదు. కానీ ప్రసాద్ పరశురామయ్య పెద్దకూతురును చేసుకొంటానని చెప్పగా ఏడ్చి అతన్ని బయటకు గెంటేస్తుంది. ఆ ఇంటి అప్పుడు మునసబు మామయ్య తారకు ఓ సంబంధం చూస్తూటాడు. ఆ సంబంధం తాలూకూ కుర్రాడు వెంకట్రావ్ తార మనసును ఆకర్షించలేకపోతాడు. తండ్రి అనుమతితో తార ప్రసాద్ పెళ్ళికి వెళ్తుంది. పరశురామయ్య తమ్ముడు శ్రీనివాసరావ్ అప్పటికే బాగా ప్రచారంలో వున్న కమ్యూనిస్టు పార్టీలో తిరుగుతుంటాడు. అతనికి గురువులాంటివాడు వెంకటరత్నం. యువకుడైనా ఆ పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు. శ్రీనివాసరావ్‌తో కలిసి ప్రసాద్ పెళ్ళికి వెళ్ళిన వెంకటరత్నం మదిలో 'అనుకోని సంఘటన' ద్వారా ముద్రవేసుకొంటుంది తార. బాబాయి బలరామయ్య తీసుకొచ్చిన సంబంధం, పెళ్ళిలో చూసిన 'ఆతనే'నని తెలుసుకొన్న తార ఎలాగయినా నాన్నతో చెప్పి ఒప్పించాలని నిర్ణయించుకొంటుంది.

కోపం వచ్చాయి చివరకు చాలా చిరాగ్గా అన్నారు–
'పిచ్చిపిచ్చి వేషాలు వేయబోకు! ఎంత చెప్పినా అర్థం చేసుకోకపోతే ఎట్లా? ఇదేం బొమ్మలాట అనుకున్నావా! ఆ వెంకట్రావుతోనే నీ పెళ్ళి జరిపిస్తాను!''

అప్పటివరకూ ఏదో 'తండ్రీ కూతుళ్ళు మాట్లాడుకుంటున్నారులే' అనుకున్న నాగరత్నమ్మ రాఘవయ్యగారు తీవ్రంగా అన్న మాటలకు గబుక్కున ఇవతలకు వచ్చింది

''ఏమిటి? ఏం జరిగింది?'' కళ్ళు తుడుచుకుంటూ నించున్న తారనూ, కోపంతో చిందులేస్తున్న రాఘవయ్యగార్నీ అయోమయంగా చూస్తూ, ఆందోళనగా అడిగింది

''ఏమిటా? విను ''

అసలు విషయం విన్న నాగరత్నమ్మ అపర సూర్యకాంతిమే అయింది

బాగా తిట్టింది

తిట్టి తిట్టి ''వెంకట్రావుని వద్దని ఎవర్ని చేసుకుంటావే?'' అని అరిచింది

క్షణంకూడా ఆలస్యం చేయకుండా ఠక్కున చెప్పింది తార–''ఆ నూజెళ్ల అబ్బాయిని చేసుకుంటాను''

మరోసారి షాక్ తిన్నారు రాఘవయ్యగారు నాగరత్నమ్మ కేకలకు అక్కడ చేరిన కుటుంబ సభ్యులందరూకూడ తార చెప్పిన జవాబు విని తెల్లబోయారు

'అసలిదంతా నిజమేనా! ఆ మాట్లాడుతూన్నది తారేనా!' అన్నంత అనుమానంగా చూసారు రాఘవయ్యగారు

క్షణంసేపు విభ్రాంతితో నాగరత్నమ్మ నోరు కూడా మూతబడిపోయింది

ఆ అబ్బాయి కుటుంబం చాలా పెద్దది అన్నారు వెనకాల ముగ్గురాడపిల్లలున్నారన్నారు వాళ్ళ పెళ్ళిళ్ళూ, పురుళ్ళూ ఎన్నో బాధ్యతలుంటాయన్నారు అన్నింటినీమించి అతడికి రాజకీయాల పిచ్చి ఉన్నాదనికూడా భయపెట్టారు!

ఉహూఁ ఏం చెప్పినా, ఎలా చెప్పినా తారది ఒకటే మాట! ''వెంకట్రావు వద్దు! నూజెళ్ల అబ్బాయినే పెళ్ళి చేసుకుంటాను''

ఆ రాత్రి తార అన్నం తినలేదు, నిద్రపోలేదు! ఏడుస్తూనే ఉంది

రాఘవయ్యగారూ నిద్రపోలేదు ఆలోచిస్తూనే ఉన్నారు

నాగరత్నమ్మా నిద్రపోలేదు ఉండి ఉండి



తారనో తిట్టూ, దీనికంతకూ మూలకారణమయిన బలరామయ్యనో తిట్టూ తిడుతూనే ఉంది

* * *

తెల్లవారింది !

వాకిలి కడిగి, కళ్ళాపి జల్లి, ముగ్గు పెట్టింది తార

కళ్ళు లోపలకుపోయి, ముఖం అంతా పీక్కుపోయి ఉన్నాది అసలే నాజూకుగా ఉండే తార మరీ వడలి పోయినట్లుగా కన్పిస్తున్నాది

ఎనిమిది అవుతూండగ ఆదరా బాదరా వచ్చారు ముప్పలు మామయ్య ! పెదనాన్నలనందర్నీ పిలిచారు

వాళ్ళందరనూ చూస్తుంటే తారకు భయం వేసింది అందరూ కలిసి బలవంతంచేసి ఒప్పిస్తారేమో అనే భయం పట్టుకుంది

ఏమైనాసరే, ఎవరెంత చెప్పినా, ఎవరెలా తిట్టినా — ఎలాగూ బయటవడ్డాను కాబట్టి, సాధించే తీరాలని మనసులో గట్టిగా అనుకున్నది, అలాగే చేసింది కూడానూ

అందరూ ఎన్నివిధాల చెప్పినా, ఎన్నివిధాల బతిమలాడినా, చివరకు కోప్పడినాకూడా తలుపు వేట్టుకుని నిలబడి ఏడవటంతప్ప సమాధానం ఇవ్వలేదు.

నెమ్మదిగా, వినయంగా, మూర్తీభవించిన మంచితనంతో, ముచ్చటగొలిపే రూపంతో ఉండే తార అంటే అందరికూ ఎనలేని అభిమానం !

చూడగానే మర్యాదగా మాట్లాడి, ప్రేమగా వ్యవహరించే తారపట్ల ప్రతివారికి ప్రత్యేకమైన వాత్సల్యం ఉండేది

అన్నింటికీ చిరునవ్వుతో తల ఊపి అంగీకరించే తార — ఏనాడూ నోరుతెరచి 'ఇది కావాలి' అని అడగని తార — అంతగా పట్టుపట్టటంతోనూ, ముఖ్యంగా తమ చేతుల్లో అల్లారుముద్దుగా పెరిగి, తమ మనసుల్లో ఒక అనురాగ జ్యోతిగా నిలిచిన తార తల్లి అలాగ కంటికీ, మింటికీ ఏకధారగా



అన్నట్లు ఏడుస్తూండటం — చాలా బాధాకరంగా ఉన్నది

"ఇంకేం చేస్తాం ! నేనే వెళ్ళి వాళ్ళతో నెమ్మదిగా అన్ని విషయాలూ చెప్పి మాట్లాడి వస్తాను ఈ లోపున మాజెల్లా వెళ్ళి ఆ సంబంధం మాట్లాడి ఖాయం చేసుకోండి అనుకున్న సమయానికే అన్నీ జరిగితే బాగుంటుంది ! రేపటికి ఈ వియ్యాల వారిని కూడా రమ్మనమని చెప్పండి" మునసబుగారి మాటలు రాఘవయ్యగారికి పునరుజ్జీవనం ప్రసాదించాయి !

తార లోపలకు పారిపోయింది

* * *

1942 మే 25న ఇద్దరి పెళ్ళిళ్ళూ ఒకే పందిట్లో, కాస్త ఇంచుమించుగా ఒకే ముహూర్తాన జరిగినాయి !

ఆ రోజుల్లో జరిగిన ఆ పెళ్ళి — ఓ గొప్ప సుందర దృశ్యం !

చాలా ఘనంగా చేసారా పెళ్ళి ! ఆ పెళ్ళికి కొన్ని వేలమంది హాజరయ్యారు కనీసం ఎవ్వరూ ఊహించటానికి కూడా వీలుకానంత నిండుగా, అపురూపంగా, ఎన్నడూ మరచిపోలేని విధంగా జరిగింది !

తార భర్త వెంకటరత్నం గొప్ప రాజకీయ వేత్త పదహారణాలా కమ్యూనిస్టు

సత్యవతి, వెంకట్రామయ్యల కుమారుడు వెంకటరత్నం సత్యవతి కన్నవారి వంశంలో దాదాపు మూడు తరాలుగా మగపిల్లలే లేరు అందువల్ల సత్యవతికి మొదటి కాన్పులో మగపిల్లవాడు పుట్టే సరికి ఆ యింట్లో ఒకపెద్ద పండుగే చేసుకున్నారు సత్యవతి తల్లి తన తదనంతరం ఆ పిల్లవాడికి చెందేటట్లుగా అయిదెకరాల మంచి పొలంకూడా వ్రాసి ఇచ్చేసింది ఆ ఏడుకొండలవాడే తన ఇంట




**కలిపి చూడు**

నీ, నా అంటే
నిమ్మకు నీరెత్తినట్టుండే పదాలు
ఎంత బాగా పొంది పొసగుతాయో
ఏదీ ఒక్కసారి పలికి చూడు
మీ, మా అనే పదాలు

— డాక్టర్ పి. ఎల్ శ్రీనివాసరెడ్డి

పుట్టాడని మురిసిపోయింది సత్యవతి అందుకే కుమారుడికి వెంకటరత్నం అని పేరు పెట్టుకున్నాది

సత్యవతి చాలా బోళా అయిన మనస్సుగలది ! అతి అమాయకురాలు ! మనసు మంచిదే కాని, ఎవరు ఏది చెబితే అదే నమ్ముతుంది ! ఆలోచన లేకుండా అదే నిజమనుకుంటుంది ! ఎవరు చెప్పిన దానికయినా బుర్ర ఊపుతుంది !

వెంకట్రామయ్యగారు మాజెల్లలో చాలా పెద్ద మనిషి ! అంతస్తులోగానీ, ఆకారంలోగానీ—అన్నింటిలోనూ ఆయన పెద్ద మనిషే ! వయస్సులోనూ, బుద్ధిలోనూ కూడా పెద్దమనిషి తరహాగానే ఉండే వారు

ఆయన భార్యను - భార్యగా చూసేవారు కాదు ! ఊరిలో అంత పలుకుబడి, పేరూ కల పెద్ద మనిషి భార్య విషయంలో మాత్రం కాస్త సంకుచితంగా ఉండి 'చిన్న మనిషి'గానే ప్రవర్తించేవారు

ప్రతి మనిషిలోనూ ఎక్కడో అక్కడ, ఏదో ఒక లోపం ఉంటూనే ఉంటుందిట !

వెంకట్రామయ్యగారు కూడా అంతే ! ఆయన చిన్నవయసులో కూడా భార్యను సమంగా చూసే వారుకాదు ! ఒక 'ఆడదాని' గా మాత్రమే చూసే వారు !

ఇంటి విషయాలుగానీ, వ్యవసాయంగానీ, వ్యాపారంగానీ, లాభనష్టాలుగానీ, ఆదాయవ్యయాలుగానీ — అసలు ఏవీ ఆమెతో మాట్లాడేవారు కాదు!

'సత్యవతీ' అని పేరుతోకూడా పిలిచే వారు కాదు ! ఏదైనా అవసరంవస్తే "ఇదిగో—ఏమేవ్ !" అని పిల్చేవారు

నిజానికి సత్యవతి అందంగానే ఉండేది ! వెంకట్రామయ్యగారు సత్యవతి అందం ముందు తీసి కట్టే ! అయినా కూడా ఆమెని అయిదు నిమిషాలు కూడా ప్రశాంతంగా చూడగలిగే వారుకాదు

ఆకలేసినపుడు అన్నం తిన్నట్లే — రాత్రిపూట గదిలోకొచ్చిన సత్యవతిని వాడుకునేవారు

వెంకటరత్నం పుట్టాడు !

అలాగే గిరిజ పుట్టింది !

ఆ తర్వాత కళ్యాణి పుట్టింది

దమయంతి కూడా అలాగే పుట్టింది నలుగురు బిడ్డలు పుట్టినాకూడా భర్త ప్రవర్తనలో ఆమెకేమీ లోపంగానీ, వెలితిగానీ కన్పించేవి కావు !

దానికి కారణం — ఆమెలోని గొప్ప అమాయకత ! ఆవిడపాలిట — అది ఒక పెద్దవరమే అనుకోవాలి.

ఒంటినిండా నగలూ, ఇంటినిండా బిడ్డలూ ఉన్నారు

దొడ్డినిండా పశువులు!

గాదెనిండా ధాన్యం!

ఇంకేమిలోటు అనుకుంటుంది! ఆ మాటా నిజమే—ఒకరకంగా!

ఊరిలో పలుకుబడీ, రాబడీ కూడా ఎక్కువ గానే ఉన్న మోతుబరి—తన భర్త!

కన్నవారూ ఉన్నవారే!

కట్టుకున్నవాడూ ఉన్నవాడే!

అందువల్ల ఆమెకు కరువు తెలీదు! కష్టం తెలీదు! అంతే కాకుండా 'పొదుపు, జాగ్రత్త' అనేవి అసలే తెలీదు!

నిజమైన కష్టాలు లేనివాళ్ళకు చిన్న చిన్న విషయాలే పెద్ద పెద్ద భూతాల్లాగా కనిపిస్తాయట!

అలాగే సత్యవతిక్కూడా ఎప్పుడయినా, ఏదయినా ఏ చిన్న లవక లవక జరిగినా-మని బిబ్బిడ బిబ్బిడ అయిపోయేది! తను కంగారు పడటమే కాకుండా ఇల్లంతా ఏకం చేసేది ఏ చిన్న కారణం దొరికినా, దానికోసం—ఊకముూటలో నిప్పురవ్వ పడ్డట్లుగా ఆ రోజు రోజంతా సాధించుతూనేఉంటుంది

ఆ దంపతులకు పుట్టిన బిడ్డ—వెంకటరత్నం—నిజంగానే దైవమిచ్చిన అపురూపమైన వరం!

అతని రంగులో గానీ, పోలికల్లో గానీ, గుణగణాల్లోగానీ, ఆకారంలో గానీ, అసలు దేనిలోనూ—ఆ కుటుంబంలోని ఇతర సభ్యుల పోలికలు ఏవీ కనపడవు ఏ దేవుడో కాస్త మార్పుకోరి – ఈ భూలోకంలో అవతరించినట్లుగా వెంకటరత్నం ఆ ఇంట్లో పుట్టి పెరిగాడు

ఆ యిల్లు జమీలు పోయినా దర్పాలూ, ఆడంబరాలూ వదలలేని జమీందారుల ఇల్లులాగా ఉంటుంది

పై పనులన్నీ పాలేర్లు చేస్తుంటారు! పొయ్యి దగ్గర కూర్చుని ఎవరికి కావలసినవి అవి వండి పెడుతూ ఉంటుంది సత్యవతి వెంకట్రామయ్యగారి కసలు ఎప్పుడూ ఇల్లు గానీ, ఇంటి విషయాలు గానీ పట్టవు! వెంకటరత్నానికి తల్లి చాదస్తం చూసినా, చెల్లెళ్ళ సోమరితనం చూసినా తగని చిరాకు! కంపరం!! ఇంట్లో ఉన్నప్పుడు కోప్పడుతూనే ఉంటాడు

అందువల్ల—అతనింట్లో ఉన్నంతసేపూ అటూ ఇటూ తిరుగుతూ ఏదో పని చేస్తున్నట్లుగా కన్పించటానికి ప్రయత్నించేవారు!

అలాంటి వాతావరణంలోకి గంగిగోవులాంటి తార—గృహప్రవేశం చేసింది

అయినా తార క్రొత్త కోడలు!

క్రొత్త ఒక వింత!

అందువల్ల క్రొత్త కోడలు అత్తగారికీ మోజుగానే ఉంది! అందంగా, పొందికగా ఉన్న వదినను చూస్తే ఆడపడుచులకూ మోజుగానే ఉంది

ఆ యిల్లు బయటనుంచీ చూడటానికి పెద్దదిగా కన్పిస్తుంది గానీ—అంతా కలిపితే రెండుగదులు, ఒక పెద్ద హాలుమాత్రం ఉంటాయి ముందూ, వెనుకా పెద్ద పెద్ద వరండాలు ఉన్నాయి! వెనుక వరండాకు ముందువైపున వంటకు వేరేగా వేసిన గది ఉంటుంది

ఒక గదిని వెంకట్రామయ్యగారు వాడుకునేవారు మరో గదిలో పిల్లలంతా పడుకునేవారు! వెంకటరత్నం పెద్దవాడయ్యాక ఆ గదిని తన కొక్కడికే స్వంతం చేసుకున్నాడు ఊరిబయట పొలందగ్గర ఒక గది కట్టించుకున్నారు వెంకట్రామయ్యగారు ఎక్కువగా ఆయన అక్కడే ఉంటారు! అందువల్ల ఆయన గదిని ఆడపిల్లలు వాడుకోవటం ఆరంభించారు

తార ఆ ఇంటికి కోడలుగా వచ్చి రెండురాత్రులు అయిపోయాయి ఇవ్వాళ కూడా గడిస్తే రేపు ఉదయం ఇంటికి వెళ్ళిపోవచ్చు అనుకుంటున్నది తార

తారతో కలిసి కన్నవారింటినుంచీ ఎవరూరాలేదు మొదట బలరామయ్య భార్యనుగానీ, పార్వతమ్మనుగానీ పంపుదామనుకున్నది నాగరత్నమ్మ కానీ, మాఇళ్లలో సత్యన్నారాయణ వ్రతంలాంటివేవీ లేవని తెల్సుకున్నాక విరమించుకున్నది

సత్యన్నారాయణవ్రతం నోచుకోవటానికి వెంకటరత్నం ఇష్టపడలేదు అసలు పెళ్ళిలోనే పేచీ పెట్టాడు మేళాలూ, తాళాలూ—ఏవీ వద్దన్నాడు ఆడంబరమే వద్దు అన్నాడు కానీ, రాఘవయ్యగారు చిన్నకూతురి పెళ్ళికూడా ఇందులో జతపరచి ఉన్నది కాబట్టి ఎలాగో అతడ్ని ఒప్పించగలిగారు

కానీ—సత్యన్నారాయణ వ్రతానికిమాత్రం అతను ఒప్పుకోలేదు సత్యవతి బ్రతిమలాడింది 'ఇంట్లో







మొదటి శుభకార్యంరా అన్నీ సక్రమంగా జరిగితే రేపు ...కూ, నీ పిల్లలకూ శుభం జరుగుతుందిరా మన ...ంటి ఆడపడుచులకు కూడా మంచి జరుగుతుందిరా' అంటూ ఎన్నో చెప్పింది

"సరే! మీ యిష్టానికి ఒప్పుకుంటాము అలాగే నా యిష్టాన్నికూడా మీరు ఒప్పుకోవాలి"

"ఏమిటది?" ఆత్రంగా అడిగింది సత్యవతి

"ఏంలేదు! భోజనాల పెట్టేటపుడు పెద్దా చిన్నా అనే తేడా లేకుండా అందరికీ ఏకపంక్తిన వడ్డన జరగాలి! గూడెం అంతా వస్తుంది వాళ్ళను ఇంట్లోకి రానివ్వాలి! బ్రహ్మయ్యగారు పెద్దాయన, అంజయ్యగారు మోతుబరి, లక్ష్మణరావుగారు గొప్పింటాయన అంటూ కబుర్లు చెప్పకూడదు! దానికి మీరు ఒప్పుకుంటే నా అభ్యంతరం ఏమీలేదు" అన్నాడు

గుడ్లు వెళ్ళబెట్టి చూసింది సత్యవతి 'వీడికి పిచ్చి పడుతోంది, సందేహంలేదు' అనుకుంది

అది అసాధ్యం కాబట్టి వ్రతం ప్రసక్తే లేకుండాపోయింది

సరళకు అత్తగారింట్లో సత్యన్నారాయణవ్రతం కూడా పెళ్ళిలాగా చేస్తున్నారట! అందువల్ల అందరూ అటే వెళ్ళారు

తారకూ సంతం పెరిగింది ఏ మాటనీకూడా పెదవులు దాటి బయటకు రానివ్వని తార "నాకేమన్నా భయమా, ఏమయినా! అక్కడ ఉండేదీ మనుష్యులే! నేను వెళ్ళేది అడవిలోకి కాదు! నేనొక్కర్తినీ వెళ్ళగలను" అని తెగించి చెప్పింది అందువల్ల తార ఒక్కర్తే వచ్చింది

ఆ రోజున—ఆ ఊరిలో 'శ్రీకృష్ణతులాభారం' వీధినాటక మున్నది

పల్లెటూరు! వాళ్ళకు అలాటి కార్యక్రమాలు ఎప్పుడోగానీ లభ్యంకావు! అందువల్ల ఇంట్లో ఉన్న పెద్దా చిన్నా అంతా తయారవుతున్నారు

వెంకట్రామయ్యగారు భోజనంచేసి చావిడి దగ్గరకు వెళ్ళిపోయారు

ఆ నాటకం రాత్రి ఏ తొమ్మిదింటికో మొదలు పెడతారుట! కానీ ఇంట్లోమాత్రం ఆరింటినుంచే హడావుడి పడిపోతున్నారు

అసలే తరచి తక్కువ మాట్లాడే స్వభావం ఇంక అత్తగారింట్లో ఇంకేం మాట్లాడు

## తార

తుంది అందుకే ఏదో ఒక పుస్తకం పట్టుకుని కూర్చుంటుంది

చదువుకుంటూన్న తారకు కళ్యాణి, దమయంతి చెరోవైపునా చేరి సాయంకాలం నుంచీ పాట పాడుతూనే ఉన్నారు

"తప్పకుండా వెళ్దాం వదినా, నాటకం బాగుంటుంది ఊర్లో అంతా వస్తారు మనకోసం ప్రత్యేకంగా స్థలంకూడా కేటాయిస్తారు అన్నయ్య కోప్పడినా భయపడవద్దు!" నవ్వుతూ వింటూన్న తార చివరి మాటలకు ఉలిక్కిపడింది

'అంతే — ఇలాంటివి ఆయన కిష్టంకాదు కాబోలు!' మనసులోనే అనుకుంది

సత్యవతి భోజనాలకు పిలిచేవరకూ ఒదిన చెవిలో గుడగుడమంటూనే ఉన్నారు

అందరివీ భోజనాలు అయిపోయాయి పెళ్ళికి వచ్చిన వెంకట్రామయ్యగారి చెల్లెలూ, సత్యవతి తల్లీ ఇక్కడే ఉన్నారు

ఏడున్నర అయింది! దేవాలయం ముందర వేసిన పందిరినంతా మామిడాకులతో అలంకారం చేసారు స్టేజి అమర్చారు! లైట్లు పెట్టారు! గ్రామఫోను పెట్టి పాటలుకూడా వేస్తున్నారు

## ల్యూకెమియా వైరస్!

మనుషులలో ల్యూకెమియా కలిగించే వైరస్‌ను గుర్తించారు జపానులోని క్యోటో విశ్వవిద్యాలయంలోని వైరస్ పరిశోధనా సంస్థ పరిశోధకుల బృందం యీ క్రొత్త వైరస్‌ను కనుగొన్నది ఈ బృందానికి నాయకత్వం వహించిన ప్రొ హినుమా, తన బృందం ల్యూకెమియాను కలిగించే 'T సెల్' రకం వైరస్‌ను కలిగినట్లు తెలియచేశారు ఈ పరిశోధనల ఆధారంగా ల్యూకెమియాను నిరోధించే వాక్సిన్ను తయారుచేయడం ప్రారంభించారు 'T సెల్' అనేది రక్తంలో వుండే లింఫాటిక్ కణము ఇది వ్యాధులను అరికట్టటానికి తోడ్పడుతుంది 'T' రకం ల్యూకెమియా భయంకరమైన వ్యాధి

దేవాలయానికీ, వెంకట్రామయ్యగారింటికీ మధ్యన మూడిళ్ళు మాత్రమే ఉంటాయి నాటకానికి వెళ్ళేవాళ్ళంతా వీరి ఇంటి ముందునించే వెళ్ళాలి

కళ్యాణి, దమయంతి వీధివాకిట్లో నిలబడ్డారు వాళ్ళ వయసువాళ్ళంతా నాటకం చూసేందుకు వచ్చేస్తున్నారు చిన్న పిల్లలంతా పరుగులు తీస్తున్నారు వాళ్ళకూ కాళ్ళు ఆగనంటున్నాయి! గిరిజ మేనత్తను తీసుకుని వెళ్ళిపోయింది కళ్యాణి, దమయంతి ఒదిన కోసమే ఉన్నారు

"క్రొత్త కోడలు! అప్పుడే బయటకు రావటమేమిటి? వద్దు!" అంటుంది సత్యవతి

"సింగినాదం! ఏం ఫర్వాలేదు ఒదిన ఒక్కర్తీ ఎలా ఉంటుంది! ఒదిన కూడా వస్తుంది!" అంటారు వాళ్ళు

'అయితే అన్నయ్యను అడిగి తీసుకెళ్ళండి" అన్నాది అందుకే ఆగారు వాళ్ళు

కొడుకువస్తే అన్నంపెట్టి వెళ్దామని కూర్చున్నాది సత్యవతి

"నేను అక్కడ ఆ జనంలో కూర్చోలేములేవే, బయట అరుగులమీద కూర్చుంటే అదే వినిపిస్తుంది" అన్నది సత్యవతి తల్లి

నాటకానికి వస్తూన్న ఆడంగులంతా 'క్రొత్త కోడల్ని చూసినట్లు అవుతుంది కదా!' అని ఇంట్లోకివచ్చి కోడల్ని చూసి మరీ వెళ్తున్నారు

ఎనిమిది అయిపోయింది

అయినా వెంకటరత్నం రాలేదు

అక్కడ నాటకం మొదలు పెడుతూన్న చిహ్నలేమీ లేకపోయినా — సత్యవతి కూడా ఖంగారు పడి పోతున్నాది

కళ్యాణికీ, దమయంతికీ అయితే ఇంకా ఎదురు చూసే ఓర్పుకాస్త చచ్చిపోయింది 'తమ అందాల ఒదిన్ని తీసుకెళ్ళి అందరకూ చూపించాలి' అనే ఉబలాటాన్ని ఒదిలేసి గబగబా లోపలకు వచ్చారు "ఒదినా! ఇంకా అన్నయ్య రాలేదు మేము వెళ్ళి పోతున్నాం [illegible] అమ్మతో కలిసిరా" అని చెప్పేసి వెళ్ళిపోయారు

'అమ్మయ్య' అనుకున్నది తార

అసలు అలా వెళ్ళటం తారకూ ఇష్టంలేదు ఇలాంటివి పాటపల్లిలో జరిగితేనే వెళ్ళేది కాదు సరళ రమ్మని ఎంత గొడవచేసినా వెళ్ళేదికాదు!






బులుసు వేంకటరమణయ్య

# పరవనితా బలాత్కృతి

రావణుడు మోసంచేసి సీతాదేవిని అపహరించి లంకకు తీసుకునిపోయి అశోకవనంలో ఉంచాడు గదా ! స్వాభావికంగా దురాత్ముడైన ఆ రావణుడు ఆమెను బలాత్కరించకపోవడానికి కారణం ఏమిటి ? – అనే ప్రశ్న కలగవచ్చును పరవనితను బలాత్కరిస్తే అతని తలలు పగిలి చావగలడని అతనికి శాపం వున్నది

రావణుడు ఒకప్పుడు ఒక వనంలో అందకత్తె అయిన ఒక అప్సరసను చూచాడు ఆమె ఒక మునిని ప్రేమించి ఉన్నది ఆ మునికి కూడా ఆమెపై వలపు కలిగింది కాని ఆమె రజస్వల అయి ఉన్నందున ముని ఆమెకు దూరంగానే ఉండవలసి వచ్చెను

రావణుడు రజస్వల అయి ఉన్న ఆ అప్సరసను చూచి ప్రేమించాడు ఆమె తిరస్కరించింది అయినా దురాత్ముడైనందున అతడు ఆమెను బలవంతంగా స్వాధీనం చేసుకుని ఆమెతో సుఖించాడు ఆమె యేడ్పు రావణునికి జాలి కలిగించలేదు ఆమె స్నానంచేసి పరిశుద్ధ అయిన తర్వాత ఆ ముని వద్దకు వచ్చినది ఆ ముని దివ్యదృష్టి వల్ల ఆమె పరోపభుక్త అయినట్లు గ్రహించి, ఆమెను తిరస్కరించి మొసలి అగునట్లు శపించాడు ఆమె దుఃఖిస్తూ తన తప్పులేదనీ, రావణుడు తన్ను బలాత్కారంగా వశం చేసుకున్నాడనీ, తనకు శాప విముక్తిని అనుగ్రహించవలెననీ ప్రార్థించింది అతడు దయతలచి మారుతి మొసలి అయిన ఆమె నోటిలో దూరి, బయటకి వచ్చిన పిమ్మట మామూలు రూపు వస్తుందని శాప విముక్తిని అనుగ్రహించాడు హనుమంతుడు లంకకు పోవుటకు సముద్రాన్ని దాటుతున్నప్పుడు ఆ మొసలి నోటిలోపడి, బయటకి వచ్చిన తర్వాత ఆ అప్సరస యథారూపాన్ని పొంది స్వర్గలోకానికి వెళ్లిపోయింది

తాను వలచిన అప్సరసను బలాత్కరించి ఆమెతో సుఖించినందున ఆ మునికి రావణునిపై మిక్కిలి కోపం కలిగింది క్రోధోద్రిక్తుడైన ఆ ముని 'బలాత్కరించి వనితను అనుభవించి నట్లయితే రావణుని తల వేయి శకలలయి, వాడు మరణించు'నట్లు శపించాడు ఆ శాపానికి భయపడే రావణుడు స్త్రీలను బలాత్కరించడం లేదు నయాన, భయాన, సమ్మతించునట్లు చెయ్యడానికే అతడు విశ్వప్రయత్నం చేశాడు రాక్షస స్త్రీలచేత ఎన్నోసార్లు బోధింపజేశాడు ఆమె ఎప్పటికీ లొంగకపోతే చంపడానికే నిశ్చయించాడుగాని, బలాత్కరించడానికి పూనుకొనలేదు

అతడు అప్సరసను బలాత్కరించడం వల్లనే అతనికి ఇట్టి పరిస్థితి ఏర్పడింది పడతిని బలాత్కరించడం అనర్థానికి హేతువు ! ★

అంటే వాళ్ళేమనుకుంటారో అని భయపడి మౌనంగా ఊరుకున్నాది

అందరూ వెళ్ళిపోయేసరికి సత్యవతికీ కాళ్ళు ఆగటంలేదు తలుపులన్నీ వేసి, కొడుక్కి అన్నీ ఎక్కడ సర్ది పెట్టి, తల్లితోచెప్పి బయటకు వచ్చింది సత్యవతి

అప్పుడే వాకిట్లోకి వచ్చాడు వెంకటరత్నం "ఒరేయ్, అబ్బాయ్ ! కోడల్నికూడా తీసుకెళ్ళనా ?"

ఛర్రుమన్నాడు వెంకటరత్నం పిల్లిలాగా ముడుచుకుపోయింది సత్యవతి

"అన్నం పెట్టనా ?"

తల్లి స్వరం వినగానే తగ్గిపోయాడు వెంకటరత్నం

'ఛ ! ఇంత చిన్న విషయానికి కూడా ఎందుకు ఇరిటేట్ అయ్యాను' అనుకుని అనునయంగా అన్నాడు తల్లితో --

"నేను స్నానం చేసాక భోజనం చేస్తాన్లే అమ్మా నువ్వెళ్ళు"

"సరే ! అమ్మమ్మ ఇంట్లోనే ఉంది ఏదైనా కావాల్సివస్తే అడుగు" చెప్పేసి వెళ్ళిపోయింది

వెంకటరత్నం లోపలకు వచ్చాడు అతని అమ్మమ్మ బుచ్చమ్మ గదిలోనుండి బయటకు

## తార

వస్తున్నాది

"ఏమిట్రా ! అమ్మమీద అరుస్తున్నావు ?"

"అబ్బే ! ఏంలేదు అమ్మమ్మా నువ్వెళ్ళలేదా నాటకానికి ?"

"ఆ జనంలో నేను కూర్చోలేనురా ! మన అరుగులమీద కూర్చుని చక్కగా వినొచ్చు తొందరగా భోజనానికి రా, అందరం చూద్దాం"

నవ్వుకున్నాడు వెంకటరత్నం

"నేను స్నానంచేసి, భోంచేస్తాన్లే అమ్మమ్మా నువ్వెళ్ళి కూర్చుని చూడు"

"వేడినీళ్ళు కావాలా ?"

"వేసవిలో వేడినీళ్ళేమిటి అమ్మమ్మా, అసలే ఉక్కిపోతుంటేను"

బట్టలు మార్చుకుని, టవలు చుట్టుకుని స్నానానికి వెళ్ళాడు

బైట మైకులో 'హలో, హలో' అనే కేకలూ, ఈలలూ, ఏవేవో ధ్వనులూ వినవస్తున్నాయి !

బుచ్చమ్మ వెళ్ళి అరుగుమీద కూర్చున్నాది

బయటనుంచీ వస్తున్న రణగొణ ధ్వనులపర్యటారకు చదివేది బుర్రకు అందటంలేదు అందుకని పుస్తకం మూసి ప్రక్కనపెట్టి, లేచి బట్టలు సర్దుకోవటం మొదలుపెట్టింది "రేపు ఎవరొస్తారో తీసుకెళ్ళటానికి ! బహుశా రామారావుని పంపిస్తారేమో !" అనుకున్నాది

అలాగ ఆలోచిస్తున్న తార మనసులోకి చప్పున మరో ఆలోచన వచ్చింది– 'ఈ సమయంలో సరళ ఏం చేస్తున్నాదో!' అనుకుంటూ తల ఎత్తి గోడ మీద ఉన్న గడియారంవంక చూసింది ఎనిమిదిన్నర చూపుతున్నది 'అబ్బా! అప్పుడే ఇంత సమయమయిందా! అయితే ఈపాటికి నిద్రపోయే ఉంటుంది!' అనుకున్నది

స్నానం ముగించి వచ్చిన వెంకటరత్నం గది దగ్గరకు వచ్చాడు లోపలకు అడుగువేయబోయి మళ్ళీ అంతలోనే ఆగిపోయాడు

లోపల-

ఒక విధంగా పాషాణంలాటి అతని మనసులో సెళ్ళి, స్త్రీ అనే ఆలోచనలను రేకెత్తించి, ఆదో రకమైన సున్నిత బాధను రగుల్కొల్పిన అందాల హరివిల్లు తారను అక్కడ చూడగానే అతని మనసులోకి ఒక అందమైన భావవీచిక ప్రవేశించింది పెదవులమీదికి మధురమైన మందహాసం తోసుకొచ్చింది

(ఇంకా వుంది)

# డైనమైట్

"చైతన్య"

"క్రిష్ణ ఎక్కడికి పోయేడురా? సినిమాకి టైమవుతోంది, తొందరగా వెళ్లకపోతే బస్సు దొరకదు" అడిగేడు మధు.

"లైబ్రరీకి పోయేడు" జేబులోంచి సిగరెట్టు తీస్తూ అన్నాడు రంగనాథం

"ఛీ నోర్మూయ్! ఆ వెధవకి యూనివర్సిటీలో గడిపిన యీ రెండేళ్లలోనూ లైబ్రరీ గుమ్మం ఎటుకేముందోకూడా తెలియదు నాకు చెప్తున్నావా? జోకులెయ్యకు"

"వాడికీమధ్య కొత్తపిచ్చి పట్టింది నీకు తెలియదా?"

"ఆ అమ్మాయి పేరేమిటి?"

"అమ్మాయి కాదు"

"అదికాక వేరే పిచ్చిలుకూడా వున్నాయేమిటి వాడికి?"

"వాడి కొత్తపిచ్చి గురించి మన హాస్టలులో సగంమందికి తెలుసు నీకు తెలియకపోడం ఏమిటి?"

"ఒరేయ్! నీకు ఏదైనా వంక దొరగ్గానే, నేనేదో తెలివితక్కువ వెధవనని ప్రూవ్ చెయ్యాలని ఛస్తూంటావు సగంమంది హాస్టలువాళ్లకి తెలియడం ఏమిటి? వెధవ అతిశయోక్తులూ నువ్వూను"

"పోనీ యింతవరకూ వాడి సంగతి నలుగు రైదుగురుకి చెప్పివుంటాడు నీదాకా రాలేదా అని"

"మొబైల్ ఇన్ఫర్మేషన్ సెంటరు నీ పేరని ఒప్పుకున్నాను కాని అసలు సంగతి చెప్పలేదు"

"స్ప్రహతప్పితే వేసుకునే మందేదైనా నీ జేబులో వుందా?" రంగనాథం పొగ వదుల్తూ అన్నాడు

"ఒరే! మళ్లీ మొదలెట్టేవూ డొక్కుజోకులు చెప్తావా తన్నమన్నావా?"

"అదేమిటి? యన్ టి రామారావు గారి కొత్తచిత్రమా? లేక నాగేశ్వరరావుగారి కొత్త చిత్రమా? 'చెప్తావా తన్నమన్నావా!' చాలా బావుంది పేరు"

"అది చేస్తే నీ కొత్త చిత్రం అవుతుంది గాడిదా!"

"హిప్నాటిజమ్!" అని దూరంగా హాస్టలు డాబామీద నిలబడ్డ ఒక స్టూడెంట్‌ని చూపి చెయ్యూపేడు రంగనాథం

"మళ్లీ జో బాబోయ్! నిజమే" అన్నాడు మధు

"పద సినిమాకి టైమవుతోంది బస్సులో తీరిగ్గా చెపుతాను" అని రంగనాథం, మధుని ఔట్‌గేటుకి లాక్కుపోయేడు

తీరా పది నెంబరు బస్సులో కష్టపడి తోసుకుని ఎక్కేక, ఒకసారి కుడికాలుమీద, ఒకసారి ఎడంకాలుమీద నిలబడి బ్యాలెన్సు చేస్తూ ప్రయాణం చేస్తుంటే మాట్లాడుకోడానికి కుదరలేదు దానికి తోడు లేడీస్ హాస్టలు దగ్గిర బస్సులో 'గులాబీ పువ్వు' అనే అమ్మాయి ఎక్కింది ఆ అమ్మాయి అసలు పేరేమిటో అటెండెన్సు వేసే లెక్చరరుకి తప్ప మరెవరికీ తెలియదు కాని యూనివర్సిటీలోకి నిన్న వచ్చిన గుంటవెధవకి కూడా గులాబీపువ్వు నామస్మరణే!

ఎలాగా ఎవడో పాపం శాల్తీ తనకీ గులాబీకీ



కళ్లమధ్య గోడలా నిలబడ్డాడుకదా, గులాబీ వీక్షణానందం ఎలాగా లేదు, కథ విందాం అనుకుని మధు, రంగనాథాన్ని చేత్తో పొడిచి, కళ్లతో ప్రశ్నలు వేసేడు రంగనాథం, మధుని మింగేసేటట్టు చూసేడు 'ఏం కావాలి?' అన్నాడు ఒక్క క్షణం కళ్ళు మధుకేసి తిప్పి, వెంటనే మధు చెప్పే సమాధానం కూడా వినకుండా యింకెటో చూడ్డం మొదలెట్టేడు అదృష్టంకొద్దీ రంగనాథానికీ, గులాబీకీ మధ్య అడ్డుగోడలింకా లేవలేదు మధు అది చూసి నోరుమూసుకున్నాడు

బస్సు దిగుతూనే థియేటరుకేసి పరుగెత్తేరు

రంగనాథం సినిమా అయ్యేక చెప్పేడు --

'యూనివర్సిటీ గేటుబయట మొన్న ఇద్దరు కోయవాళ్ళు వీడిని పట్టుకున్నారు వీడి ముఖంలో మంచి వర్చస్సు వుందన్నార వీడు ప్రస్తుతం

కిల్లీకొట్టుముందు నిలబడివున్నామకాని, అయిదేళ్ళు తెరక్కుండా సినిమా స్టార్, దేశ నాయకుడో అవ్వక పోవ్వదన్నారు వీసు వాళ్ళకో మరీ ఎక్కువ చెప్పిం చేసుకుంటే అందరూ వినేసి, వీడిని సినిమా స్టార్, దేశనాయకుడో అవ్వకుండా కాళ్ళట్టుకు క్రిందకి లాగేస్తారని (ఇక్కడ యూనివర్శిటీలో ఎవడైనా ఫస్టు వస్తాడని అనుమానంగా వుంటే ప్రొఫెసరుగారి దగ్గర్నుంచి, లాబ్‌లో అవ్వన్న వరకూ అందరూ కాళ్ళట్టుకుని క్రిందకిలాగి, ప్రొఫెసర్‌గారి పుత్రుడిని పైకి తోసినట్టు) వాళ్ళని ఎవరూ చూడకుండా రూమ్‌కి తీసుకుపోయేడు వాడి రూమ్మేటు సంగతి తెలుసుకదా! పిఠాపురం హాస్టల్లో, హాస్టలు నెంబరు రెండు వందల పదహారులో, రూమ్ నెంబరు తొమ్మిది వందల యాభై ఆరులో బూతు పుస్తకం వుంది తెచ్చుకో అనగానే, అంతపెద్ద నెంబర్లు ఆంధ్రా యూనివర్శిటీ హాస్టల్సులో ఎక్కడున్నాయా? అని కూడా ఆలోచించకుండా పరిగెట్టే రకం అలాంటిదే ఏదో ఆ రూమ్మేటకి చెప్పి పంపించేసేడు ఆ కోయవాళ్ళ వీడిని కూర్చోపెట్టి ముందు ప్రెసిడెంటు గిరి, ప్రెసిడెంటు నీలం సంజీవరెడ్డిలతో తీయించుకున్న ఫోటోలు చూపించేరుట మన ప్రెసిడెంట్ల సంగతి తెలుసుకదా! ఫోటో అనగానే నవ్వుకుంటూ దిగిపోతారు తీరా తీయించుకున్నాక అడుగుతారు మొహమాటానికి "మీరెవరు? ఎందుకొచ్చేరు?" అని అది అనవసరం ఫోటో అని తరవాత తెలిసినా వాడి కెమెరా ఊడలాక్కోలేరు కదా! దాని తరవాత ఏట సితామహులు, అంటే రామారావు, నాగేశ్వరరావుగార్లతోనూ, అలాంటి సినిమాదేవుళ్ళతోనూ కలిసి తీయించుకున్న ఛాయాచిత్రాలు వీడి ముందు పారేసేరుట "అబ్బో! అబ్బో" అన్నాట్ట వీసు వాడి సంగతి తెలుసుకదా నీకు! దాంతరవాత ఓ పది నిముషాలు ముఖస్తుతి మళ్ళీ కానిచ్చి, పూజ చేస్తాం అన్నారుట వీడు సినిమా స్టారులేక మరియు దేశనాయకుడు అయ్యే ప్రోగ్రాము సఫలం అవ్వడానికి పూజ చాలా అవసరం అన్నారుట ఊరికే చేస్తున్నారనుకుని 'సరే' అన్నాట్ట మనవాడు -- చాలాతెలివైనవాడినని అనుకోడం వీడికి అలవాటే కదా — ఫ్రీగా ఎన్ని ఛాన్సులు కొట్టేస్తున్నానో అనుకునివుంటాడు వాళ్ళల్లో ఒకడు పుల్లలు రెండు పీకి 'హాంఫట్, హాంఫట్' అని వీడి నుదుటిమీద ఇంత కుంకం మెత్తి "నా కళ్ళల్లోకి చూడు" అన్నాట మనవాడు, కోయవాడి కళ్ళల్లో గులాబీ పువ్వు కనబడుతుందనుకున్నాడేమో, దీక్షగా చెతికేశేడుట కోయవాడు అటూ, ఇటూ వూగి వీడిమీద విభూతి జల్లేటప్పటికి మనవాడు కూడా అటూ, ఇటూ వూగడం మొదలెట్టేడుట. 'చూడు ఇదిగో' అని ఎడంచేవు చప్పట్లుకొట్టి, "ఊఁ! ఇదిగో" అని కుడిచేవు చప్పట్లు కొడితే, మనమంతా దోమల్ని చంపడానికి అటూ, ఇటూ ఎగిరినట్టు ఎగిరేడుట మనవాడు ఈ నాటకం ఆపి ఆ కోయవాడు "చూడు! రా! రా!" అంటే వీడి కళ్ళముందే రెండు పుల్లలు ఎగిరివచ్చి ఆ కోయవాడి చేతిలో పడ్డాయిట దాంతో వీడికి మతిపోయింది 'అదేమిటి?' అన్నాట్ట "రెండు పుల్లలు, రెండు వందలు" అన్నాట్ట కోయవాడు 'అంటే' అన్నాట్ట మనవాడు, అప్పటికి కాస్త సర్దుకుని కోయవాడు 'పెట్టె తెరు నాన్న పంపలేదా? రెండు వందలు అమ్మకిచ్చుకో" అన్నాట్ట అంటే వీడు "మా అమ్మకి డబ్బు మా నాన్న వేరే యిస్తాడు, నేనెందుకివ్వడం?" అన్నాట్ట కోయవాడు కళ్ళెర్రజేసి "పోపో! తీసికరా పోలెమ్మకి కావాల" అన్నాట్ట పోలెమ్మో, గోలెమ్మో కాని, వీడి దగ్గర ఉండ్రితంతే చిల్లుగవ్వ లేదు ఆ రోజు వాడికి మనియార్డరు వచ్చి అప్పటికే రెండు రోజులయిపోయింది ఇంకేం డబ్బు? 'నా దగ్గరలేదు' అన్నాట్ట కోయవాడు, రెండోవాడిని చూసి, వీడికేసి చూసి 'అబద్ధం చెప్పకు ఛస్తావు' అన్నాట్ట వీడు ఏడుపుమొహం పెట్టి 'నిజంగా లేదు' అన్నాట్ట ఆ కోయవాడికి ఫేస్ రీడింగ్‌లో పాండిత్యం అప్పుడు బాగానే పనికొచ్చింది వీడి ఏడుపు నిజం ఏడుపులాగే కనబడి మళ్ళీ పక్కనున్న తబలాగాడితో "పిట్ట ఎగిరిపోయింది" అన్నాట్ట మనవాడు తరవాత నన్నడిగేడు 'పిట్ట ఎగిరిపోడం ఏమిటి?' అని 'అదంతేలే! హాస్టలు చుట్టూ పిట్టలు ఎగురుతుంటే, కోయవాడికి ఒకటి కనబడివుంటుంది వాడిలో కవిత్వం హఠాత్తుగా పైకి తన్నుకొచ్చి అలా అనివుంటాడు' అన్నాను మనవాడితో లేపోతే వాడివే పిట్ట అంటున్నాడని చెపితే 'ఛీ! నాన్సెన్స్' అని దెబ్బలాటకి రాడా! ఇంతకీ, ఆ కోయవాడు, అంత పెద్దమొత్తం ఈ రాజకుమారుడి దగ్గర్నుంచి ఎలాగా రాలదని గ్రహించి బేరం మొదలెట్టేడు 'సరే! ఎంతుంది?' అన్నాట్ట 'ముప్పావలా' అన్నాట్ట వీడు కోయవాడు ఏడుపుమొహం పెట్టి 'అబద్ధం చెప్పకు. ఛస్తావు' అన్నాట్ట మళ్ళీ మనవాడు ఆల్మోస్ట్ ఏడుస్తూ, మూడు పావలాలూ తెచ్చి కోయవాడికి ధారపోసేడుట ఆ కోయవాడు దొరికింది కాస్తా రొంటిని దోపుకుని 'ఇదిగో' అని వీడికి విభూది ఇచ్చేట్ట "సినిమా టారు కావాలంటే తాయత్తు కావాల డబ్బులేదు తాయత్తులేదు ఈ విభూది పారెయ్యకు మంచి చేస్తది ముప్పావలా అయినా పోలెమ్మ ప్రసాదానికి చాలు. మూడు నెల్లో మళ్ళీ తిరిగొస్తా" అన్నాట్ట. వాళ్ళ వెనక్కాలే వీడు రూము బయటకు నడుస్తుంటే, పోతూ పోతూ వాడు వెనక్కి తిరిగి 'ఎగిరిపో! పో' అన్నాట్ట హఠాత్తుగా మనవాడికి గాలిలో ఎగిరి రూములోకి పోయినట్టు అనిపించిందిట గుండెలు చేతులో పెట్టుకుని, రూము తలుపులు మూసుకుని ఆంజనేయ దండకం బయటికి తీసేట్ట"

"ఆంజనేయ దండకం ఎక్కడ్నించి వచ్చింది వీడి దగ్గర. వాడి రూమ్మేటులో కలిసి యింకేవో దండకాలు చదవడం అలవాటవ్వలేదా?" అన్నాడు మధు.

'ఓ రోజు వీడికి మనియార్డరు వచ్చిందని తెలిసి, మేమంతా వీడిని ప్రేమగా పలకరించి వీడిని "డ్రాక్యులా' సినిమాకి తీసికెళ్ళేం'

"బుకింగ్ ఆఫీసు వరకూ వాడిని మీరు తీసికెళ్ళివుంటారు ఆ పైనించి వాడు మిమ్మల్ని తీసుకెళ్ళివుంటాడు కథలో తప్పులు చెప్పక' అన్నాడు మధు కోపంగ

"సరేలేవో! సంతోషించేంలే తెలివితేటలకి! ఏదయితేనేమిటి? ఇంతకీ "డ్రాక్యులా" సినిమా చూసి బయటికి వస్తూనే ఎదురుగావున్న పుస్తకాల షాపులోకి నడిచేడు "ఏం! సినిమా చూసేక 'డ్రాక్యులా' నవలకూడా చదవాలనిపిస్తోందా?" అని అడిగేం మాకేసి కోపంగా చూసి, ఆంజనేయ దండకం కొన్నాడు

"ఇంతకీ కోయవాడి కథ యింతేనా, ఇంకా ఏమైనా వుందా?"

"ఏమిట్రోయ్! నీకు నేను కథ కల్పిస్తున్నానని అనుమానంగా వున్నట్టుంది. కథేమిటి నీ తలకాయ ఇది నిజం"

"సరేలేవోయ్! చెప్పు."

"ఏం చెప్పడం! ఆ కోయవాడి విజిట్ తరవాత






అద్భుతమైన క్రొత్త సాధనం!



# ఈగిల్ కోసీ టీ-పాట్ వుంటే చాలు, రోజంతా టీ, కాఫీ త్రాగే అనుకూలమే మరి!




| మోడల్ | గ్రైషా | ఎక్స్‌ప్రెసో | గార్సోం | మైత్రే | స్టూవార్డ్ |
| --- | --- | --- | --- | --- | --- |
| పరిమాణం | 8 కప్పులు | 4 కప్పులు | 2 కప్పులు | 5 కప్పులు | 8 కప్పులు |

కాఫీ, టీ తయారు చేయడం ఎంతో బాదర బందీతో కూడిన పని మళ్ళీ-మళ్ళీ పాలను వేడిచేయడం, వడకట్టిన టీ, కాఫీ పొడిని పడేయడం, కడగడం, తుడవడం— ఇవన్నీ ఎంతో విసుగు కలిగించే పనులు ఇప్పుడు ఈగిల్ కోసీ టీ-పాట్స్ మళ్ళీ మళ్ళీ టీ, కాఫీ తయారు చేసే ఈ బాదర-బందీని తొలగిస్తాయి ఒక్కేమారు తయారు చేసి ఇందులో పోసి వుంచుకొంటే చాలు, ఎన్నో గంటలపాటు రుచికరమైన తాజా టీ, కాఫీ హాయిని అనుభవించవచ్చు ఈగిల్ టీ పాట్స్‌తో రోజంతా ఎప్పుడు కావాలన్నా వేడి-వేడి కాఫీ, టీ తయార్!

ప్రత్యేకమైన లోపలి వ్యాక్యూమ్ ఫ్లాస్క్ రీఫిల్ మీ కాఫీ, టీలను సెగలు కక్కేలా వేడిగా వుంచుతుంది






**ఈగిల్ కోసీ టీ-పాట్. ఎన్నో గంటల పాటు వేడిగా వుంచుతుంది**

CASE-133.244 TEL

మనవాడిలో రియాక్షన్ చాలా విచిత్రమైనది వచ్చింది "వాడిచ్చిన వీభూది పారెయ్యిరా" అంటే 'ఎందుకురా ? పారేస్తే ఏమవుతుందో ! దాచుదాం" అని ఆ వీభూది పాకెట్టు తీసికెళ్లి బూతు పుస్తకాల రావుగాడి టెక్స్టు బుక్కుల మధ్యని దాచుకున్నాడు అక్కడుంటే వచ్చేయేడదివరకూ ఆ వీభూది పోదని వాడి నమ్మకం ఆ రావుగాడు ఈ మధ్య డీసెంట్ బుక్కుల్ని మరీ అసహ్యించుకుంటున్నాట్ట అందుకే నీడికా నమ్మకం కూర్చుని ఆలోచించి వాడొకటి ఒడిగేదు నన్ను — 'ఆ కోయవాడు నన్ను గాలిలో ఎలా ఎగిరించేడు ?" అని "'పిట్ట ఎగిరిపోయింది అన్నాడు కదా ! వాడు పిట్టల ఎక్స్‌పర్టేమో — నన్నూ పిట్టలా ఎగిరించేడు" అన్నాను నేను వాడికి కోపంవచ్చి నన్ను బాగా తిట్టేడు - నా మీద జాలి పడ్డాడు కూడా — 'దేవుడు కొంతమందిని నీలా మొద్దు బుర్రల్లాఎందుకు చేస్తాడో పాపం ! దేవుడికి దీనికి సమాధానం ఇచ్చుకోక తప్పదు" అన్నాడు.

"ఈసారి ఆయన్ని కలుసుకున్నప్పుడు కను క్కుందిగ్గానిలే ప్రస్తుతం ఏంచేద్దామని నీ ఉద్దేశ్యం? ఆ కోయవాళ్లింకా ఇక్కడే తిరుగుతూవుండి వుంటారు నీలాంటివాళ్లునలుగురైదుగురు వాళ్లకి దొరక్కపోయుంటారా ? వాళ్లని పట్టుకుని నాలుగు తగిలించి మూడు పావలాలూ లాక్కుంటే రెండు కాఫీలైనా వస్తాయి" అన్నాన్నేను

వాడు నన్ను చంపేసేటట్టు చూసేడు 'ఎప్పుడూ వెధవ ఆలోచనలే, వాడి దగ్గర్నుంచి మనం యివ్వాళ నేర్చుకున్న పాఠం ఏమిటి ? మహాత్మాగాంధీ ఏమన్నాడు ? 'అందరి దగ్గర్నుంచీ నేర్చుకోవాలి' అన్నాడు ఎంత బుర్రలేని వాడి దగ్గరైనాసరే నేర్చుకోడానికి ఏదో ఒకటి ఉంటుంది అందుకే ఆఖరికి నీ దగ్గర్నించికూడా నేను నేర్చుకుంటాను' అన్నాడు నామీదే జోక్ వేస్తూ ఇంతకీ వాడు కోయవాడి దగ్గర్నించి నేర్చుకున్న

## డైనమైట్

దేమిటంటే "ప్రతీ మనిషీ మిగిలిన మనుషులమీద ప్రాక్టీసుతో అధార్టీ చెయ్యచ్చు — గాలిలో ఎగిరించచ్చు - గులాబీపువ్వుని వయ్యారంగా నడిచి వచ్చి వళ్లో వాలేటట్టు చెయ్యచ్చు — ఎలా — హిప్నాటిజంతో ! అదీ కథ" అన్నాడు రంగనాథం

"చంపేవు పో, అయితే లైబ్రరీలో ఏం చేస్తున్నాడు ?"

"జ్ఞాన సముపార్జన"

"అంత కష్టమైన పద్ధతి ఎందుకు ? ఆ కోయవాడి దగ్గరే ట్రైనింగ్ తీసుకోవచ్చుగా !" అన్నాడు మధు

"నీకు మరీ యింత బుర్రలేదని ఈరోజే తెలిసింది కోయవాడిదగ్గర ట్రైనింగ్‌కి డబ్బు ఖర్చు అవుతుంది లైబ్రరీలో అయితే ఫ్రీ అదేకాక ఆ కోయవాడు తన వ్యాపార రహస్యాలు మనవాడికి చెపుతాడా ? నేర్పేస్తే నీడుకూడా బట్టలు గార్చి, ఆ కోయవాడిలాగే బయల్దేరితే కాంపిటీషన్ పెరగదా ? కృష్ణగాడు అలా చెయ్యకుండా వుంటాడని నాకు కూడా నమ్మకంలేదు—ఈ రోజుల్లో మనకి ఉద్యోగంలో వచ్చే డబ్బుకంటే, ఆ కోయ వాడికే ఆదాయం ఎక్కువయ్యివుంటుంది"

"పద వాడినోసారి పలకరించివద్దాం" అన్నాడు మధు

కృష్ణ రూముకెళ్లే దారిలో మధు అడిగేడు "కృష్ణగాడి 'హిప్నాటిజం' ప్రావీణ్యం ఎంతవరకూ వచ్చింది ? ఇంకా చదవడంలోనే వున్నాడా ? ప్రాక్టీసు కూడా మొదలెట్టేడా ?"

"వాడు మనలాంటి మొద్దుమొహం కాదు రెండు రోజులు చదివి, థియరీ అర్థం చేసుకుని, ఇప్పుడు ప్రాక్టీసు మొదలెట్టేడు త్వరలో ప్రయోగాలు కూడా చేస్తాడుట"

కృష్ణ రూమ్‌కెళ్లి తలుపు కొట్టగానే, గదిలో ఎవరో అటూ యిటూ పరిగెడుతున్న చప్పుళ్ళు వినబడ్డాయి రెండు నిముషాలవరకూ తలుపు తెరుచుకోలేదు మధు 'ఏమిటి ?' అన్నట్టు చూసేడు రంగనాథంకేసి

"లోపల రావుగారు చదువుకుంటున్నారు వారికి పఠనాభంగం కలిగిన రెండు, మూడు నిముషాలవరకూ మామూలు మనుష్యులు కాలేరు వాంతం భోషణం వీడి రూముకి ఎప్పుడొచ్చినా యిదే గోల" అన్నాడు రంగనాథం

"మనవాడొచ్చి తెరవచ్చుగా ?"

రంగనాథం మూర్ఖుడికేసి చూసే మహా ఋషిలా చూసేడు మధుని

"మనవాడు రూములో వుంటే యీపాటికి తలుపు తెరుచుకునేదికాదా పామరుడా ? మనవా డెక్కడికి పోయేడో కనుక్కోడానికే మనం యిక్కడ వెయిట్ చేస్తున్నది అంతేకాని రావుగారిని శ్రమ పెట్టి సంతోషించడానికికాదు" అన్నాడు

ఇంతలో తలుపుతెరిచి, ఓరగా చేసి, తలుపు వెనకనించి అల్లావుద్దీన్ ఖిల్జీని తెరవెనకనించి చూసిన రాణీ పద్మినిలాగా "ఎవరు మీరు ? ఏంకావాలి ?" అని అడిగేడు రావుగారు

రంగనాథం "క్రిష్ణ ఎక్కడికిపోయేడో కనుక్కుందామని" అన్నాడు

"సముద్రపుటొడ్డుకి పోయేడు ఓ గంట పోయేక వస్తానని చెప్పేడు" అన్నాడు రావుగారు

"అదే అయ్యివుంటుందిలెండి, మీరేం చేస్తున్నారు ?" అన్నాడు రంగనాథం

"చదువుకుంటున్నాను" అన్నాడు రావుగారు

"అప్పలకొండ కొట్లోంచి అద్దెకి తెచ్చినవేనా ? పాపం ! చాలా కష్టపడి చదువుతారు వెడతాం !" అన్నాడు రంగనాథం

వాళ్లు వెనక్కి తిరగ్గానే, రావుగారు కోపంగా ధడేలుమని తలుపు మూసేడు

రంగనాథం మెట్లు దిగుతూ అన్నాడు 'మనవాడికి బుర్ర తిరుగుడు సగం రావుగారి మూలానే అని నా అనుమానం రోజులో పన్నెండు గంటలు మనవాడు తనంతట తాను తిరుగుతాడు మిగిలిన పన్నెండు గంటలూ రావుగారు డిస్టర్బెన్స్ లేకుండా సాహిత్యం చదువుకోడానికి వీడిని బయటికి తోల్తూవుంటాడు ఆ రావుగారితో ఓ సంభాషణా వుండదూ నా తలకాయా వుండదూ"

"అయినా వీడు సముద్రపుటొడ్డున ఏం చేద్దామని పోయేడంటావు ?" అన్నాడు మధు

"హిప్నాటిజమ్ ప్రాక్టీసు మొదలెట్టేసేడేమో ! సరదాగా సముద్ర కెరటాల్ని వెనక్కి పంపించడం ప్రాక్టీసు చేస్తూవుండచ్చు" అన్నాడు రంగనాథం

"నోర్ముయ్ ! వాడికేమైనా పిచ్చా ?" అన్నాడు మధు

"నీకింకా ఏమైనా అనుమానమా ?" అన్నాడు రంగనాథం

సముద్రపుటొడ్డున కృష్ణ ఒంటరిగా కూర్చునివుంటే రంగనాథం, మధూ దగ్గరగా వెళ్లేరు

## మనుగడతీరా, మనిషి పతనమా

అవసరానికి అబద్ధమాడితే
అది ధర్మబద్ధమే అన్నాయి శాస్త్రాలు
అబద్ధమాడడమే ఒక అవసరమయిపోతే
ఇంక ధర్మం బ్రతికి బట్టకట్టగలిగేదెలా అంది నా అంతరంగం

మనుగడకని మోసంచేస్తే
పాపం కాదన్నాయి ధర్మశాస్త్రాలు, పరమాత్మ అవతారాలు
మోసాలు చేయడమే మనుగడైపోతే
ఇంక పుణ్యం మిగిలేదెలా అంది నా మనస్సాక్షి

స్థితి మెరుగుపడడం కోసం ద్రోహంచేస్తే
క్షమార్హత పొందొచ్చే అన్నాయి నీతిశాస్త్రాలు
ద్రోహాలు చేయడమే స్థితికాభరణంగా పరిగణింపబడితే
ఇంక నీతికి నిలువ నీడ ఉంటుందా అన్నది నా నీతితత్త్వం

ప్రతి దుష్కర్మ దుర్మార్గం సర్వసాధారణమయిపోతే
జగతిలో నిలువగలిగే మతమేముంటుంది ?
మానవత్వం కొన ఊపిరితోనైనా నిలిచేదెలా ?
మానవజాతి క్రూరమృగజాతికంటే హీనమవదా ?

— "లఖన్"










"ఏం చేస్తున్నావురా యిక్కడ?" అన్నాడు మధు

కృష్ణ సముద్రంకేసి తీక్షణంగ చూస్తున్నవాడు, చూపు మరల్చి తీక్షణంగా రంగనాథం, మధుకేసి చూసేడు రెప్పవాల్చకుండా

"మీకేం కనబడుతోంది?" అన్నాడు కృష్ణ

"ఓ పిచ్చాడు" అన్నాడు రంగనాథం, బుర్ర గోక్కుంటూ

"ఎక్కడ?" అన్నాడు కృష్ణ చుట్టూ చూస్తూ

"నీ వెనక వుండవాడు ఇంతసేపూ ఇప్పుడు పోయేడులే" అన్నాడు

మధు ఆయోమయంగా చూసేడు రంగనాథంకేసి

"పద రూమ్‌కి పోదాం" అన్నాడు మధు, కృష్ణతో

కృష్ణ లేచి వాళ్లలో నడుస్తూ హఠాత్తుగా "ఇటు చూడండి" అని వేలితో తప్పట్లుకొట్టి రెండు పిడికెళ్లూ బిగించి పైకి చూపెట్టేడు

అలాచేసి "మీకెలా అనిపిస్తోంది?" అన్నాడు

"నిన్ను చూస్తే భయమేస్తోంది" అన్నాడు మధు

"చూసేరా! అదే హిప్నాటిజం" అన్నాడు క్రిష్ణ

రంగనాథం నవ్వాపుకున్నాడు "అయితే హిప్నాటిజం నేర్చేసుకున్నావన్నమాట" అన్నాడు

"అప్పుడే ఎక్కడ? ఇంకొంచెం ప్రాక్టీసు చేస్తే యింకా బాగా వస్తుంది ఇవ్వాళ రాత్రి కోయదొరతో మీటింగ్ పెట్టేను" అన్నాడు క్రిష్ణ

రంగనాథం చాలా శాంతంగా అన్నాడు "క్రిష్ణా! నీ మంచికోరిన మిత్రులం చెప్తున్నాం విను, ఈ పిచ్చి యింక చాలు మీ రూమ్మేటు నడిగి ఓ సాహిత్యం పుస్తకం తీసుకుని ఈ రాత్రి చదవడానికి ప్రయత్నించు కాస్త మనసు మళ్లుతుంది ఆఖరికి రావుగారి సాహిత్యానికి కూడా వుపయోగాలున్నాయని యీరోజే తెలిసింది ఈ హిప్నాటిజం పిచ్చిలో ఇంకొన్ని రోజులున్నావంటే, మీ నాన్నగారికి వుత్తరం రాసి పిలిపించాల్సి వస్తుంది"

"ఓరీ! నాకు మతిపోయిందనుకున్నావా? నా కళ్ళల్లోకి చూడు సూటిగా ఏం కనబడుతోంది?" అన్నాడు క్రిష్ణ

"బాబ్బా!" అని తలమీద కొట్టుకున్నాడ రంగనాథం

* * *

మర్నాడు పొద్దున్న క్రిష్ణని చూసిన రంగనాథం కొద్దిగా ఆశ్చర్యపోయిన మాట నిజం

"ఏం కథ? మారినట్టు కనబడుతున్నావు' అన్నాడు

"మారక! నువ్వు చెప్పినదే నిజమని తెలిసింది ఇదంతా నాన్సెన్సు" అన్నాడు క్రిష్ణ రంగనాథం అనుమానంగా క్రిష్ణకేసి చూసేడు -"నన్ను ఫూల్ చెయ్యడానికిలా అనడంలేదుకదా!"

"అఫ్‌కోర్స్ అందుకే అంటున్నాను లేపోతే మారిపోయేననుకుంటున్నావా?"

"ఒరే నీకు పిచ్చి ఎక్కింది"

"లేకపోతే ఏమిట్రా! చంపుకుతింటున్నావు నాకంత తెలియదనుకుంటున్నావా?" రంగనాథం హాయిగా గాలి పీల్చుకున్నాడు "వీడికీ పిచ్చి తొందరగానే కుదిరింది" అనుకున్నాడు

"అది సరే! నిన్న రాత్రి ఏమయింది? ఆ కోయ --" ప్రక్కకి చూస్తే క్రిష్ణ కనబడలేదు రంగనాథం గాభరాగా ఇటూ అటూ చూసేడు రాధారాణి అనే రంగులచిలక వైపు వేగంగా నడుస్తూ కనబడ్డాడు క్రిష్ణ

"ఆ పిచ్చికంటే యిదే నయం" అనుకున్నాడు రంగనాథం

* * *

"రోగం వస్తే ఇంతవరకూ ఎవడికైనా ప్రత్యేకంగా క్లాసు టెస్ట్ పెట్టేడా ఈ ప్రొఫెసరు యముడు? నీకు కావాలంటే యిప్పుడు రూల్సు మారుస్తాడా? పిచ్చివేషాలూ నువ్వూను" అన్నాడు మధు

"మన బద్ధక చక్రవర్తి ప్రొఫెసరుగారు పెట్టేవే యేడాదిలో నాలుగు టెస్టులు వాటిల్లో వచ్చిన మార్కులనించి ముప్పై పర్సెంట్ ఫైనల్సులో తీసుకుంటున్నాడు ఒక టెస్టు ఎగిరిపోతే ఎంత నష్టమో ఆలోచించేవా?" రంగనాథం ఏడుపు మొహంపెట్టి అన్నాడు

"ఆలోచించేను నీలాగే ప్రతీవాడూ ఏదో రోగం వంకపెట్టి వాడి గర్ల్‌ఫ్రెండుతో సినిమాకి పోతూ టెస్ట్‌మిస్ అవుతూ, మళ్లీ నాకోసం ప్రత్యేకం టెస్ట్ పెట్టండి అంటాడు ప్రొఫెసరుగారికి టెస్ట్లు పెట్టడంతప్ప యింకో పనుండదేడాదంతా"

"డాక్టరు సర్టిఫికేటు తెచ్చేనోయ్! సినిమా టిక్కెట్లు కాదు"

"సరే! ఈ రోజుల్లో సినిమా టిక్కెట్లకంటే చీప్‌గా దొరుకుతున్నాయి డాక్టరు సర్టిఫికేట్లు ఎవడికి లెక్క"

"ఒరేయ్! నువ్వు నా ఫ్రెండువా? శత్రువ్వా?"

"వెధవా! రెండేళ్లబట్టి కలిసి చదువుకుంటున్నాం ఇంకా నీతో ఫ్రెండ్‌లా వుంటానని ఎలా అనుకున్నావు? నీగురించి నీకు చాలా దురభిప్రాయం వున్నట్టుంది"

"జోకులు! జోకులు! అవితప్ప పనికొచ్చే సలహా యింతవరకూ నీనించి వినలేదు ఎందుకొచ్చిన ఫ్రెండువిరా?"

"ఒరే! నీకూ తెలుసు, నాకూ తెలుసు ప్రొఫెసరుగారికి నచ్చచెప్పేవాడు, ఒట్టి ఆయనచేతే నచ్చజెప్పించుకునేవాడూ ఒకడే యీ ప్రపంచంలో వాడు నీ దురదృష్టంకొద్దీ ఆయన కొడుకు ఆ పుత్రరత్నానికీ నీకూ మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది "ఫరవాలేదు! ప్రొఫెసరుగారు స్పెషల్ టెస్ట్‌కి ఒప్పుకుంటారు" అని అబద్దాలు ఎలా చెప్పమంటావురా? నాకు నువ్వు ఎంత శత్రువైనా అప్పుడప్పుడు నాయరు హోటల్లో నీ డబ్బుతో ఉప్మా తిన్నాను కదా! నిన్ను రక్షించగలిగింది ఆ దేవుడొక్కడే - ఆ దేవుడు కాస్త ఢిల్లీలో బిజీగా వున్నాడుట – ఎలెక్షన్లు కదా?" అన్నాడు మధు

మౌనంగా వీళ్లిద్దరి సంభాషణా వింటున్న క్రిష్ణ సలహా యిచ్చేడు, "ఒక్క మార్గం వుంది"

రంగనాథం ఆశగా క్రిష్ణవంక చూసేడు

"వెళ్లి ప్రొఫెసరుగారి కొడుకు కాళ్లట్టుకో"

"పట్టుకోడానికి అభ్యంతరంలేదు వసుదేవుడంతటివాడే చేసేడా పని – దానిదేముంది కాని, వసుదేవుడిగారి శాస్త్రిలాకాక మన శాస్త్రి ఫెడేలుమనితంతుంది లాభంలేదు" అన్నాడు రంగనాథం విరక్తిగా

"తూర్పు ఎటో తెలుసుగా!" అన్నాడు క్రిష్ణ

'ఏం చెప్తున్నాడో మళ్లీ' అని ఆశగా చూడ్డం మొదలెట్టిన రంగనాథం, జోకు గ్రహించి "నోర్మూయ్" అన్నాడు కోపంగా

మర్నాడు డిపార్ట్‌మెంటు ప్రొఫెసర్‌గారు, రంగనాథం కారిడార్‌లో కనబడినప్పుడు "రంగనాథం!

## బంగారు భూమిలో

## పందికొక్కుల పవ్రాగం

దేవాలయం ప్రాంగణంలో ధర్మారావు (గుమ్మడి), రవి (కృష్ణ), కాసులయ్య (అల్లు రామలింగయ్య), చందారావు (రావు గోపాలరావు), మరికొందరు గ్రామపెద్దలు కూర్చొని ఉన్నారు

"నిన్న బావి దగ్గర నీళ్ళకోసం జరిగిన గొడవ మీకు తెలుసు," అన్నాడు ధర్మారావు

"అది గొడవ కాదండి, అమృతం కోసం రాక్షసులు, దేవతలు తన్నుకున్నంత యుద్ధం," అన్నాడు చందారావు

"మరిలాగే కొంత కాలం గడిస్తే, మంచినీళ్ళకు ప్రాణాలు కూడా తీసుకోవచ్చు కనుక వరుణదేవుడికి వేడుకలు జరిపిస్తే, వర్షాలు పడతాయని మన పెద్దల నమ్మకం," అంటూ ధర్మారావు అందరి వంక చూశాడు

రవి లేచి, "అయితే, ఏకరానికి పది రూపాయల చొప్పున వేసుకుని వైభవంగా జరిపిద్దాం," అన్నాడు





చందారావు ఆముదం తాగినవాడిలా ముఖం పెట్టి, "బాబూ! నాకు చందాలు తీసుకోవడం తప్ప ఇచ్చే అలవాటు లేదని మీకు తెలుసు. పైగా, రాజకీయ బాధితుడిగా నాకిచ్చిన పొలానికి ప్రభుత్వం వారే శిస్తు రద్దు చేశారు. కనుక, చందా విషయంలో కూడా నన్ను మినహాయించాలి," అన్నాడు.

కాసులయ్య కాకా పట్టి కార్యం సాధించే ఘనుడు. అంచేత, నక్క వినయంతో "అయ్యా, దేవుడిలాంటి ప్రెసిడెంటు ధర్మారావుగార్ని ఎదురుగా పెట్టుకుని మనం చందా ఎత్తడం — వారి మంచితనాన్ని, మర్యాదను, పైగా పెద్దరికాన్ని అవమానించినట్టవుతుంది. ఆ దానకర్ణులకు ఈ జాతర ఖర్చంతా భరించటం ఒక లెక్కా? ఏమంటారు, ధర్మారావుగారూ?" అన్నాడు.

ఆ యుక్తిని గుర్తించలేని ధర్మారావు "నాకంతకంటే తృప్తేముందయ్యా? ఖర్చంతా నేనే భరిస్తాను," అన్నాడు.

అందరూ చప్పట్లు కొట్టారు.

పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో విడుదలకు సిద్ధమవుతూన్న "బంగారు భూమి" చిత్రానికి ఎస్. పి. వెంకన్నబాబు నిర్మాత.

## ప్రశాంతి క్రియేషన్స్ తొలి చిత్రం

కె. విశ్వనాథ్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వి. వి. శాస్త్రి నిర్మించే తొలి చిత్రం షూటింగ్ డిసెంబర్ 13 నుండి విశాఖపట్నం, అరకులోయ




**యం. వై. ఎస్ - ఝార్కెలా**

మావారి వయస్సు 30 సంవత్సరములు. 7, 8 నెలల నుండి కడుపులో నెప్పిగా వుండి రోజు 3, 4 మార్లు విరోచనం అవుతుంది. మోషన్ నురుగుగా వుంటూ ఉందట. దీనికి కారణం ఏమిటి? ఏ మందులు వాడాలి?

★ బేసిలరీ డిసెంటరీగానీ అమీబిక్ డిసెంటరీగానీ ఉన్నవారికి పై లక్షణాలు ఉంటాయి. మల పరీక్ష చేయించుకోవటం చాలా అవసరం. ఒకసారి, రెండుసార్లు పరీక్ష చేయించినా డిసెంటరీకి కారణమైన "అమీబా"లు కనబడకపోవచ్చును. వెనువెంటనే మూడు, నాలుగుసార్లు పరీక్ష చేయించటం, అప్పటికీ తేలకపోతే "సిగ్మాయిడోస్కోపీ" చేయటం చాలా అవసరం.

రోగనిర్ధారణ అయిన తర్వాత ఫ్లజైల్ మాత్రలు వరుసగా 10 లేక 15 రోజులపాటు వాడవలసి ఉంటుంది. బేసిలరీ డిసెంటరీ ఉన్నప్పుడు టెట్రాసైక్లిన్ కేప్సూల్సు, సల్ఫాడయజీన్ మాత్రలు వాడవలసి ఉంటుంది.

**ఎస్. కె. - రాజేంద్రనగర్**

మూడు నెలల క్రితం పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకున్నాను. కాన్పు అయిన నెల రోజుల వరకు బ్లీడింగ్ అయి ఆగిపోయినది. మరలా నెల రోజులనుండి కొంచము కొంచముగా బ్లీడింగ్ అవుతున్నది. ఇలా ఎందుకు అవుతుంది?

★ ఆపరేషన్ అయిన కొన్ని నెలలవరకు ఇలా జరిగే అవకాశం ఉన్నది. కాని కాన్పు అయిన నెల రోజులదాకా బ్లీడింగ్ అవటం అంత సహజం కాదు. మీరు లేడీ డాక్టర్ల వద్దకి వెళ్ళి టెస్ట్ చేయించుకోవటం చాలా అవసరం.

**కె. బి. ఆర్. - నిప్పుకోడేరు**

నా వయస్సు 18 సం॥ ఇప్పుడిప్పుడే నా తల నెరిసిపోతోంది. ఇది తాత్కాలికమేనా?

★ తలనెరవటం అనేది తాత్కాలికం అని, నిరంతరం అని ఏమీలేదు. నెరవటం అనేది నెరవటమే! నిరంతరంగా ఆ వెంట్రుక తెల్లగానే ఉంటుంది. తెల్లగా మారిన వెంట్రుక మళ్ళీ నలుపు అవదు. ఒక వెంట్రుక నెరవగానే వెంటనే అన్నీ నెరిసిపోతాయని చెప్పలేము.

కొందరికి వెంట్రుకలు కొన్ని మాత్రం ఎన్నో ఏండ్లపాటు నెరసి ఉండటం, వారికే నల్ల వెంట్రుకలు అలాగే ఉండటం చూడటం లేదా!

**కె. ఎ. పి. - రాజమండ్రి**

మా అమ్మాయి వయస్సు 14 సంవత్సరములు. రెండు రొమ్ముల దగ్గర గట్టిగా బిళ్ళలుగా వున్నాయి. నెప్పిగా వుంటోందట. కాన్సర్ ఏమోనని భయముగా వున్నది.

★ ఫైబ్రో అడినోమా అనే "బిళ్ళ"లు సాధారణంగా పెద్ద వయస్కులలో ఏర్పడతాయి. అరుదుగా చిన్నపిల్లలలో ఏర్పడే అవకాశం ఉంటుంది. ఈ బిళ్ళలు కేన్సర్‌కి సంబంధించినవి కావు.

14 సం॥ల వారికి ప్యూబర్టీ అంటే (యుక్తవయస్సు వచ్చే) సమయాలలో రొమ్ములలో "బిళ్ళ"లు ఏర్పడటం కొందరికి సహజం అని చెప్పవలసి ఉంటుంది.

మీ అమ్మాయికి ఉన్న లక్షణం కేన్సర్ కాదని చెప్పవలసి ఉన్నది.

**యం. ఎస్. - సికింద్రాబాద్**

హోమో సెక్స్ అంటే ఏమిటి? అది ఎందువలన వస్తుంది?

★ హోమో సెక్సు అంటే స్వజాతి సంపర్కం అని అర్థం.

మెదడు పరిపక్వం చెందని యువతీ యువకులలో ఈ లక్షణం అధికంగా ఉంటుంది.

వయస్సుకు తగిన కోరికలు సహజంగా తీరే మార్గం లేనివారిలోనూ, ఒంటరితనంతో బాధపడే వారిలోనూ, కట్టుదిట్టాలు ఎక్కువగా ఉన్నవారిలోనూ ఈ లక్షణం కనుపిస్తుంది. ★

---

"కోయస్వాముల వారి దగ్గరికి" అని ముక్కుకి మాటిగా బయలుదేరేడు, రంగనాథం.

"ఆ వెధవని పట్టుకో. బిల్లు చెల్లించకుండా పోయేడంటే మనం చొక్కాలు విప్పాలి" అని అరిచేడు కృష్ణ.

మధు బిల్లుకీ, తనకి సాయంత్రం కాఫీ టిఫిన్లకీ కలిపి డబ్బు తీసుకుని రంగనాథాన్ని సాగనంపేడు. తిరిగివచ్చి కృష్ణ దగ్గర కూర్చున్నాడు.

"నేన్నమ్మను" అన్నాడు.

"నేచెప్తున్నాను. కథ ఖరీదు ముప్ఫై రూపాయలు — డబ్బు తీసుకురా — కథ చెపుతాను" అని కృష్ణ కుర్చీమించి లేచేడు.

"గాడిదా! డాంకీ! యాస్! గధా! గార్ధభం..." మధు నేపథ్యగీతం పాడుతూండగా కృష్ణ కాంటీన్ లోంచి బయటకుపోయేడు.

సాయంత్రం మధు వచ్చి కృష్ణ రూము తలుపు తట్టేడు.

"రూమ్‌లో ఒకడివే వున్నావా?"

"తప్పుతుందా? ఎవరైనా మనుష్యులు ఎదురుగావుంటే రావుగారికి పూసిరాదదు — మనుష్యులేనా అవతలికిపోవాలి, రావుగారైనాపోవాలి."

"వాడెక్కడ దొరికేడురా నీకు? రూమ్మేటుని మార్చుకోకూడదూ!"

"పాపం! వాడెక్కడికిపోతాడురా? ఇంకెవడి రూములోవున్నా, మనవాడి అలవాట్లు చూసి, వీడిని ఏడిపించుకుతినరూ! — వీడిని ఎలాగో అలా నేనే ఉద్ధరిస్తాను చూస్తూవుండు."

"మళ్ళీ హిప్నాటిజమా?"

"నీ మొహం! హిప్నాటిజమా, గాడిదగుడ్డా."

"మరి ప్రొద్దున్న హిప్నాటిజంతో ఏదో చేసేవన్నావు?"

"నేనలా అనలేదే! నా మాటలు జ్ఞాపకం చేసుకో —"

"సరేలే! ఇంతకీ ఏమయింది?"

"ఆ రోజు రాత్రి కోయవాడి దగ్గరకెడితే అక్కడ ఓ పెద్దమనిషి కోడిలా కూర్చుని 'కొక్కొరోకో' అని అరుస్తున్నాడు. ఆయన ఎదురగా నిలబడి, ఆ కోయవాడు 'హాంఫట్' చేస్తున్నాడు. నే వెళ్ళగానే ఆ కోడిని రూము మూల కూర్చోమని చెప్పి, నాతో కాస్సేపు మాట్లాడి, మళ్ళీ కోడిగారిని పట్టుకుని ఆయన చెవిలోంచి రెండు, ఆయన క్రింద నించి మూడు కోడిగుడ్లు తీసేడు. నే వచ్చేముందు ఆయనచేత ఐదు కోడిగుడ్లు ఒకసారి పెట్టించడం తమాషా అయిందిట. మూడువందల రూపాయలు కక్కకపోతే ఇలాగే రోజుకి పది కోడిగుడ్లు పెడుతూ వుంటారు, జాగ్రత్త అని భయపెడితే, గుడ్లు తేలేసి తండ్రికోడి, తన కొడుకుని ఇంటికి పంపిదిట, మూడువందలు తొందరగా తెమ్మని. కోడిపిల్ల డబ్బుతీసుకుని వచ్చేటప్పటికి, నేను అక్కడవున్నాను. నన్ను చూసి కోడిపిల్ల గతుక్కుమంది. తండ్రికోడి మూడువందలూ కోయవాడికి నైవేద్యం పెట్టింది. ఇదంతా చూసి, గాభరాపేసి, నేను బయటికి నరుగెడితే, కోళ్ళు రెండూ నా వెంటపడి నా కాళ్ళట్టుకున్నాయి. ఎవ్వరికీ చెప్పద్దని బతిమాలేయి. కోయస్వాములు, ఈలోగా, సామాను సర్దుకుని పరారీ అయ్యేరు."

"కోళ్ళేవీ?"

"నీ నెత్తిమీద వున్నాయి — మట్టిబుర్ర వెధవా."

"ఓహో! — ఓరీ — — —" ★

# భారతి

"భారతి" నవంబరునుంచి మళ్లీ వెలువరిద్దామనుకున్నాము కొన్ని అనివార్యమయిన కారణాలవలన నవంబరులో వెలువడవలసిన సంచిక డిసెంబరులో వెలువడుతోంది! ఈ ఆలస్యానికి చింతిస్తూ ఇకపయిన "భారతి" మాసపత్రిక ప్రతి నెలా సక్రమంగా వెలువడటానికి తగిన ఏర్పాటులు చేస్తున్నామని పాఠకులకి సవినయంగా మనవిచేసుకుంటున్నాము

## డిసెంబరు 'భారతి' సంచికలో ఆకర్షణలు :

★ స్త్రీ సూక్తము వజ్ఝల కాళిదాసు ★ కార్నికోరస్ - నాయని కృష్ణకుమారి ★ ముక్తకములు తుమ్మల సీతారామమూర్తి ★ భూమి - కె. శివారెడ్డి ★ బైరాగి - సాంధ్యశ్రీ ★ లేత లేత నీరెండ పిలకా గణపతి శాస్త్రి ★ కళ్లే ఆయుధాలై - కె. అంజయ్య ★ రాత్రి కొమ్మల్లో ఒదిగి - జింబో ★ ఉండమ్మా బొట్టు పెడతా - దివాకర ★ శరన్నీరాజనము - కనగన నరసింహస్వామి ★ కాపలా వి. మోహనప్రసాద్ ★ తపస్విని - కోడూరు లీలావతీదేవి ★ తొలిమెట్టు - కె. ఎస్వీ ★ సుధా స్రవంతి - బులుసు వెంకటేశ్వరులు ★ ఆవాహనం - తిరునగరి ★ సంధ్యా సుందరి - చల్లా రాధాకృష్ణశర్మ ★ దోపిడీ భోగం - రంధి సోమరాజు ★ ఈ రాత్రి - వి. వి. ఎల్. నరసింహారావు ★ వికసించే గీతం - గుడిహాళం రఘునాథం ★ బృహదమరకోశము - విక్రాల శేషాచార్యులు ★ గూడూరు శాసన పునర్విమర్శ - సి. వి. పరబ్రహ్మ శాస్త్రి ★ మినీ కవిత: ఒక దృక్పథం - విహారి ★ కావ్యాలంకార చూడామణి చారిత్రకాంశములు - కొల్లూరు సూర్యనారాయణ ★ రామాయణోత్తర కాండము - కె. రామన్న శాస్త్రి ★ విజయాదిత్యుని నిట్టూరు శాసనము - నలపాటి ఆనంద నరసింహులు ★ కర్మనాదము కీ. శే. వేలూరి శివరామ శాస్త్రి ★ మరుగుపడిన మహా వ్యక్తి - కే. వి. రమణారెడ్డి ★ అలగిల బోడి ఇత్యాది సమాస విచారణ - జలవిత ★ కవిత్వం అనుభవం - మాదిరాజు రంగారావు ★ నగలు - కె. ఎస్వీ.

—సంపాదకుడు.

# మీరు దీనిని చూసినంత వరకు నమ్మరు!

# కొత్తది!

# ఎవరెడి స్కిప్పర్ టార్చ్

# “ఇది తేలుతుంది!”

కొత్త స్కిప్పర్ టార్చిలలో ఒక కొత్తదనాన్ని సృష్టించింది. వానలో నైనా, మెరుపులోనైనా వాడేందుకు వీలుగా వాటర్‌ప్రూఫ్— అన్‌బ్రేకబుల్. ఎక్రలిక్ లెన్స్‌తో, ప్రత్యేకంగా కాపాడగలిగే స్విచ్ మరియు స్ట్రీమ్ లైన్డ్ బోడీ— ఈ కారణంగా వెలుతురులో, నీరు బయట భద్రంగా మూసివేయగలది

మీరు మరో వాటర్‌టైట్ టార్చి గనుక కావాలనుకుంటే, అద్భుతమైన అన్ని రంగులలో వెలువడే వీటిని చూసేందుకు గాను అడగండి



# సినిమా వి

మల్లి'' చిత్రం డిసెంబర్ 25న విడుదలవుతుంది. సుప్రియ, నందకుమార్, కళారాణి, అన్నపూర్ణ, చౌదరిబాబు, దినకర్, టెలిఫోన్ సత్యనారాయణ, రాఘవయ్య, విశ్వేశ్వరరావు, విజయకుమార్, రమాదేవి, శ్రీలక్ష్మి, కల్పన పాల్గొన్నారు. విమలాదేవి స్క్రీన్‌ప్లే రాసి సమర్పించే ఈ చిత్రానికి హరనాథరావు సంభాషణలకర్త. వేటూరి, సాహితి గీతాలకు సత్యం స్వరకల్పన చేశారు. టి. ఎస్. రామారావు సహకార దర్శకుడు.

## కప్పిటికి వోకొచ్చింది

''నా కిదొక వెరైటీ సబ్జెక్టు. ఇలాంటి చిత్రాన్ని డైరెక్ట్ చేయాలని నా చిరకాలవాంఛ,'' అన్నారు కట్టా సుబ్బారావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తాడి సత్యానందం, ఏడిద రాధారాణి నిర్మించే సరస నవరసవారి పై చిత్రానికి ఇటీవల చక్రవర్తి స్వరకల్పనలో కొన్ని గీతాలు రికార్డయ్యాయి. కాశీ విశ్వనాథ్ రచయిత. ''జనవరి నుంచి మార్చి వరకు పూర్తిగా ఔట్‌డోర్‌లో షూట్ చేస్తాం,'' అన్నారు నిర్వహణ బాధ్యతలు వహించే ఏడిద గోపాలరావు.



'కృష్ణార్జునులు'లో శ్రీదేవి, కృష్ణ



## వాడవిమలిలో పీడని సమ్మె

ఆర్ అర్ ఫాక్టరీ ఎదుట సమ్మె జరుగుతోంది కార్మికుల నాయకుడు అప్పన్నను ఫాక్టరీ మేనేజర్ తన గదిలోకి పిలిపించి, ''సమ్మెను మాన్పించటానికి లీడర్‌గా నీకెంత కావాలి ?'' అన్నాడు

అప్పన్నలో ఆవేశం రగుల్కొంది అయినా, వినమ్రంగానే ''న్యాయాన్ని ఇంత అన్యాయంగా కొనడం చాలా తప్పు, బాబూ !'' అన్నాడు

'ఆరువు ఉద్రేకానికి, సమ్మెలు అసమర్థతకు చిహ్నం '

''ఆకలిబాధే మీకు తెలిస్తే, సమ్మెను ఎప్పుడో మాన్పించి ఉండేవారు రోజు కూలీలుగా బతుకుతున్న మమ్మల్ని పరిమెనెంటు చేసుండేవారు, బాబూ !''

'ఉపన్యాసాలు ఇచ్చేవారికి మిగిలేది ఉపవాసాలే పిల్లలు గలవాడివి నీ పిల్లల భవిష్యత్తు పాడు చేసుకోబాకు నిన్ను మాత్రం పర్మినెంట్ చేస్తాను సమ్మెను మాన్పించు అయిదు వేలిస్తాను ''

''హుం ఈ డబ్బుతో నేనొక్కడ్నే బాగుపడతాను, బాబూ ! మా అందర్నీ పరిమెనెంటు చేయండి లేకపోతే న్యాయం జరిగేవరకు సమ్మె సాగుతూనే ఉంటుంది ''

''బెదిరిస్తున్నావా ? యూ స్టుపిడ్ ! గెటవుట్ !'' అంటూ మేనేజరు, అప్పన్నను బయటకు గెంటించాడు

ఫాక్టరీ మూతపడింది ఉత్పత్తికి అంతరాయం కలిగితే ఆ నష్టం దేశానిదే ఈ విషయం ఎవరికి తెలియదు ? కలిమికి – లేమికి మధ్యన ఘర్షణ ఎంత కాలం ? దేశం బాగుపడేదెప్పుడు ?

'చీకటోళ్ళు'' అనే హరనాథరెడ్డి కథ ఆధారంగా నిర్మాత ఎ వి ఎం మురుగన్ దర్శకత్వంలో రసవత్తరంగా రూపొందిన 'వాడని

# ...షాలు -జి. వి. జి.



'కోరుకున్న మొగుడు'లో లక్ష్మి, జయసుధ

## సీతాకోక చిలుక శతదినోత్సవం

"ఒక చిన్న కథను కొత్తవారితో తీసి పది కేంద్రాలలో శతదినోత్సవానికి కారకుడైన భారతీరాజా ఎంతో ప్రతిభగల దర్శకుడు నవ్యత్వం కోసం పాటుపడే దర్శకుడు ఏడిద నాగేశ్వరరావు కూడా చక్కని అభిరుచిగల నిర్మాత ' అంటూ పూర్ణోదయ మూవీక్రియేషన్స్ "సీ తా కో క చి లు క ' శత దినోత్సవ సభకు అధ్యక్షత వహించిన డైరెక్టర్ కె విశ్వనాథ్ శ్లాఘించారు. ఆయన షావుకారు జానకి ఈ చిత్ర విజయానికి కారకులైన నటీనటు లకు, సాంకేతిక నిపుణులకు షీల్డులు అందించారు. ఈ విజయం నా ఒక్కడిదే కాదు! ఈ చిత్రంలో పాల్గొన్న వారందరిదీనూ ఇలాంటి చిత్రాల ద్వారా ఇదివరకే విశ్వనాథ్, బాపుగారలు నాకు మార్గ దర్శకులయ్యారు అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన 'శంకరాభరణం' చిత్రాన్ని తయారు చేసిన సంస్థలో పని చేసే అవకాశం ల భిం చ డం నిజంగా నా అదృష్టమే,' అన్నారు భారతీరాజా



'వంశగౌరవం'లో శోభన్‌బాబు, సుజాత

## ప్రేమిస్తే ఏమవుతుంది ?

'పెద్దలను ఎదిరించి పెళ్ళి చేసుకున్న వాళ్ళే పెళ్ళికి పెద్దలను ఒప్పించాలన్నా వాళ్ళే కాని, మా చిత్రం ప్రేమను ఫలింపచేసుకున్న ప్రేమికుల రసవత్తరమైన గాథ. అందుకే ఆ పేరు పెట్టాం," అన్నారు కె. కె. సి. ఆర్ట్సు

ప్రేమిస్తే ఏమవుతుంది ?' చిత్రానికి కథ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే ఎస్ ఆర్ ఖాజా ఈయన లోగడ ఎడిటర్‌గా అనుభవం గడించాడు ఈయన, ఛాయాగ్రాహకుడు ఎ కె లింగం నిర్మించే ఈ చిత్రం షూటింగ్ డిసెంబర్ 10న మొదలయింది 'ముద్దమందారం" జంట ప్రదీప్, పూర్ణిమతోపాటు కవిత, విజయలక్ష్మి నవీన, జ్యోతిలక్ష్మి, నూతన్‌ప్రసాద్, సాక్షి రంగారావు, చిట్టిబాబు, కొత్త నటులు రాజా, రాజేష్ పాల్గొంటున్నారు దాసం గోపాలకృష్ణ సంభాషణల కర్త సత్యం సంగీత దర్శకుడు

## కీర్తి - కాంత - కనకం

'ఒక ఇంగ్లీషు సాంగ్‌ను అయిదు రోజుల్లో ఎక్సర్‌సైజ్ చేశాం ఇంగ్లీషు పాటలున్న తొలి తెలుగు చిత్రం ఇదే ఆ పాటలు పద్మినీ రాజన్ రాశారు ఒక తెలుగు గీతాన్ని నేను రాశాను టైటిల్‌ని బట్టి వ్యామోహాల పరిణామాల ఇతివృత్తమని స్ఫురించినా— ఇదొక విభిన్నమైన ప్రణయగాథ సెక్స్ ఉంటుంది గాని అసభ్యంగా ఉండదు హింసాకాండ లాంటి సన్ని వేశాలుంటాయిగాని భయానకంగా ఉండవు మా విశ్వశాంతి సంస్థ నుండి వెలువడే తొలి ప్రణయ గాథ బాబూనాగేంద్ర, ఇర్ఫాన్ అనే హీరోలను, మంగళగౌరి లలిత అనే హీరోయిన్స్‌ని పరిచయం చేస్తున్నాం వీరితోపాటు వీరేశ్వరం రంగా అనే కేరెక్టర్ ఆక్టర్ – అందరూ ఎంతో అనుభవమున్న వారిలా చక్కగా నటిస్తున్నారు," అన్నారు కథ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే యు విశ్వేశ్వరరావు నవంబర్ 20న ప్రారంభమైన ఈ చిత్రం షూటింగ్ డిసెంబర్ 20కి పూర్తయినట్లు నిర్మాత యు జి మురళీకృష్ణ చెప్పారు కొండవీటి వెంకటకవి సంభాషణలకర్త మోహనకృష్ణ ఛాయ, కె ఎల్ ధర్ శిల్పం, ఆర్ హనుమంతరావు కూర్పుతో కె రాధాకృష్ణ ప్రొడక్షన్ కంట్రోలర్

# సినిమా

## కిరాయి రౌడీలులో కోటిగాడు

ఆ ఊరికి సారా సామ్రాట్ బాబూరావు (రావుగోపాలరావు) ఆయన ఇలాఖాలో ఆయన ధర్మం నాలుగు పాదాలా నడవడానికి, నడిపించడానికి నమ్మిన బంటు కోటిగాడు (మోహన్‌బాబు)

ఒక రోజు ఆ బాబూరావు ఈ కోటిగాడ్ని పిలిచి, ఏం లేదురా చిన్నపని తగిలింది ఆ తుప్పల తాతబ్బాయిగాడ మనకి ఎగనెట్టగా సారా కొట్టెట్టేశాడు, అన్నాడో—లేదో 'అర్థమయింది నా కిరాయి ఎంత? ' అడిగాడు కోటిగాడు

ఓ వెయ్యిచ్చుకో''

'లాభం లేదు రెండు వేలయితే చెప్పు, ంటూ బయట దేరబోయాడు

బాబూరావు ఆ డబ్బిచ్చెయ్యమని తన పర్సనల్ సెక్రెటరీతో చెప్పాడు

డబ్బుతీసుకొని కోటిగాడు, తాతబ్బాయి (డాక్టర్ మదన్ మోహన్ ) సారా కొట్టు దగ్గర కొచ్చి, ఓ గళాసు సారా అందుకొని, 'నీ యబ్బ ఎప్పులాంటి సారా అని చెప్పి అమ్ముతున్నావు — కిర్సనాయిల్ వాసనొస్తోందేమిటి ?'' అంటూ ప్రారంభించాడు కాస్త కైపెక్కగనే 'ఒరే, తాతబ్బాయీ, నీ సారా బాగా లేదు సీసాలు బాగా లేవు నీ కొట్టు బాగా లేదు కొట్టెట్టిన స్టైల్ బాగా లేదు అసలు నీ మొహమే బాగా లేదు అందుకు కొట్టు ఎత్తేసి, ఈ ఊర్నుండి జెండా ఎత్తెయ్యడం మంచిది'' అంటూ ఆ సారా కొట్టును ధ్వంసం చేస్తూ సలహా ఒకటి పారేశాడు

తాతబ్బాయి కాళ్ళ బేరానికొచ్చాడు

'రేపు మళ్ళీ నేను ఈ వీధి గుండా వచ్చే టైంకి కూరగాయల వ్యాపారమో, కొబ్బరికాయల వ్యాపారమో పెట్టుకున్నట్టు కనిపించాలి నువ్వు!'' అంటూ ఫైనల్ వార్నింగ్ ఇచ్చి, బుల్లెట్‌మీద దూసుకువెళ్ళాడు కోటిగాడు

ఎ కోదండరామిరెడ్డి దర్శకత్వంలో టి క్రాంతికుమార్ నిర్మించిన శ్రీ క్రాంతి చిత్ర వారి కిరాయి రౌడీలు'' చిత్రంలో చిరంజీవి, రాధిక, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య ఇతర ముఖ్య పాత్రధారులు సత్యానంద్, చక్రవర్తి, వెంకట్, కృష్ణంరాజు, అనిల్, శివకుమార్ ప్రభృత సాంకేతికవర్గం

## వంశ గౌరవంలో వంశాంకురం

పార్వతి (ఎ ఆర్ వరలక్ష్మి) బియ్యం ఏరుతూ ఉ జగన్నాథం (రమణమూర్తి) ఎక్కడికో బయలుదేరడానికి చొక్కా తొడుక్కుంటున్నాడు ఇద్దరూ దయనీయమైన స్థితిలో ఉన్నారు ఇంతలో పోస్ట్‌మన్ ఒక కవర్‌ను అందజేసి వెళ్ళిపోయాడు 'పితికిపోయి, పితికి చేరడానికి సిద్ధంగా ఉన్నవాడ్ని పలకరించేవాడొకడున్నాడన్నమాట !'' అంటూ జగన్నాథం కవర్‌లోంచి ఉత్తరాన్ని తీశాడు

''ఎవరు రాశారండీ ?'' అడిగింది పార్వతి ఆమె కళ్ళల్లో ఏదో ఆశ కనిపిస్తోంది

అబ్బాయి రాశాడే,'' అంటూ జగన్నాథం ఆ ఉత్తరాన్ని చదవసాగాడు ''పూజ్యులైన నాన్నగారికి నేను ముందు రాసినట్టుగ రేపు మన ఊరు రావడంలేదు రాజశేఖరమ్మగారి అమ్మాయి నిశ్చితార్థం శుక్రవారంనాడు ఉండడంతో ఇక్కడ పనులెక్కువగా ఉన్నాయి ' ఆ తర్వాత చదవలేక పోయాడు

పార్వతి లేచి, దగ్గరికి వస్తూ, 'ఇదేమిటండీ ? వాళ్ళమ్మాయి పుట్టగానే మనకి కోడలు పుట్టిందనుకున్నాం గదా ? ఇప్పుడి నిశ్చితార్థం ఏమిటి ?'' అంది

'నాకూ అర్థం కావడంలేదు, పార్వతీ! స్వయంగా వెళ్ళి తెలుసుకుందాం పద!'' అంటూ జగన్నాథం బయలుదేరడానికి త్వరపడ్డాడు

శోభన్‌బాబు హీరోగా ఏలూరి దుర్గాప్రసాద్ సమర్పించే అభినయ ఆర్ట్స్ క్రియేషన్స్ ''వంశ గౌరవం' చిత్రాన్ని బొక్కసం అంజనేయులు నిర్వహణలో జె ఆదినారాయణరావు, ఆర్ అంజనేయులు నిర్మిస్తున్నారు సత్యనారాయణ, రాజా అల్లు రామలింగయ్య, భానుచందర్, సుజాత, విజయశాంతి, గీత, ఝాన్సి, జానకి, టొమేటో లక్ష్మి, శివరాజా ఇతర తారాగణం జంధ్యాల, వేటూరి, చక్రవర్తి, వెంకట్, కందస్వామి, ఎస్. పి. రంగారావు ప్రభృత సాంకేతికవర్గం.

''పూర్వీకులు ఆర్జించిన కీర్తిప్రతిష్ఠల కోసం, వంశ గౌరవం కోసం ఆస్తిపాస్తులను, చివరికి ప్రాణాలను సైతం త్యజించిన వారున్నారు. అలాంటి ఓ జమీందారు కథ ఇది. వంశప్రతిష్ఠకూ, మమతానురాగాలకూ మధ్య ఘర్షణే ఈ ఇతివృత్తం,'' అని టూకీగా చెప్పారు ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే బాధ్యతలు వహించే ఎస్. రవీందర్‌రెడ్డి.



'అల్లుళ్ళొస్తున్నారు'లో
చిరంజీవి, గిరిబాబు, చంద్రమోహన్

## రాగదీపం

''ప్రేమకు మాంగల్యం'' బదులుగా 'రాగదీపం'' అనే పేరును స్థిరపరచినట్లు వీరరాణి ఎంటర్‌ప్రైసెస్ అధినేత కొడాలి బోసుబాబు తెలిపారు. దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో ఎ ఎన్. ఆర్., జయసుధ, లక్ష్మి, రంగనాథ్, రావు గోపాలరావు ప్రభృతులు నటించిన ఈ చిత్రం జనవరి రెండవ వారంలో విడుదలవుతుంది.

* * *



'కిరాయి రౌడీలు'లో మోహన్‌బాబు, డా మదన్‌మోహన్



'ఏమండోయ్ శ్రీమతిగారు'లో నిర్మల, చంద్రమోహన్

శ్రీ కాంతి చిత్ర

# కిరాయి రౌడీలు

ఈస్ట్‌మన్‌కలర్

నిర్మాత: కాంతికుమార్

దర్శకత్వం: ఎ.కోదండరామిరెడ్డి

సంగీతం: చక్రవర్తి






THARAKAPRABHU ADS.





'మరోమలుపు'లో ఎ యల్ నారాయణ, మాతన్ ప్రసాద్



'విప్లవశంఖం'లో మాదాల రంగారావు

# సినిమా

## విప్లవ శంఖం

యువతరం ఎక్స్‌ప్రెస్‌వారి 'విప్లవ శంఖం' చిత్రానికి నిర్మాణ సారధ్యమేకాక, కథ, స్క్రీన్‌ప్లే మాటలు సమకూర్చిన మాదాల రంగారావు ఆ చిత్రం గురించి ప్రస్తావిస్తూ 'ఆకలి నుంచి ఆవేదన పుడుతుంది ఆవేదనలోంచి ఆవేశం రగుల్కొంటుంది ఆ ఆవేశానికి ఆశయాల ఆలోచనలు తోడైనప్పుడు మనిషి విప్లవాలే సాధించవచ్చు అరచేతిని అడ్డుపెట్టి అరుణోదయాన్ని ఆపలేరు ఉరికంబాలెక్కించి, నిప్పుల ఉప్పెనల్ని ఆపలేరు జైలుగోడలు, ఉరికొయ్యలు రానున్న విప్లవాన్ని ఆపలేవు మ్రోయించిన ఒక వీరుని కంఠం వేయి గొంతుకల విప్లవ శంఖం కళ కళ కోసం కాదు, అది సామాజిక చైతన్యం కోసం అని నిరూపించడానికి ఒక ప్రజాకళాకారుడు ప్రజలందరినీ కదిలించి, తానెలా ప్రజాసైనికుడైనదీ నిరూపించే చిత్రం,' అని తెలియజేశారు గాంధీ జయంతినాడు చిత్రీకరణ మొదలయిన ఈ చిత్రం రీరికార్డింగ్ పూర్తయింది "రిపబ్లిక్‌డే విడుదల," అన్నారు నిర్మాతలు టి కృష్ణ, కె రాధాకృష్ణ 'విశ్వశాంతి' యు విశ్వేశ్వరరావు పర్యవేక్షణలో బీరం మస్తాన్‌రావు దర్శకత్వం వహించిన ఈ విప్లవాత్మక చిత్రంలో మాదాల రంగారావు, గిరిబాబు, నల్లూరి వెంకటేశ్వర్లు, టి. కృష్ణ, చలపతిరావు, పి. జె. శర్మ, నర్రా వెంకటేశ్వరరావు, ఎం పి ప్రసాద్ పరమానందం, వీరభద్రరావు, బాబూరావు తూమగుంట, కొడాలి ఆదిశేషయ్య మన్నెం సత్యం, తోట నరసింహారావు, ప్రతాప్, రాజగోపాలరావు నవీన్, వెంకటేశ్వరరెడ్డి, త్రివేణి, లక్ష్మీచిత్ర సీతాలత, కరుణ, విజయలక్ష్మి వగైరా ప్రజా కళాకారులెందరో పాల్గొన్నారు శ్రీశ్రీ, వంగపండు ప్రసాద్, అదృష్టదీపక్, కీ॥ శే॥ విజయలక్ష్మి గీతాలకు చక్రవర్తి స్వరకల్పన చేశారు ఆర్ రామారావు ఛాయాగ్రాహకుడు ఆర్ హనుమంతరావు సంకలనకర్త శేషు నృత్య దర్శకుడు ఉదయకుమార్ సహకార దర్శకుడు కె వెంకటేశ్వరరావు నిర్వహణ బాధ్యతలు వహించారు



'జగన్నాథ రథచక్రాలు'లో కృష్ణ

## బాపు రమణలతో కృష్ణ కృష్ణావతారం

"కృష్ణగారిది ఓ విలక్షణమైన పాత్ర మే 16 నుంచి షూటింగ్," అన్నారు చిత్రకల్పన వారి "కృష్ణావతారం" చిత్రానికి నిర్మాణ సారధ్యం వహించే జయకృష్ణ "సాక్షి, రాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్" చిత్రాల అనంతరం ముళ్ళపూడి వెంకటరమణ రచన, బాపు దర్శకత్వంలో కృష్ణ నటించే ఈ చిత్రానికి మహదేవన్ సంగీతం, బాబా ఆజ్మీ ఛాయ, భాస్కరరాజు శిల్పం ఇతర ఆకర్షణలు

# "కాంప్లాన్® మాత్రమే మా కుటుంబానికి సరియైనది–సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం."



''మా శ్రీవారు పనిలో మునిగి వంటా
రెప్పుడూ—తరచు భోజనం ఎగ్గొడుతూ
ఉంటారు ఆయనకు అందని ఆ పోషణని
యిస్తుంది కాంప్లాన్."



''మా అబ్బాయి అన్నం సరిగ్గా తినడు,
మారాం చేస్తాడు వాడి పెరుగుదలకు కావలసిన
ప్రొటీన్లూ, యితర ఆహార పదార్థాలూ
కాంప్లాన్‌తో తప్పకుండా అందుతాయి"



"మా అమ్మ యిప్పుడే జబ్బుపడి లేచింది.
ఆకలి లేదు కోలుకునే యీ సమయంలో,
కాంప్లాన్ ఆదర్శమైన తీరులో
పుష్టినిస్తుందనిపిస్తోంది"

## కేవలం కాంప్లాన్® లోనే అందరికీ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.



"ఇంట్లో పని చేసిచేసి
అలసిపోతాన్నేను
మరింత పోషణ
అవసరమనిపిస్తుంది
ఒక్కొక్కప్పుడు
మరి కాంప్లాన్ నేను మా
కుటుంబానికి
యివ్వగలిగినంత
యిచ్చేలా
చేస్తుందనిపిస్తుంది"

కేవలం కాంప్లాన్‌లోనే శాస్త్రీయంగా రూపొందించిన పాళ్ళలో, మన శరీరానికి ప్రతిరోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి...ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజ పదార్థాలు. డాక్టర్లు ఎక్కువగా సిఫార్సు చేసే ఆరోగ్యబద్ధమైన పానీయం.

రుచికరమైన చాక్లెట్, ఏలక్కాయ–కుంకుమపువ్వు, స్ట్రాబెరీ సువాసనలలో దొరుకుతుంది—ప్లెయిన్ (సాదాగా) కూడా.




# కాంప్లాన్®

## —సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం.

LINTAS-GLC 10-2316 TL

## కళాపీఠం అవార్డులు

యార్లగడ్డ రాజ్యలక్ష్మి వెంకన్న చౌదరి కళాపీఠం (మదరాసు) గత రెండు సంవత్సరాలుగ నిర్వహిస్తున్నట్లుగానే వివిధ రంగాలలో గణనీయమైన సేవ చేసిన తెలుగు ప్రముఖులను పదిమందిని ఈ సంవత్సరం కూడా సత్కరిస్తుంది సత్కారం పొందుతున్న పదిమంది పేర్లు ఇవి ఆచార్య ఎన్ జీ రంగా – ఎల్ వి ప్రసాద్ – ఎం శాంతప్ప – "ఈనాడు" చీఫ్ ఎడిటర్ – సి హెచ్ రామోజీరావు – దివాకర్ల వెంకటావధాని, –



'నాయుడుగారబ్బాయి'లో కృష్ణ, రంగనాథ్, అంబిక

కె. లింగరాజు, డా. తాళ్ళూరి శివరామకృష్ణయ్య – కొండవీటి వెంకటకవి – డా. సి. నారాయణరెడ్డి మరియు శ్రీమతి జమున ... వీరికి ఒక్కొక్కరికి సర్టిఫికెట్‌తోపాటు వేయినొక్క రూపాయి నగదు బహుమతి అందించబడుతుంది. ఈ సత్కార సభ 1982 జనవరి 2వ తేదీన చీరాల తాలూకా కారంచేడు గ్రామంలో జరుగుతుంది. అదే రోజు కారంచేడులోని యార్లగడ్డ నాయుడమ్మ ఓరియంటల్ స్కూలు రజతోత్సవం కూడా జరుగుతుంది. ఈ సభకు ఎనిమిదిమంది రాష్ట్రమంత్రులతోపాటు మరో యిద్దరు రాష్ట్ర ప్రముఖులు కూడా విచ్చేస్తారు. 

# "కేర్‌ఫ్రీ రక్షణ –దానిలా మరొకటి లేదిక!"



మిమ్మల్ని దృష్టిలో పెట్టుకుని తయారుచేసారు కేర్‌ఫ్రీ. ఇబ్బందైన ఆ 5 రోజుల్లో ఆధునిక యువతికి కావలసిన భద్రత కూడిన ఆ సంరక్షణని యిస్తుంది

మీకు అధిక రక్షణ యివ్వడానికి దీనిలో మరింతగా పీల్చుకునే గుణం

కేర్‌ఫ్రీ శాస్త్రీయంగా రూపొందించబడినది దీని లోపల భాగంలో గల మెత్తని పొరలు ప్రత్యేకమైన రీతిలో పీల్చుకోగలిగే పదార్థంతో చేయబడ్డాయి కేర్‌ఫ్రీ మీకు యిప్పటి దాకా వాడిన వాటి అన్నిటి కన్నా చెమ్మను నిలుపుకోగలుగుతూ మీకు మరింతగా రక్షణని యిస్తుంది అయినా యిది ఎంతో సన్నగా సున్నితంగా యిమడికగా ఉంటుంది

అద్వితీయమైన దీనికిగల ప్లాస్టిక్ కవచం మరకలు పడటాన్ని నిరోధిస్తుంది

కేవలం కేర్‌ఫ్రీలోనే క్రింది భాగం చుట్టూరా నేప్‌కిన్‌కి



రెండు వైపులా గల 3. వైపుల గల నీలి ప్లాస్టిక్ కవచం మధ్యన అడ్డుగా నిలవడం కోసం ఉంది అందుకే యిది తడిసి పోతుందని గాని మరకలు పడుతుందని గాని భయం లేదు

ఎంతో సౌకర్యం మరెంతో వీలు

కేర్‌ఫ్రీ మీకు పూర్తిగా సౌకర్యాన్నిస్తుంది దీన్ని వాడటం పారెయ్యడం ఎంతో తేలిక దీన్ని ఫ్లష్ చేసెయ్యండి, అంతే, మార్చుకోవటం కూడా వీలు మీరెప్పుడు మార్చవలసివచ్చినా మీకెంతో సౌకర్యం

అవును కేర్‌ఫ్రీతో మీరెంతో భద్రంగా, ఎంతో సౌకర్యంగా ఉంటారిక అసలు నెలలో అది ఏ రోజూ అనే ధ్యాసే ఉండదు. మీరిక ఏం చెయ్యదలుచుకున్నా బేఫికరుగా చేయగలరు మరి - ఎందుకంటే మరేదీ యివ్వలేని రక్షణను యిస్తుంది కేర్‌ఫ్రీ!

ఇది 10 మరియు 20 నేప్‌కిన్స్ ప్యాక్‌లలో దొరుకుతుంది






Johnson & Johnson*

## కేర్‌ఫ్రీ* – కాలం మారుతున్నయీ రోజుల్లో పూర్తి రక్షణ

సీరియల్

# జీవితవనంలో కొత్తగాలి

## కుందుర్తి ఇందిరాదేవి

**17**

**(గత సంచిక తరువాయి)**

**శ**శి ఫస్ట్‌క్లాసులో పాసయింది మీనా ప్యాల్ ఫస్ట్ రాంక్ తెచ్చుకుంది ఉష తప్పింది ఇంటర్ నేను కోపంగా "నీకు సిగ్గులేదుటే" అని తిడితే ఉష నవ్వుతూ "ఎందుకూ మోడరేషన్ వస్తుంది నేను తప్పకుండా పాసవుతాను" అని పందెం వేసింది అది అన్న సమయం ఎలాంటిదోగానీ ఉష మోడరేషన్‌లో పాసయింది

"సంధ్యా! ఇక నువ్వు నానిస్తే లాభంలేదు మా అమ్మ టెలిగ్రామ్ ఇచ్చింది, వెంటనే రమ్మనమని" అన్నాడు కిరణ్

చల్లటి సాయంకాలం వేళ పార్కులో కిరణ్ రాగానే టెలిగ్రామ్ అంటూ మొదలెట్టాడు "టెలిగ్రామా" అన్నాను ఆశ్చర్యంగా

"అవును మా చెల్లెలికి డెలివరీ అయిందిట పాపాయి పుట్టింది ఈ వంకతోనైనా నేను మద్రాసు వెడితే ఏదో ఒక పిల్లని తెచ్చి నాకు అంటగడదామని మా అమ్మ ఉద్దేశం నాకు మాత్రం తెలీదనుకుంటోంది మా అమ్మ" అతను విరాగ్గా అన్నాడు

నా మొహం పాలిపోయింది తర్వాత మెల్లిగా అన్నాను —

"కిరణ్! ఇప్పుడు నేను నడి సముద్రంలో ఉన్నాను తెలుసా"

"ఆదేమిటి' అతను తెల్లబోయాడు

"శశి ఎవరినో ప్రేమించిందట" అంటూ అంతా చెప్పేశాను అతను అంతా వి నవ్వుతూ, "నీకన్నా నీ చెల్లెలు నయం నీకన్నా ఫార్వర్డ్‌గా ఉంది నువ్వు నిజంగా ఒట్టి అడివిమనిషివే మీ విమల చెప్పినట్టు మా ప్రమీల చెప్పినట్టు వెర్రి మాలోకానివి" అన్నాడు

"ఇప్పుడు ఎలా" దిగులుగా అన్నాను

"శశికి ఏదైనా ఉద్యోగం చూస్తాను" అన్నాడు ధైర్యం చెబుతూ

"హమ్మయ్య!" అన్నాను అవునుమరి ఈ ప్రేమ సముద్రంలో పడి ఈదుతున్నాను ఏ గట్టుకు చేరతానో అని భయం

నేను స్కూటర్ దిగి "అచ్ఛా! గుడ్‌నైట్" అన్నాను

అతను నా నడుం చుట్టూ చెయ్యివేస్తూ —

"నేను రానానికి రెండు మూడురోజులు పడుతుందేమో రాణీగారి దర్శనం ఉండదు మా పిన్నిని రేపు మీ ఇంటికి వెళ్ళమని చెప్పాను ఏమిటి వింటున్నావా కేవలం నా ప్రోద్బలంతోనే పిన్ని మద్రాస్ ప్రయాణం కాన్సిల్ చేసుకుంది" అన్నాడు

నేను తెల్లటి చీరచెంగును వేలికి చుట్టుకుంటూ —

"మూడు రోజులా" అన్నాను దిగులుగా

"నాకుమాత్రం వెళ్ళాలని ఉందేమిటి మా ఎగుణకి కోసం వస్తుందని బయలుదేరాను ఆ మద్రాస్ వెళ్ళాలంటేనే నాకు చిరాగ్గా ఉంది" అన్నాడు

"గుడ్‌నైట్" అతను వెళ్ళిపోయాడు నేను నెమ్మదిగా వెనక్కితిరికి నిశ్చేష్టురాలినై పోయాను కొద్దిదూరంలో శశికూరల బుట్టతో నిలబడి ఉంది నేను పట్టుపడ్డ దొంగలా నిలబడి పోయాను

"అక్కా! ఇక వెళదామా" శశి పిలవటంతో నేను తలెత్తిచూసే ధైర్యంకూడా లేకుండా అలా దానిప్రక్కనే నడవసాగాను

ఇద్దరం ఇంటికి వెళ్ళిపోయాము రాత్రి నేను పడుకున్నప్పుడు వెంటనే నిద్రపట్టలా బయట శశిగొంతు గుసగుసగా వినిపిస్తోంది అయిపోయింది శశి కాస్తా ఈ రహస్యం అమ్మకు చెప్పేస్తోంది నాకు భయంలాటిది కలగసాగింది నేను తలెత్తి చూశాను నా ఎదురుగా నిద్రలేవగానే కనబడేటట్టుగా పెట్టాను ఆ చిత్రాన్ని ఆ జీవితవనం చూసి ఇంట్లో అందరూ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

నా కంటికి ఎన్నిసార్లు చూసినా జీవితవనం కొత్తగానే ఉంటుంది అందంగా అపురూపంగా ఉండే ఆ జీవితవనంలోకి సీతాకోకచిలుకలా ఎగిరిపోయినట్టు ప్రతిరోజూ కలలు కంటూనే ఉన్నాను ఆ కలలు ఎంతో అద్భుతంగా ఉంటాయినాకు అందులో ఆ భార్య భర్తలిద్దరూ నేనూ, కిరణ్ లుగా, వాళ్ళు మా సంతానంగా ఊహించుకుంటూ గంటలు గంటలు గడపటం అలవాటయిపోయింది

మర్నాడు రాధమ్మగారు వచ్చింది మాఅమ్మతో ఆవిడ లోకాభిరామాయణం చెప్తూ అసలు విషయం కాస్తా బయటపెట్టేసింది అమ్మ వెంటనే సమాధానం చెప్పలేదు రాధమ్మగారు వెళ్ళిపోయేముందు అంది—

"మీరు బాగా ఆలోచించుకోండి వదినగారూ సంధ్య నాకు కూతురులాంటిది మా కిరణ్ బుద్ధిమంతుడు మీరు అన్యథా భావించకండి వాళ్ళిద్దరూ ఒకరినొకరు ఇష్టపడ్డారు" అని వెళ్ళిపోయింది

అమ్మ దిగాలుపడిన దానిలా కూర్చుండిపోయింది నేను మెల్లిగా అమ్మపక్కనచేరి "అమ్మా! నేను కావాలని నా కోసం ఇంతవరకూ నిన్నేమీ కోరలేదమ్మా నువ్వు ఈ పెళ్ళికి అంగీకరించమ్మా నేను పెళ్ళయినా ఈ కుటుంబాన్ని వదిలిపెట్టను అందరూ జీవితంలో స్థిరపడిందాకా నా శాయశక్తులా నేను కుటుంబాన్ని ఆదుకుంటానమ్మా" అన్నాను అలా అంటూంటే నాకళ్ళల్లో నీళ్ళు తిరిగాయి

"సంధ్యా" అమ్మ బావురుమంది

"అమ్మా నాన్నమీద ప్రమాణంచేసి చెప్తున్నాను నేను పెళ్ళి చేసుకున్నా ఈ ఇంటినిమాత్రం మర్చిపోనమ్మా కిరణ్ అన్ని షరతులకీ ఒప్పుకున్న తర్వాతే ఈ పెళ్ళికి నేను సమ్మతించానమ్మా" అన్నాను నాకు ఒకపక్క ఏడుపు తన్నుకువస్తోంది ప్రపంచంలో ఎంతమంది ఆడపిల్లలు లేరు అతను కావాలని నన్ను కోరి చేసుకుంటుంటే అమ్మ ఎగిరి గంతేయాల్సిందిపోయి ఎందుకు ఏడుస్తోందో నాకు అంతుబట్టటంలేదు

---

**జరిగిన కథ - 9:** పోతూ పోతూ ఆ కుటుంబ భారంతోపాటు చేసిన అప్పు కూడ పెద్దకూతురైన సంధ్యపై వేసి కన్నుమూస్తాడు ఆమె తండ్రి ఓ చిన్న ఉద్యోగం చేస్తూ తల్లితో పాటుగా తమ్ముణ్ణి, ముగ్గురు చెల్లెళ్ళను పోషిస్తూ వాళ్ళకి చదువు సంధ్యలు చెప్పిస్తుంటుంది ఎప్పుడైనా డబ్బు అవసరమైతే తన స్నేహితురాలు ప్రమీల దగ్గర తెచ్చుకుని మళ్ళీ ఇచ్చేస్తుంటుంది ప్రమీల అన్న కిరణ్‌తో సంధ్య స్నేహం చిగుళ్ళు తొడుగుతూంటుంది ప్రమీల పుట్టినరోజు పార్టీకి సంధ్యా, కిరణ్‌లు వెళతారు, ఆమె ఆహ్వానించగా పార్టీ పూర్తయిన తర్వాత తన స్కూటర్‌పై సంధ్యను వాళ్ళింటి దగ్గర దించి వెళతాడు కిరణ్ సంధ్యకు దగ్గర కావాల ఉద్దేశ్యంతో కిరణ్ చేసే పనులు ఆమెకు ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి! శశి ఎవరో అబ్బాయితో తిరుగుతుండగా చూసిన ప్రమీల చెప్తేగాని తన కర్తవ్యం ఏమిటో గుర్తుకు రాలేదు సంధ్యకి శశి ఎవరితోనో తిరగడం తన కళ్ళారా చూసిన సంధ్య నిశ్చేష్టురాలవుతుంది ఒకరోజు "సంధ్యా ఐ లైక్ యూ! ఐ లౌ యూ" అని కిరణ్ చెప్పగా ఆమె ఉబ్బితబ్బిబ్బవుతుంది శశి చదువు పూర్తయి ఉద్యోగంలో చేరగానే ఆమెకు ఆ ఇంటి బాధ్యత అప్పగించి సంధ్యా, కిరణ్‌లు పెళ్ళి చేసుకొని తామూ సహాయపడాలని నిశ్చయించుకొంటారు తను అన్నమాటలకు శశి తన ప్రియుడు ప్రకాష్‌తో నిక్కచ్చిగా మాట్లాడి వెళ్ళిపోవడం చూసిన సంధ్య ఆశ్చర్యపోతుంది ఆమె అభిమానానికి సంధ్యకు పుట్టినరోజు కానుకగా 'జీవితవనం' అనే ఛాయాచిత్రాన్ని గీసి ఇస్తాడు కిరణ్

''గోత్రాలు కలవ్వు సంధ్యా'' అంది చివరికి

''పో అమ్మా! నిరిధాగస్త్రం గోత్రాలు కలవకపోతే పెళ్ళిచేసుకోకూడదా'' అన్నాను

నేనూ కిరణ్ ఈ ప్రేమసముద్రంలో పడ్డాము ఈదుతున్నాము. ఒకసారి కిరణ్ ఇంటికి వచ్చాడు ఆ సమయంలో అమ్మలేదు ఇంట్లో అందరిని చక్కగా పలకరించాడు

''హాయ్‌సంధ్యా! ఎలాఉంది మన జీవితవనం'' అన్నాడు నా గదిలోకొచ్చి

నేనూ బుంగమూతిపెట్టి ''ఆ జీవితవనం నోడెక్కి కూర్చుంది రాత్రికల్లా కల్లోకి వస్తుంది'' అంటుంటే ఆశాను పక్కున నవ్వాడు

కిరణ్ వెళ్ళగానే ఉష మొదలెట్టింది ''అచ్చు సినిమా హీరోలా ఉన్నాడు. కదే మీనా శశీ అతను చాలా చక్కగా నవ్వుతాడు కదూ'' అంది నేను చిన్నగా నవ్వుకున్నాను

నా అదృష్టం నాలుగు కాళ్ళమీద నడుస్తున్నట్టుగా ఉంది నేనూ జీవితంలో స్థిరపడుతున్నాననే ధైర్యం, ఆత్మ విశ్వాసం ఏర్పడినాయి విమల నన్ను పట్టి ఊపేసింది ''అమ్మదొంగా ఈ అడివి మనిషిని మామూలు మనిషిని చేసినవాడు నిజంగా అసాధ్యుడే'' అని ప్రశంసించేది ప్రేమ వివాహం అని విమల చెప్పేసరికి ఔరా అంటూ ఆఫీసులో అందరూ ముక్కుమీద వేలేసుకుని, ''సంధ్యా రాణిగారే ప్రేమించి పెళ్ళి చేసుకోవటమే'' అన్నారు హనుమంతరావు ఈ షాక్‌కి తట్టుకోలేనట్టు గడగడ గ్లాసెడు మంచినీళ్ళు తాగేశాడు

## 18

ప్రమీల బావ రఘు అమెరికా నుంచి వచ్చాడు ప్రమీలకి పట్టపగ్గాలులేవు రఘు నాగార్జునసాగర్ వెడదాం అన్నాడట అన్నయ్య కూడా నువ్వు వస్తే వస్తానన్నాడు అని నా ప్రాణం తీసింది

''చూద్దాంలే'' అంటూ అప్పటికి తప్పించుకున్నాను తర్వాత కిరణ్ ఫోన్‌చేసి చెప్పాడు నేను సమాధానం చెప్పలేదు అమ్మ అసలే అంగీకారం తెలుపలేదు అవుననలేదు, కాదనలేదు నేను కిరణ్‌తో పొరుగూళ్ళు కూడా వెళ్తానంటే ఏమైనా అనుకుంటుందేమో అని భయంవేసింది సాయంత్రం కిరణ్ కలిసినప్పుడు ''సంధ్యా! మనం ఇంతవరకూ ఎక్కడికైనా సరదాగా వెళ్ళామా కనీసం పిక్‌నిక్‌కి వెళ్ళామా. ఎంతసేపూ ఈ పార్కుల్లో కలుసుకోవటమే తప్ప'' అనటంతో నా నోట్లో మాట నోట్లోనే ఆగిపోయింది. అమ్మ ఏమీ అనలేదు

కిరణ్, ప్రమీల, రఘులతో నాగార్జునసాగర్ ప్రయాణం నా జీవితంలో చెరగని ముద్రవేసింది కిరణ్‌తో ఆ ప్రదేశాలన్నీ తిరిగేటప్పుడు అంత ఆనందంగా ఉంటుందని నాకు తెలీదు మేము హైదరాబాద్ తిరిగి వచ్చాము కిరణ్ నన్ను దింపటానికి ఇంటికి వచ్చాడు

''కిరణ్ నువ్వే కనుక నన్ను బలవంతం చేయకపోతే ఇంతఆనందాన్ని నేను మిస్సయిపోయేదాన్ని థ్యాంక్స్! థ్యాంక్స్ ఎ లాట్'' అన్నాను

''ఇది కూడా ఒక ఆనందమేనా మనం పెళ్ళవగానే హనీమూన్ వెడతాం చూడు అప్పుడు ఇంకా ఎంత జాలీగా ఉంటుందో తెలుసా'' అన్నాడు నవ్వుతూ

''అచ్ఛా'' అన్నాను వెక్కిరిస్తూ కిరణ్ వెళ్ళిపోయాడు

ప్రమీల వివాహం నిశ్చయమైంది రాధమ్మగారు స్వయంగావచ్చి అమ్మతో ''మీరు తప్పకుండా రావాలి కాబోయే బంధువులం కూడా'' అని నన్ను చూస్తూ ''సంధ్యా నేను పెద్దదాన్ని కోడలివి నువ్వే పెత్తనం చేయాలి'' అంది నాకు సిగ్గు ముంచుకు వచ్చింది

పెళ్ళికి చెల్లెళ్ళను తీసుకుని వెళ్ళాను కిరణ్ ఏదో పనిమీద అటుగా వచ్చి ప్రమీల దగ్గరికి వెళదాం అనుకుంటున్న నన్ను పట్టి నిలేసి –

''ఏమండీ! మీకు ఇప్పుడు తీరిక చిక్కిందా ఏం శశీ! మీ అక్క అసలే నిద్రమొహం నువ్వైనా గుర్తు చెయ్యకూడదూ'' అని దెబ్బలాడాడు

ఉష ధైర్యంగా ''అక్కకి ఇలా రావటమే ఇష్టం'' అంది

కిరణ్ మా నలుగుర్నీ ప్రమీల ఉన్నచోటుకి తీసుకువెళ్ళాడు. ప్రమీల ప్రక్కన కూర్చుని ఒకావిడ ప్రమీలతో ఏదో అంటోంది ఆవిడని చూడగానే నేను నవ్వును ఆగిపోయాను

''మళ్ళీ ఏమయింది'' అన్నారు కిరణ్ ఆశ్చర్యంగా నేను అతని ముఖం చూశాను ఆవిడలో అచ్చు కిరణ్ పోలికలు సుస్పష్టంగా కనిపిస్తున్నాయి ప్రమీల మిత్రబృందం ఆవిడకి భయపడినట్టు మెదలకుండా కూర్చుని ఉన్నారు

ప్రమీల నన్నుల్ని చూడగానే ''ఇప్పుడు మాత్రం ఎందుకు వచ్చావే పెళ్ళి పూర్తయింతర్వాత రాలేకపోయావా'' అంది కోపంతో కారణం నా కోసం అంతకుముందు రాత్రే కారు పంపారు నేనే తిప్పి పంపేసి ఇప్పుడు వచ్చాను

నేను నవ్వుతూ ఏదో అనబోయాను నా వెనక వస్తున్న శశిని, ఉషని, మీనాని చూడగానే ''ఓహ్హో! సంధ్యా నీకు ఎన్నాళ్ళకి బుర్ర సరిగా పనిచేసిందే. రండి రండి ఏమిటి శశీ అక్క పెళ్ళికి









ఇప్పుడా రావటం'' అంది నిష్ఠూరంగానూ, ఆప్యాయంగాను

నన్ను నఖశిఖ పర్యంతం చూస్తున్న ఆవిడని చూసి ప్రమీల చప్పున "ఆమె ఎవరో తెలుసా అమ్మా" అంది

కిరణ్ నా చెయ్యి పుచ్చుకుని లాక్కువెళ్ళి "అమ్మా! పెళ్ళీ, పెళ్ళీ అని నా ప్రాణం తీస్తున్నావుగా ఇదిగో నీ కోడలు'' అన్నాడు

ఆవిడ కళ్ళు పత్తికాయల్లా అయినాయి నాకు ఒక్కక్షణం కాళ్ళు చేతులూ ఆడలేదు కిరణ్ సైగ చేయటంతో నేను చప్పున వంగి ఆవిడకి దణ్ణం పెట్టాను

ఉషని, శశిని, మీనాని చూడగానే ఆవిడ కళ్ళల్లో ప్రశాంతత, ఆనందం ఎవరో ఊదేసినట్టుగా ఆరిపోయినయి ఆవిడ చూపులు కొడుకువైపు తిరిగాయి ఏమిటిరా ఈ అమ్మాయినా నువ్వు ప్రేమించింది ఈ అర్భకాకారం నీకెలా నచ్చిందిరా అన్నట్టున్నయి ఆ చూపులు

రాధమ్మగారు వచ్చింది వస్తూనే "హమ్మయ్యా కోడలుపిల్ల దిగబడింది చూశావా అక్కయ్యా నీ కోడల్ని కాస్తంత రంగు తక్కువే కానీ, ముత్యం లాంటి పిల్ల చాలా నెమ్మది అమాయకత్వం ఎక్కువ'' అంది గలగలా

ఇంతలో పెద్దకోడలు కుసుమ వచ్చింది ఆవిడ అలంకరణ ముందు, ఆ నగలముందూ నేను వెలవెలబోతున్నట్టున్నాను

"ఏమిటి సంధ్యా త్వరగా తయారుకా — ముహూర్తం టైం అవుతోంది'' అంది హడావిడిగా

'నేను రెడీగానే ఉన్నాను'' అన్నాను నవ్వుతూ

కుసుమ చూపులు నన్ను నఖశిఖపర్యంతం పరిశీలించి ఇదేం వేషంరాబాబూ అన్నట్టు నా వైపు తిరిగాయి తర్వాత నవ్వు ముఖంతో

"ఇందాకటి నుండీ నిన్ను చూడాలని మేము ఎదురు చూస్తుంటే ఇప్పుడే వచ్చేది మా సుగుణ యితే మరీను "చిన్నవదినేది'' అ టూ'' అంది

ఇంతలో కిరణ్ ఒక అమ్మాయిని తీసుకు వచ్చాడు ఆ అమ్మాయినిచూసి నేనే కళ్ళు తేలేశాను ప్రమీలే అనుకుంటే, ప్రమీలను తలదన్నేలా ఉందా అమ్మాయి నేనసలు కిరణ్ కళ్ళకి ఎలా

## జీవితవనంలో కొత్తగాలి

నచ్చాను

"ఇదిగో మీ వదిన చూడవే సుగుణా ఎలా ఉంది'' అన్నాడతను ఆ అమ్మాయిని లాక్కు వచ్చి ఇద్దరం ఒకరినొకరం చూచుకున్నాము

నాచేయి పుచ్చుకుని "నీకోసం ఎప్పటినుంచి చూస్తున్నానో తెలుసా మా మొద్దన్నయ్య ప్రేమలో పడ్డాడంటే ఆ అమ్మాయిలో ఏదో ప్రత్యేకత తప్పకుండా ఉండి ఉంటుంది అని అమ్మతో పందెం వేశాను'' అంది చనువుగా

"నీకే ప్రత్యేకత కనిపించింది'' కుసుమ మాటల్లో హేళన తొంగి చూసింది కిరణ్ తల్లి నవ్వుతూ "చెప్పవే సుగుణా'' అంది

నా మొహం పాలిపోయింది కిరణ్ నవ్వుతూ చూసి నోటిమీద వేలుంచుకుని భయపడవద్దు అన్నట్టు ఉరిమి చూశాడు

సుగుణ స్నేహపూరితమైన మాటలు నన్ను సేదదీర్చాయి "అదేమిటి వదినా మా ప్రమీలకి ఓ పట్టాన ఎవ్వరూ నచ్చరు ఈ అమ్మాయి ప్రాణస్నేహితురాలంటే ఈ అమ్మాయిలో ఏ ప్రత్యేకతా లేకుండా ఎలా ఉంటుంది'' అంది

'మీ అన్నయ్య గురించి చెప్పు'' కుసుమ వ్యంగ్యంగా అంది

సుగుణ నవ్వుతూ అంది "నువ్వా అమ్మా! ఎంత చక్కని అప్సరసలను తెచ్చినా అన్నయ్య అసలు కన్నెత్తి చూశాడా నువ్వు చెప్పమ్మా రాజేంద్ర అన్నయ్యకన్నా, కిరణ్ అన్నయ్యకే కాస్త ముందాలోచన అంటావుకదా కిరణ్ అన్నయ్యకి ఈ అమ్మాయి నచ్చిందంటే ఏ ఆకర్షణలేకుండా ఎలా ఉంటుంది మా చిన్నన్నయ్య సెలక్షన్ ఎప్పుడూ తప్పుగా ఉండదు మా అన్నయ్యకి శరీర సౌందర్యం కన్నా, మన సౌందర్యం అంటే ఇష్టం అని మన కందరికీ తెలుసుగా'' అంది

నేను సంభ్రమంగా చూశాను సుగుణ చేతిని ఆప్యాయంగా నొక్కాను కిరణ్ నవ్వుతూ "మా సుగుణకి నచ్చాక ఇంక రెండో మాటే లేదు రారా! అతిథులందరూ వచ్చేస్తుంటారు మనం స్వాగతం చెబుదాం'' అంటూ నా చెయ్యి పట్టుకుని లాక్కెళ్ళాడు ఆరోజు పెళ్ళికి వచ్చినవారి నోళ్ళల్లో

నాపేరు బాగా నానిపోయింది అమ్మ కోడల్లాగే కిరణ్ నన్ను తయారు చేశాడేమో అనిపించింది ఆ అరగంటలో ప్రమీల పెళ్ళి జరిగిపోయింది కిరణ్ తాళికట్టే సమయంలో, తలంబ్రాలుపోసే సమయంలో నన్ను కేకేసి మరీ చూపించాడు ఆ రెండు కిరణ్ కళ్ళల్లో మెరుపులు నాకు ముందు జీవితంలో ఆనందపు వెలుగుల్లా తోచాయి

రాధమ్మగారు నాకు చీర జాకెట్టు, నాచెల్లెళ్ళకి జాకెట్టు ముక్కలు పెట్టింది నేను వారిస్తుంటే,

"నువ్వు మా ఇంటికి కాబోయే కోడలవు సంధ్యా అప్పుడే అత్తగారి మాటలకి ఎదురు చెప్తున్నావే'' అని నవ్వుతూ బెదిరించింది

ప్రమీల భర్తకి డార్జిలింగ్‌లో ఉద్యోగం రావటంతో ప్రమీల భర్తతో వెళ్ళిపోయింది నేను అమ్మతో నా పెళ్ళి విషయం ఎలా చెప్పాలా మళ్ళీ అని తన్నుకులాడుతున్నాను

ఆరోజు

శశి భోజనానికి రమ్మంది నేను తర్వాత తింటానన్నాను ఒకగంట తర్వాత ఉష వచ్చింది నేను వెళ్ళి కూర్చున్నాను నా అంచనా తప్పలేదు అమ్మ నాకోసం కనిపెట్టుకుని ఉంది

"రా! పొద్దుపోయింది'' అంది

నేను భోజనానికి కూర్చున్నాను ఎలా చెప్పాలో తోచటంలేదు ప్రపంచంలో ఏ ఆడపిల్లా నేను పెళ్ళి చేసుకుంటానమ్మా అని నోరుతెరచి ఎందుకు చెప్పలేదో అప్పటికి బోధపడింది నా మొద్దుబుర్రకి అన్నంతింటూ మధ్యలో -

"అమ్మా నేను నేను కూడా'' అని తడబడ్డాను

అమ్మ తలెత్తి "ఏమిటి కూ కూ అంటున్నావు'' అంది

నేను చప్పున తల వాల్చుకుని "కూ కూర వెయ్యమ్మా'' అన్నాను

"నిద్ర వస్తోందా సంధ్యా కంచంలో వేసిన కూర వేసినట్టే ఉంది మళ్ళీ కూర అంటావేం'' అంది ఆ కళ్ళల్లో, మాటల్లో లీలగా ఏదో అనుమానం కదిలింది

నేను"చూడలేదు'' అనేసి కూర కలుపుకుంటూ

# నిధానంగా ఐదు నిమిషాలు ఆలోచించండి

నా కుమారుడు యేమవుతాడు? నా కుమార్తె భవిష్యత్తు యేమవుతుంది? వారి భవిష్యత్తునకు సంబంధించిన ప్రతి పథకం డబ్బుతో కూడినపని పెద్ద పెద్ద మొత్తాల్లో డబ్బు కావాల్సి వుంటుంది!

మా మూడు లాభాల - యేక పథకంక్రింద 5 యేండ్ల కాలం మాత్రమే డబ్బు పొదుపు చేశారంటే, మీరు మీ బిడ్డల ఉన్నత విద్యలకు తగిన యేర్పాటు చేయగలరు మరియు వారు తమ జీవితాన్ని చక్కగా ప్రారంభించుటకు కూడా సహాయపడగలరు.

## మూడు-అంచెల పథకం

### 1 వ చర్య

### క్యుములేటివ్ డిపాజిట్

మీ బిడ్డ మొదటి పుట్టినదినమున వాని పేరుమీద ప్రతినెలా రు 100/- పొదుపు వేయునట్లు 60 నెలల కాలం సిండికేట్ బ్యాంక్‌నందు క్యుములేటివ్ డిపాజిట్ ప్రారంభించండి మీ బిడ్డకు ఆరు యేండ్లు వయస్సు వచ్చునప్పటికి యీ క్యుములేటివ్ డిపాజిట్ రు 7791/-కి పెరిగి వుంటుంది

### 2 వ చర్య

### ప్రగతి రొఖ్ఖపు సర్టిఫికేట్

పై సొమ్మునుండి రు 7440/- లను సిండికేట్ బ్యాంక్ ప్రగతి రొఖ్ఖపు సర్టిఫికేట్ క్రింద 120 నెలల కాలమునకు మీ బిడ్డ పేరుమీద తిరిగి పెట్టుబడి పెట్టండి మీ కుమారునికి/కుమార్తెకు 16 యేండ్ల వయస్సు వచ్చునప్పటికి యీ సర్టిఫికేట్ విలువ రు 20,000 కాగలదు

### 3 వ చర్య

### సోషల్ సెక్యూరిటీ డిపాజిట్

ఈ రు 20,000 సొమ్మును మీరు మరొకమారు సోషల్ సెక్యూరిటీ డిపాజిట్ క్రింద సిండికేట్ బ్యాంక్‌నందు 60 నెలల కాలం పెట్టుబడి పెట్టవచ్చు ప్రతినెల వడ్డీ రాబడి క్రింద, మీ బిడ్డలకు రు 165/- వారి స్వంత ఖర్చులకు వాడుకొనుటకై వస్తూంటుంది వారికి 21 యేండ్ల వయస్సు రాగానే తమ జీవితాన్ని వారు చక్కగా ప్రారంభించుటకు వీలుగా రు 20,000 సొమ్ము కూడా సిద్ధంగా వుంటుంది







**క్యుములేటివ్ డిపాజిట్**

నెలకు రు 100/- వంతున చెల్లించునపుడు

| నిర్ణీత కాలం | చెల్లించిన మొత్తం | ఫలితపు విలువ |
|---|---|---|
| 12 నెలలు | రు 1200 | రు 1250-00 |
| 36 నెలలు | రు 3600 | రు 4208-00 |
| 48 నెలలు | రు 4800 | రు 5911-00 |
| 60 నెలలు | రు 6000 | రు 7791-00 |

**ప్రగతి రొఖ్ఖపు సర్టిఫికేట్**

| డిపాజిట్ మొత్తం | కాలం | ప్రగతి రొఖ్ఖపు సర్టిఫికేట్ విలువ |
|---|---|---|
| రు 372-00 | 120 నెలలు | రు 1,000 |
| రు 7440-00 | 120 నెలలు | రు 20,000 |
| రు 610-00 | 60 నెలలు | రు 1,000 |
| రు 6100-00 | 60 నెలలు | రు 10,000 |

**సోషల్ సెక్యూరిటీ డిపాజిట్**

| డిపాజిట్ మొత్తం | కాలం | ప్రతినెల రాబడి |
|---|---|---|
| రు 5,000 | 60 నెలలు | రు 41 32 |
| రు 10,000 | 60 నెలలు | రు 82 64 |
| రు 20,000 | 60 నెలలు | రు 165 28 |

మీరు యే నెలకు ఆ నెల పొదుపు చేసే వారైతే మీకు యీ మూడు అంచెల పథకం లాభకరమైంది మీరు పెద్ద మొత్తాలలో పొదుపు చేసేవారైతే మీరు 2 వ పద్ధతిగాని 3 వ పద్ధతిగాని యెన్నుకొని విదేశాలకు వెళ్ళాలని, స్వంత బండి వుండాలని, స్వంత యిల్లు వుండాలని మీకు చిరకాలంగా వున్న కోర్కెలను తీర్చుకోవచ్చు

**ఇది నిజంగా తెలివైన పద్ధతిగదూ?**

5 యేండ్ల కాలం చేయు పొదుపు మీ బిడ్డల భవిష్యత్తుకు అనుకూలంగా యెంతో సహాయం చేస్తుంది



**సిండికేట్ బ్యాంక్**

ప్రజల క్షేమాన్ని కోరు బ్యాంక్

maa SB 180







ఓరి భగవంతుడా! ఎలా చెప్పాలి తండ్రీ అనుకుంటూ మళ్ళీ "అమ్మా" అన్నాను నెమ్మదిగ

అమ్మ తినటం ఆపి "ఏమిటే" అంది

"అమ్మా నేను పె పె" తలెత్తి ఆగిపోయాను నేను అనాలనుకున్నమాట అనలేకపోయాను

"ఏమిటే సంధ్యా! ఆ నసుగుడు" అమ్మ అసహనంగా అంది

"ఏం లేదమ్మా! కూర బాగాలేదు పెరుగు వెయ్యి" నోటికి వచ్చింది అనేశాను

"ఏమిటే నీకు వంకాయ కూర బాగాలేదా? ఎప్పుడూ కావాలని వండించుకునేదానివి" అమ్మ తెల్లబోయిన దానిలా అంది

"ఏ ఏమో! పెరుగు వెయ్యి" అన్నాను

"పాలు విరిగిపోయాయని సాయంత్రమే చెప్పాను కదమ్మా పెరుగు ఎక్కడిది" అమ్మ బాధగా అంది నేను ఏదీ సామాన్యంగా నోరు తెరిచి అడగను అని అమ్మకు తెలుసు ఆ ఖారే రెండు ముద్దలు మింగి నా పిరికితనానికి నన్ను నేనే తిట్టుకుంటూ చేతులు కడుక్కునివచ్చి పడుకున్నాను

నాకు చాలా దిగులుగా ఉంది అమ్మతో నేను చెప్పలేను నా చేతకావటంలేదు అసలు అమ్మ

# జీవితవనంలో కొత్త గాలి

ఉద్దేశ్యం ఏమిటి నేను పెళ్ళి చేసుకుంటే ఈ కుటుంబానికి సహాయం చేయనని భయపడుతోందా అమ్మకి ఎలా నచ్చచెప్పాలి ఆ ఉద్యోగమేదో తొందరగా వస్తే బాగుండును శశికి ఉద్యోగం వస్తే నేను ఒడ్డున పడ్డట్టే

గోడమీద 'జీవితవనం' లైటు కాంతిలో వింతగా ఉంది నా గుండెల్లో చిరుగంటలు మ్రోగుతున్నట్లుగా ఉంది జీవితంలో ఎటువంటి సరదాలు, ఆనందాలు నేను కోరుకోలేదు కాని చిత్రంగా కిరణ్ పరిచయంతో నా జీవితమే ఒక మలుపు తిరిగింది ఇంతకాలం బావిలోని కప్పలా ఉండిపోయాను బయట ఉండే ఈ విశాల ప్రపంచంలోని సుఖాలు, సరదాలు, ఆనందాలు కూడా మనిషికి ఎంత ముఖ్యమో వాటికోసం ప్రతి వ్యక్తి ఎందుకు అంతగా పాకులాడతాడో తెలిసివచ్చింది

కిరణ్ నా కోసం సృష్టించిన ఆ అద్భుతమైన జీవితవనంలోకి వెళ్ళిపోవాలని, ఆ ఆనందాన్ని రుచి చూడాలని నేను ఆరాటపడిపోతున్నాను నేను అసహనంగా దిండు కవరులో దాచిన కిరణ్ ఫోటో తీసి అరచేతిలో పెట్టుకుని దిండుమీద తల ఆనించుకుని తదేకంగా చూడసాగాను

## 19

కిరణ్ మెడ్రాస్ వెళ్ళాడు ఆరోజే ప్రమీల దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది డార్జిలింగ్‌లో తన కొత్త కాపురం గురించి వ్రాస్తూ చివర "సంధ్యా! నువ్వు గృహిణివి ఎప్పుడవుతావో, కిరణ్ అన్నయ్యతో డార్జిలింగ్‌కి హనీమూన్ ట్రిప్‌లో ఎప్పుడు వస్తావో అని ఎదురు చూస్తున్నాను నా సంధ్యను పెళ్ళి కూతురిగా చూడాలని ఎంతగా తహతహలాడుతున్నానో నీకెలా చెప్పటం" అని వ్రాసింది మర్నాడు ఆదివారం కావటంతో ఇంటి దగ్గరే ఉన్నాను ఒకప్రక్క ప్రమీల ఉత్తరం నన్ను హెచ్చరిస్తోంది అమ్మతో ఎలా చెప్పాలో అర్థం కావటంలేదు శశి అప్లై చేసిన వేటిల్లో ఉద్యోగం కాదుగదా, కనీసం ఇంటర్వ్యూ కూడా రలేదు మనకున్న క్వాలిఫికేషన్స్ కన్నా బలమైన ఆయుధం రికమండేషన్ అది శశికిలేదు కిరణ్ ట్రై చేస్తూనే ఉన్నాడు అతనికి లాంటివి అసలు ఇష్టం ఉండదట 'కేవలం మన జీవితం కోసం సంధ్యా ఇంకో ఇంటిదీపం నిలబెట్టటానికి నాకు తెలిసిన వాళ్ళని అడిగాను' అని చెప్పాడు అది ఎప్పుడు వస్తుందో మరి

అన్యమనస్కంగా తిరుగుతూ ముందుగదిలోకి వచ్చాను ఉష సీరియస్‌గా కూర్చుని పక్కఇంటి వాళ్ళని బ్రతిమాలి తెచ్చిన నవల చదువుతోంది ఫల్గుణ ఏదో రాసుకుంటున్నాడు నేను వంటింటిలోకి వెళ్ళాను మినప పచ్చడి నూరుతోంది అమ్మ ఏదో పనిలోఉంది శశి కనిపించలేదు

"అమ్మా శశేది"

"లేదు"

"అదే ఎక్కడికి వెళ్ళింది"

"వాళ్ళ ఫ్రెండ్‌కి ఎవరికో ఒంట్లో బాగుండలేదట చూడటానికి వెళ్ళింది" అంది అమ్మ

"దీని ఫ్రెండ్స్‌కి రోజూ ఏదో ఒక రోగం వస్తూనే ఉంటుందా" నేను కోపంగా అన్నాను ఈ మధ్య శశి వరుస చూస్తూనే ఉన్నాను ఎక్కడికి వెళ్ళావంటే నా ఫ్రెండ్‌కి హెల్త్ బాగాలేదక్కా అంటోంది

"బాగుందే, దానికి అదిమాత్రం ఏంచేస్తుంది" అన్నది అమ్మ

"ఎవరా దీర్ఘకాల రోగి" అని చిరాగ్గా అంటూ రాబోయాను

"ఎవరో నీరజో ఏదో అనుకుంటాను నీరజ అన్నట్టు గుర్తు"

నేను అమ్మ మాటలను కొరడాదెబ్బ తిన్న దానిలా ఆగిపోయాను గిరుక్కున తిరిగి "నీరజా" అన్నాను

"అవునే! ఆ మధ్య రెండు మూడు సార్లు కూడా వచ్చింది"

"ఆ అమ్మాయికి పెళ్ళయిపోయిందనుకుంటాను" అనుమానంగా అన్నాను

"అవును అయిపోయింది కదా మరి ఆ నీరజేవరోలే" అమ్మ తాపీగా తన పనులు చేసుకుంటోంది

నేను ఇవతలకి వచ్చేశాను శశి అతన్ని మర్చిపోలేదు నీరజ పెళ్ళికి అని నాతో చెప్పి ప్రజెంటేషన్ కొనాలి అని డబ్బుకూడా తీసుకుంది

పదకొండు, పన్నెండు అయింది అమ్మ పిలి

ఇటీవల వరంగల్‌లో 'చైతన్య సాహితి' నిర్వహించిన నాటక సదస్సులో ప్రసంగిస్తున్న ప్రముఖ నాటక రచయిత డా పి వి రమణ, అధ్యక్షత వహించిన జిల్లా పౌరసరఫరాల అధికారి శ్రీ శాస్త్రిగార్లని చిత్రంలో చూడవచ్చు







సూటింగులు
పాలియెస్టర్ బ్లెండ్
మరియు కాటన్

మంచి అభిరుచి తగిన ధరలు.

# ఎన్‌టైక్స్

నేషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషన్
(తమిళనాడు మరియు పాండిచేరి) లి
భారత సర్కారువు ఒక ఉద్యోగ సంస్థ
10.64 సోమసుందరం మిల్స్ రోడ్, కోయమత్తూరు 64 009

MCA NTC 73-TEL

ఇండెంటింగ్ ఏజెంట్లు ● (ఆంధ్రప్రదేశ్-ఉత్తరం) బాలాజీ టెక్స్‌టైల్ ఏజెన్సీస్ 3-4-394, టుబాకో బజార్ సికింద్రాబాద్-3 ●(ఆంధ్రప్రదేశ్-కోస్తల్) సంగం టెక్స్‌టైల్ ఏజెన్సీస్, 230, మొదటి అంతస్తు డి బి రోడ్ ఆర్ ఎస్ పురం కోయంబత్తూరు-2 ఎన్ టి సి దుస్తులు అన్ని ఎన్ టి సి షోరూములలోను లభ్యమగును

## స్టాక్ - కమ్ - సేల్ డిపో

**ఆర్. పి. డిస్ట్రిబ్యూటర్సు, 3-4-394, టుబాకో బజారు, సికింద్రాబాద్ ఆంధ్రప్రదేశ్**

ంతో ఆలోచనలో ఉన్న నేను ఉలిక్కిపడి లేచి కుర్చీ'కి కూర్చున్నాను

"శశేది" అన్నాను సీరియస్‌గా

"రాలేదు" అమ్మ సమాధానం

"ఫల్గుణా! ఆ నీరజ ఇల్లెక్కడో నీకు తెలుసననుకుంటాను" వాడివైపు సాభిప్రాయంగా చూశాను

"ఊ ఆయితే! విశాఖపట్నం వెళ్ళాల్సిందే" అంది ఉష నవ్వి

"విశాఖపట్నమా" నేను ఆశ్చర్యంగా అన్నాను

"అవునక్కా! ఆ నీరజ నాలుగు రోజులనాడే అత్తవారింటికి వెడుతున్నాను అని ఇంటికొచ్చి చెప్పి మరీ వెళ్ళింది" అన్నది ఉష

నా మనసులో ఎన్నెన్నో ఆలోచనలు సుడి గుండాల్లా తిరుగు తున్నాయి నాకు ఉదయంనుంచి కుడికన్ను అదురుతోంది నా మనసు ఎందుకో చాలా వ్యాకులంగా ఉంది ఆవ్యాకులతకి కారణం పావుగంట తర్వాత తెలిసింది

నేను చేయి కడుక్కుని లేచి రాబోతుండగా మీనా పరిగెత్తుకొచ్చి "అక్కా" అని ఏదో అన బోయింది దాని మొహంలో కంగారు ఉంది

"ఏమిటి! ఏమయింది" నేను కంగారుగా అన్నాను

"అక్కా శశక్క మరి మ రి" మీనా ఒణుకుతోంది

"ఏమయిందే శశికి" నేను మీనా భుజాలు పట్టి ముందు గదిలోకివచ్చి సర్పద్రష్టలా ఆగి పోయాను నాకు ఆకాశం ఒక్కసారి కూలి నా నెత్తి మీద పడ్డట్టుగా ఉంది నా కళ్ళు చీకట్లు కమ్ము తున్నాయి నా కంటిముందు కనబడుతున్న దృశ్యం మసక మసగ్గా ఉంది నేను కాసేపటికి నన్ను నేను నిలవరించుకుని చూశాను గుమ్మంలో శశి, ప్రకాష్ పసుపు బట్టలతో, మెళ్ళోపూల దండలతో భయం భయంగా నిలబడి ఉన్నారు తెలియకుండానే నా పాదాలు ముందుకు నడుస్తూ మళ్ళీ ఆగిపోయాయి

నేను కల కాదుకదా అన్నట్టు వెనక్కి తిరిగి చూశాను అప్పటికే అందరూ ముందు గదిలో చేరిపోయారు అమ్మ నిశ్చేష్టురాలిలా నిలబడి ఉంది శశి, ప్రకాష్ కదిలివెళ్ళి అమ్మ పాదాలకి నమస్క రించారు నేను మతిపోయినదానిలా చూస్తున్నాను శశి లేచినిలబడింది అమ్మ ఇంకా అయోమయంగా అలాగే చూస్తోంది అది చప్పునకదిలి నా ముందుకు వచ్చింది

పెళ్ళి అలంకరణలో బొమ్మలా ఉంది శశి కళ్ళల్లో భయం, సిగ్గు, అంతులేని తెగింపు మిళితమై ఉన్నాయి శశి చప్పున వంగి న కాళ్ళని పట్టుకుంది ప్రకాష్ కూడా వంగాడు

"అక్కా! నేను గత్యంతర లేని పరిస్థితిలో ఈ పెళ్ళి చేసుకున్నానక్కా నీ కిచ్చినమాట నిలబెట్టుకోలేకపోయాను నువ్వు నా జీవితాన్ని తీర్చి దిద్దిన దేవతవి నీ చల్లటి ఆశీర్వాదం కావాలక్కా నేను త్వరపడి ఉంటే నన్ను క్షమించక్కా" శశి కళ్ళనుండి కన్నీళ్ళు జలజలా రాలాయి

నేను శశిని లేవదీయటం కూడా మర్చిపోయాను

## జీవితవనంలో కొత్త గాలి

ఈ చేదు వాస్తవాన్ని ఇంకా నిజమేనా అన్నట్టు భ్రాంతిగా చూస్తున్నాను. శశి లేచి నా చేతులు పట్టుకుని "నన్ను క్షమించక్కా" అంది మరో క్షణం నా గుండెల్లో తలదాచుకుని బావురుమంది నా చేతులు అప్రయత్నంగా శశి చుట్టూ పడ్డాయి

"ప్లీజ్ అక్కా! నువ్వు నన్ను అర్థంచేసుకో నువ్వు నన్నేమైనా అన్నావంటే నేను. నేను బ్రతకలేను. అమ్మ ఒప్పుకోదని భయంవేసి నేను దొంగతనంగా పెళ్ళిచేసుకున్నాను" శశి వెక్కిళ్ళమధ్య అంది

నేను నిశ్చేష్టురాలిలా ఇంకా ఆ షాక్‌నుండి తేరుకోలేనట్టుగా అలాగే ఉండిపోయాను అది ముందుగానే నా ముందరకాళ్ళకు బంధాలు వేస్తోంది శశి ఇంకా ఏడుస్తూనే అంటోంది—

"నేను ఇంత తొందర పడటానికి కారణం ప్రకాష్ నాకు దక్కడేమో అని భయంవేసిందక్కా వాళ్ళ అమ్మ అతనికి సంబంధం కూడా చూసింది. అందుకని భయపడి తెగించి ఈ పెళ్ళి చేసు కున్నానక్కా"

నేను నిర్జీవంగా ప్రకాష్‌వైపు చూశాను అతను చప్పున రెండు చేతులూ జోడించి –

"మమ్మల్ని క్షమించండి వదినగారు. గత్యం తరంలేక ఎవ్వరికీ తెలియకుండా చేసుకోవాల్సివచ్చింది నేను ముందు మీకు చెబుదామనే అనుకున్నాను శశి అసలు ఒప్పుకోలేదు మా అమ్మ నాకు పదిహేనువేలు కట్నం తీసుకుని పెళ్ళి చేస్తానని సంబంధం చూసి వచ్చింది దాంతో నాకు భయంవేసి ఉద్యోగం రాక పోయినా శశిని పెళ్ళి చేసుకున్నాను మా అమ్మంటే

## మన చేతకాని పని

స్విచ్ చేసిన పంఖాలాగా
జీవితం తిరుగుతూంది
స్విచ్ చేసిన బల్బులాగా
జీవితం మలుగుతూంది.
ఎందుకు తిరుగుతుందో
తెలియదు పంఖాకు
ఎందుకు మలుగుతుందో
తెలియదు బల్బుకు.
అవసరమొచ్చి నువ్వో, నేనో
స్విచ్ చేస్తాం
పంఖా తిరుగుతుంది
అవసరం తీరి నేనో, నువ్వో
స్విచ్ చేస్తాం
బల్బు మలుగుతుంది.
ఆ పంఖా తిరగడమూ
ఈ బల్బు మలగడమూ
మన చేతిలోని పని.
కాని — ఈ జీవితం
తిరగడమూ, మలగడమూ
మన చేతకాని పని

— జి. వెంకటేశ్వర్లు

నాకు చాలా భయం అలా చెప్పనందుకు నన్ను క్షమించండి" అన్నాడు

అమ్మ పాలిపోయిన మొహంతో "ఇంట్లోవాళ్ళకి ఇష్టం లేకుండా ఎలా చేసుకున్నావు బాబూ! మరి కులం గోత్రం చూడకుండానే" అంది అమ్మ నిలువెల్లా ఒణికిపోతోంది

అతను నెమ్మదిగా అన్నాడు "క్షమించండి ఈ రోజుల్లో కులాంతర వివాహాలే చేసుకుంటున్నారు మాది శాఖాంతర వివాహం మాది మీ శాఖకాదు" అన్నాడు

అమ్మ నోటమాట రానిదానిలా చూసింది నేను శశిని ఒదిలించుకుని తడబడుతున్న అడుగులతో గదిలోకి వెళ్ళిపోయాను నా చేతులు వెనకనుంచి తలుపులు దభాల్న మూసివేసినాయి కొద్దిసేపు తలుపుల్ని ఆనుకుని కళ్ళుమూసుకుని ఉండిపోయాను

ఇది కలకాదు నచ్చినిజం శశి పెళ్ళి చేసుకుంది ఉద్యోగంచేసి ఇంటికి ఆధారంగా నిలబడతానన్న శశి, ఆ విషయమే మర్చిపోయి పెళ్ళి చేసుకుంది అదీ ఉద్యోగంలేని వ్యక్తిని కనీసం పెళ్ళి చేసుకునే ముందు నేనవేదాన్ని ఉన్నాననికూడా మర్చిపోయింది నా ప్రణయ వృత్తాంతం ఇంట్లో అందరికీ తెలిసిందే అయినా శశి తన వాగ్దానాన్ని నిలబెట్టు కోకుండానే తను మూడు ముళ్ళూ వేయించుకుంది

గోత్రాలు కలవ్వు సంధ్యా అని నా పెళ్ళికి అభ్యంతరం పెట్టిన అమ్మ ఇప్పుడు శశి శాఖాంతర వివాహం చేసుకుంటే ఏం చేస్తుంది నా అంతరాత్మ నన్ను చూసి వికగబడి నవ్వుతోంది నన్ను నేను కంట్రోలు చేసుకోడానికి నా ఒంట్లో ఉన్న సర్వ శక్తుల్ని కూడదీసుకుంటున్నాను

"ఉషా హారతి తీసుకురా" అమ్మగొంతు విని పించింది నాచెవులను నేను నమ్మలేక పోయాను ఉక్రోషం తన్నుకు వస్తోంది మై గాడ్ అమ్మ శశి వివాహానికి అంగీకరించినట్టు సూచనగా ఒక్క మాటయినా అనకుండా హారతి తెమ్మంటోంది నేను తలుపు తెరుచుకుని బయటకి వెడదాం అను కున్నాను అంతలోనే విరమించుకుని పళ్ళు బిగబట్టి అలాగే ఉండి పోయాను

"మేము ఇకా ఇంటికి వెళ్ళలేదండి మళ్ళీ రేపు వస్తాము" ప్రకాష్ గొంతు వినబడుతోంది

"భోజనం చెయ్యనా శశి"

"ఊహూ, అక్కా! తలుపు తియ్యక్కా" శశి తలుపు తట్టింది

నేను అసలు పలకలేదు

"ప్లీజ్! అక్కా అత్తగారింటికి వెళ్ళేముందు నీ చెల్లెల్ని ఒక్కసారి పలకరించక్కా" శశి రుద్ధ స్వరంతో అంది

నేను ఆ అనలేదు, 'ఉ' అనలేదు

"వెళ్ళొస్తానక్కా" శశి వెళ్ళిపోయిన చప్పుడు

నేను కిటికీలోంచి చూశాను శశి ప్రకాష్ టాక్సీలో కూర్చున్నారు ఇంట్లో అందరూ గేటులో నిలబడి ఉన్నారు టాక్సీ వెళ్ళిపోయింది అమ్మ కళ్ళు తుడుచుకుంటూ ఇంట్లోకి వస్తోంది నేను చప్పునవచ్చి మంచంమీద పడుకున్నాను

కిరణ్ కూడా ఊళ్ళోలేదు నేను మతిపోయిన దానిలా ఉన్నాను శశిని వాళ్ళ అత్తగారు ఆదరి స్తుందో లేదో ఏమో నా గుండెల్లో క్షణం క్షణం,

# ఈ క్రిస్మస్ పండుగకో ప్రత్యేకత నివ్వండి ఆప్కో వస్త్రాల్లో




పండుగ వేడుకల్లో
పాలుపంచుకోండి
ఆప్కోవారి సున్నితమైన
సిల్కుల్లో, అపురూపమైన
నూలు, పాలియెస్టర్లలో
ఈ పండుగకు రంగులు
పూయండి పరిమళం
వెదజల్లండి - ఆప్కో
సోయగాల్లో కాంతులీనండి

**అందరికీ ఆప్కోవారి**
**క్రిస్మస్ శుభాకాంక్షలు.**

KIRON/APCO/8111

APSHWCSL

ఆప్కో
చేనేతలు

నాకు చెప్పకుండా, నా పెళ్ళి కాకుండా, శశి పెళ్ళి చేసుకుందని ముల్లులా కెలుకుతూనే ఉంది

ఆ రాత్రి –

నేనసలు భోజనం చేయలేదు అమ్మ నా గది లోకి వచ్చింది మంచంమీద కూర్చుని "సంధ్యా" అంది చిన్నగా

నేను ఉలిక్కిపడి లేచి కూర్చుని "ఏమిటి" అన్నాను

అమ్మ ఏడుస్తోంది "నాకు భయంవేస్తోంది సంధ్యా శశిని వాళ్ళ అత్తగారు రానిచ్చిందో లేదో పైగా చీరలేదు, సారెలేదు అని మాటిపోటి మాటలనకుండా ఊరుకుంటుందా" అంటోంది

"నేనేం చేయగలనమ్మా" నేను నిస్సహాయంగా అన్నాను

"నువ్వు నువ్వు రేపు వెళ్ళి వాళ్ళకి క్షమాపణ చెప్పు"

"క్షమాపణా నేనా" విభ్రాంతిగా అన్నాను

"తప్పేంలేదు సంధ్యా! మన శశి కోసం అలా చేయటం తప్పకాదు అలా చెయ్యకపోతే వాళ్ళకి కోపంవచ్చే ప్రమాదముంది"

నేను నిర్ఘాంతపోతూ "మధ్య నేనేం తప్పు చేశానని క్షమాపణ చెప్పాలమ్మా" అన్నాను నాలో రక్తం సలసలా మరుగుతోంది

అమ్మ తలెత్తిచూసి "ఆడపిల్లగలవాళ్ళం చిన్నపిల్లలు మన్నించండి అని నీకు తోచింది చెప్పు" అంది ఆవిడ మొహం అతి దీనంగా ఉంది

## జీవితవనంలో కొత్త గాలి

"ఊహూ వీల్లేదు నాకు అవసరం లేదు" విసురుగా అన్నాను

"సంధ్యా" అమ్మ అదిరిపడుతూ చూసింది

"అవును ఏం పెళ్ళి చేసుకునేటప్పుడు వెనకా ముందూ ఆలోచించుకోవద్దా నేను ఇలాగే చేశానా కిరణ్ ఇలాగే చేశాడా" ఆగ్రహంగా అన్నాను

అమ్మ హఠాత్తుగా ఏడవసాగింది



"భగవంతుడా! నాకు ఎటువంటి బిడ్డలుపుట్టారురా తండ్రీ నాకు చావన్నా రాదేమిటి"

ఈ హఠాత్పరిణామానికి నేను దిమ్మెర పోయాను "అమ్మా" ఆక్రోశంగా అన్నాను ఈవిడసలు మా అమ్మేనా అనిపించిందా క్షణంలో

ఇంతలో ఫల్గుణ రివ్వున వచ్చాడు

"అమ్మా ప్రకాష్ కనిపించాడమ్మా" అన్నాడు వగరుస్తూ

"ప్రకాషా!" అమ్మ ఆశ్చర్యంగా కళ్ళు చిదుముకుంటూ అంది

"అవునమ్మా! వాళ్ళ అమ్మ కాసేపు ఏడ్చిందట శశిని ఇంట్లోకి తీసుకువెళ్ళిందట కాసేపు కట్నాలు, కానుకలూలేవు చీరాసారే లేదు అని సణిగిందట అంతే" ఫల్గుణ ఉత్సాహంగా చెప్తున్నాడు

అమ్మ విప్పారిన మొహంతో "ఇంకా ఏమన్నాడురా ఇలారా చెబుదుగాని" అంటూ ఫల్గుణని తీసుకుని బయటకి వెళ్ళిపోయింది

నేను అయోమయంగా చూస్తున్నాను వాళ్ళు వెళ్ళగానే దిండు కవరులో దాచిన ఫోటో తీశాను అందంగా, హుందాగా నవ్వుతూ ఉన్న ఆ ఫోటో 'సంధ్యా' అని పిలుస్తున్నట్టే ఉంది "కిరణ్ నాకేం చెయ్యాలో తోచటంలేదు నువ్వు త్వరగారా" అని గొణుక్కోసాగాను ఆ రాత్రి నేను నిద్రపోలేదు

(ఇంకా వుంది)

# వివా
# పగలూ రాత్రీ చేవనిచ్చే పానీయం!

గతిశీలమైన నేటి ప్రపంచంలోని వత్తిడికి తట్టుకోవాలంటే
చేవనిచ్చే వివా మీ కెంతో అవసరం

**వివా రోజంతటికీ కావలసిన చేవను పెంపొందిస్తుంది!**

వివాలోని ఆధునికమైన మాత్రీకరణ మూలంగా, దీనిలో ఎక్కువ శక్తినిచ్చే 'మాల్ట్', 'టిష్యూ'ను పెంపొందించే ప్రోటీన్లూ ఉన్నాయి ఇవి పనికీ, ఆటకీ కావలసిన శరీర శక్తిని పెంపొందిస్తాయి

**వివా, ఖర్చయిన మీ శక్తిని భర్తీ చేస్తుంది రాత్రి పూట!**

పడుకోబోయే ముందు, వేడి వివా ఒక కప్పు తీసుకుంటే ఆది మీకు సరియైన పద్ధతిలో నిద్ర పట్టేలా చేస్తుంది మీరు ప్రొద్దున్న చలాకీగా, తాజాగా పుంజుకుని, నిద్ర లేచే దాకా పోషక శక్తిని సమకూరుస్తూనే ఉంటుంది!

వివా లేకుండా జీవితంలో యింత ఆనందం ఎక్కడుంటుంది గనక!

**వివా ఎక్కువ విలువ నిస్తుంది!**

ఒక్క బాటిల్ వివాని ఆరోగ్యాన్నిచ్చే మరే యితర పానీయంతోనైనా పోల్చి చూస్తే, యిది మరి ఎక్కువ కప్పుల పానీయాన్ని యిస్తుంది






**గొప్ప రుచి!**

**JiL** జగత్‌జీత్ ఇన్‌డస్ట్రీస్ లిమిటెడ్

ASP JIL-3 79 TEL R




### ఎన్. ఎస్. హైదరాబాదు

ఆంటీ, స్త్రీ జీవితానికి పెళ్ళితోనే పరిపూర్ణత చేకూరుతుందా? దినదినగండంలా గడిచే ఆ జీవితం కన్న కన్యగానే వుంటే ఏమవుతుంది? పెళ్ళి పేరుతో— స్త్రీకి బానిసత్వాన్ని చేకూర్చడం తప్పకనా?

★ మీ ఆలోచనా సరళీ చాలా అమాయికత్వాన్ని చాటుతోంది సుజాతా! అర్థంచేసుకుని భార్యని సాటిమనిషిగా చూడకల్గిన భర్త కనుక లభిస్తే— వైవాహిక జీవితం నిజంగా ఆడదానికి సంపూర్ణత కల్గిస్తుంది — అలాగే మగవాడికి కూడా పెళ్ళి చేసుకోకుండా వుండడం తప్పుకాదు అది ఎవరిష్టం వారిది పెళ్ళి చేసుకుతీరాలని ఎవరంటారు — కన్న వాళ్ళు అంటారు పెళ్ళికాని పిల్లలు - తల్లి తండ్రులమీదా, అన్నదమ్ములమీదా, చుట్టపక్కాల మీదా భారంగా వుండకుండా వుంటే - ఏ బాధాలేదు స్వయం ఉపాధికల్గి, చేతినిండా పనివుండి, ఎవరి మీదా ఆధారపడనవసరంలేని స్థితికి ఎదిగితే — ఏ ఆడదైనా — మగాడైనా పెళ్ళి చేసుకోక పోయినా ఫరవాలేదు చేసుకున్నా బాధలేదు

### కె జె ఎస్ కె కుప్పం

శాస్త్రాలు, పురాణాలు అంతా కల్పితాలు భూతప్రేతాలు ఒట్టి భ్రమఅంటారుగాని ఆంజనేయ దండకం పటిస్తే దెయ్యాలు ఎందుకు పారిపోతాయి?

★ ఎవరన్నారు పారిపోతాయని!! మీ మనస్సు— భయంనుంచి పక్కకి మళ్ళించడానికి ఏది పఠించినా ఫరవాలేదు రామ! రామ! అనడం యిష్టం లేకపోతే రావణ! రావణ అనండి కృష్ణ కృష్ణ అనుకోడం యిష్టం లేకపోతే జయమాలిని జయ మాలిని అనుకోండి!

### ఎస్ ఎన్. - నరసారావు పేట

కులమతాలపై మీ అభిప్రాయం ఏమిటి?

★ నాకెలాంటి అభిప్రాయాలు లేవు ఏం జట్లు అని అడగను, ఏంతింటారని అడుగుతాను

### ఎం ఎస్ ఆర్ బైపల్లి

మూడునాళ్ల ముచ్చటైన యీ జీవితంలో ఎందుకు ద్వేషాలు, ఆశలు చెప్పండి?

★ తరవాత బైముండదని!

### ఎస్. కె జి. - శృంగవరపుకోట

ప్రేమ అన్నది గుడ్డిది అంటారు కదా మన పవిత్ర భారతదేశంలో ఎన్నో ప్రేమలున్నాయి కదా ఏ ప్రేమ గుడ్డిది?

★ తెలిసి దిగితే ఏ ప్రేమా గుడ్డిదికాదు

### కృష్ణవేణి విజయవాడ

తమ రచనలద్వారా శాంతిని జ్ఞానాన్ని కల్గించాల్సిన రచయిత అయివుండి

★ చూడు సోదరీ, చేతులుకలిస్తే తప్పట్లు ఎవరిని అనీ ఏమిటి ప్రయోజనం? ఆత్మపరిశీలనకు తప్ప - యీ పోస్టు మార్టమ్‌లు ఎందుకూ పనికి రావు రచయితల నీతిబాహ్యత — అందరినీతి బాహ్యత లాంటిదే — అసహ్యించుకో తగ్గది ఉత్తరంరాస్తే చాలు బలహీనులు దాన్ని ప్రేమగానో ఆరాధనగానో తీసుకోడం - దాని పర్యవసానాలు — అందరికీ తెలిసినవే అందులో ఆడది రాసిందంటే ఇంకా బల హీనులు మరీ నూతిలో కప్పల్లాగా — ఆనందంతో — ఉబ్బిపోతారు! ఆడదానికి వుండే 'లెవెల్ హెడెడ్ నెస్' మగవాడికి వుండదు అందుకే ప్రకృతి ఆడదానిమీదే భారం పెట్టింది

### పురుషులకు మాత్రమే!

స్త్రీల వ్యాధులను ప్రత్యేకించి గైనకాలజీ పేరున ఒక ప్రత్యేక వైద్యశాఖను ఏర్పరచి నట్లు పురుషుల వ్యాధులను కూడా ప్రత్యేకించి మరో వైద్యశాఖను ఏర్పాటు చేయవలసిన సమయం ఆసన్నమవుతున్నదని పశ్చిమ జర్మనీ లోని మ్యూనిచ్ విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ కరిన్‌స్కార్ఫ్ తెలియచేశారు కొన్ని రకాల వ్యాధులు స్త్రీలలోకంటే పురుషులలోనే ఎక్కువగా కన్పిస్తున్నాయి పురుషులకు ప్రత్యేకించి వృద్ధాప్యంలో ఎక్కువ వైద్య సహాయం అవసరమవుతున్నది శబ్ద కాలుష్యం వలన చెముడు, ఇ ఎన్ టి వ్యాధులు, పనిలో ఒత్తిడివలన జీర్ణాశయ కేన్సర్ వంటి వ్యాధులు పురుషులలో ఎక్కువగా వుంటున్నాయి

### ప్రభాకర్ జనగామ

దేవుడు అందరినీ సమానంగా పుట్టిస్తాడని పెద్దలంటారు మరి — కొందరు వున్నవాళ్ళ కడుపునా, మరికొందరు లేనివాళ్ళ కడుపునా పుట్టడం ఏమిటి?

★ లేని కడుపైనా ఉన్న కడుపైనా—కడుపు తీపి ఒకటేనని — పెద్దల భావన.

కలకాలం నిలిచే చక్కని సాహిత్యం ఆవిర్భవించే తరుణం రాదా?

★ ఎందుకులేదు? యీ వర్తమానం భూత కాలం అయిపోతే యీ తులసి దళాలూ హిమ జ్వాలలూ మన ప్రబంధాలలాగా వుండి పోవంటారా?

### కె టి. ఆర్. - గాజులగుంట

ఒక పురుషుని పతనానికి కారణం స్త్రీ అంటాను మీరేమంటారు?

★ పతనానికి మీరుచెప్పుకునే అర్థాన్ని పట్టి వుంటుంది

నేటి యువకుల గురించి మీ అభిప్రాయం?

★ స్వేచ్ఛకి అర్థం చెప్పకోలేక, అటు కట్టడినీ యిటు స్వేచ్ఛనీ కూడా కించపరుస్తున్న— ఓ అమాయక వర్గం నేటి యువకులు ప్రేమ పేరిట వంచింపబడుతూ, సినిమాలపేరిట కలలు కంటూ, వాస్తవం పేరిట — కల్లోల పడిపోతూ — దారితోచక దిక్కులు చూస్తున్నారు నేటియువకులు చదువు వీరికి డిగ్రీ యిస్తోంది కాని లోకజ్ఞానం యివ్వడంలేదు వారికబ్బిన లోకజ్ఞానం - సినిమాల నుండి, సాహిత్యంనుండి అదీ నేలవిడిచి సాము చేస్తోంది అందుకే — యీ గందరగోళం యువకులలో స్నేహితులని స్నేహితులనలేరు తెలిసిన వాళ్ళని తెలిసిన వాళ్ళని చెప్పలేరు అంతా అర్థంలేని దాపరికం

### జి బి కె - సికింద్రాబాద

ఇటీవల ఆకాశవాణి, ఆంధ్రపత్రికలు నా రచనలపై దృష్టి మళ్ళించాయి మిగిలిన పత్రికల వారికి కూడా మళ్ళాలంటే నేనేం చెయ్యాలి? కొంచెం సలహా యివ్వండి?

★ ఉప్పెనలా పొంగి ముంచెత్తే వచ్చే నదిలా ప్రవహిస్తూ ఆక్రమించుకోస్తూ వచ్చే రెడీమేడ్ కీర్తి ప్రతిష్ఠలకి మొదటి పద్ధతి. కలకాలం నిలిచే కొద్దిపాటి పేరుకైనా — రెండో పద్ధతి ఇక మీ ఓపిక

### గా. యం - ఎమ్మిగనూరు

కళలో ప్రధానాంశం ఏమిటి?

★ ఆత్మానందం

### కె ఎస్. ఎస్. ఆర్ - సుల్తానాబాద్

నన్ను ఒక అమ్మాయి ప్రేమిస్తోంది నాకూ ఆ అమ్మాయి అంటే యిష్టమే కాని నాకు పెళ్ళి నిశ్చయమైంది ఎలా?

★ ఏముంది! ఇష్టానికి నిన్ను, కట్నానికి ఆమెని చేసుకుంటాను ఇష్టమేనా? అని అడుగు తమ్ముడూ — సుల్తానాబాదంత చిన్నఊళ్ళో యింత పెద్దసమస్యా? పాపం! ★

## విశిష్టమైన వ్యక్తి యొక్క,
## విశిష్టమైన అభిరుచి...'ప్లెయిన్'షర్టింగ్ మాత్రమే.



MODEL : COURTESY AIR-INDIA

## అంటే పాలియెస్టర్ మరియు పాలియెస్టర్ బ్లెండ్
## మఫత్‌లాల్ షర్టింగ్!

ఈ వ్యక్తి తీరుగా, ఏరికోరుకునేలా రూపొందిన వ్యక్తి. అందుకే దాంబికంగా గాక, ప్రశాంతంగా ఠీవిని చిందించే వ్యక్తి. ఇలా ఓ ప్రత్యేకమైన వ్యక్తిత్వాన్ని తనంతటతానే సంతరించుకున్న వ్యక్తి.

మఫత్‌లాల్
షర్టింగ్



( గత సంచిక తరువాయి )


















[ఇంకా ఉంది]

# 20 శాతం అధిక శక్తి గల మోటార్ అమర్చినా
# 30 శాతం విద్యుత్ పొదుపు

# Moulinex

## MIXER CUM GRINDER

మౌలిమెక్స్ మిక్సర్ కమ్ గ్రైండర్
విశిష్ఠ లక్షణాల్ని పరిశీలించండి




రెండు స్టెయిన్‌లెస్ స్టీల్ జార్లు.
1) ఒకటి 1¼లీటర్లది పట్టుకోడానికి వీలుగా హాండిల్ అమర్చబడి వది
2) ఒక 500 గ్రాముల గ్రైండర్, దినుసుల పరిమళాల్ని, రుచుల్ని మిళితం కాకుండా ఉంచుతుంది





సౌకర్యం.
ప్రత్యేకమైన ఇంటర్‌లాక్ సిస్టమ్ అమర్చబడింది అంటే, మిక్సర్ పని చేసేటప్పుడు చేతితో పట్టుకోవలసిన అవసరం లేదు

రెండు విధాలుగా
ఉపయోగపడే బ్లేడ్లు.
అంటె తడి, పొడి పదార్థాల్ని తేలిగ్గా గ్రైండ్ చేసే ప్రత్యేక సదుపాయం





ప్రప్రథమంగా ప్రత్యేకమైన
కూలింగ్ సదుపాయం
ఇది మిక్సర్ వేడెక్కకుండా చల్లదనాన్ని సమకూర్చే కూలింగ్ విండో వల్ల మీ మౌలిమెక్స్ మన్నికను పెంపొందిస్తుంది

ఆంధ్ర ప్రాంతానికి డిస్ట్రిబ్యూటర్లు

**ఎలైట్ ఏజన్సీస్**  ఫోన్ **223148**

7, 8, 9, జగదీశ్ మార్కెట్,
ఆబిడ్స్, హైదరాబాద్ – 500 001

కృష్ణా, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరికి
సర్వీస్ సెంటర్ & సబ్ డిస్ట్రిబ్యూటర్లు :
**M/s సోలార్ ఎంటర్‌ప్రైజెస్,**
ప్రకాశం రోడ్డు : : విజయవాడ.

గుంటూరు మరియు ఒంగోలుకి
సర్వీస్ సెంటర్ & సబ్ డిస్ట్రిబ్యూటర్లు :
**M/s శివ కమర్షియల్ కార్పొరేషన్,**
స్టేషన్ రోడ్డు : : గుంటూరు. ఫోన్ : 20856

పెద్దకథ

# చిక్కని తెల్లటోపీ

కన్నబాబు

రిటైరయిన తర్వాత మూడునాలుగు మాసాల వరకూ గోపాలం పంతులు రెయిల్వే స్టేషను వేపు పోనేలేదు సరికదా అది తనకి సంబంధంలేని మరో ప్రపంచంలాగా భావించేవాడు. కాని మాటల మధ్యస్తంలో "ఈ పాటికి 'త్రీడౌను'కు లయిను క్లియరు అయ్యుంటుంద"నో 'ఫోరప్పుకి సిగ్నలు వాలుంటుంద"నో మాత్రం అంటూ వుండేవాడు.

పరామర్శలూ, రాకపోకలూ పల్చబడ్డాక గోడగడియారం ముళ్ళకి కీళ్ళనొప్పులు వచ్చాయేమో! గంటసేపటికి గాని పెద్దముల్లు పక్కనెంబరుకి చేరుకోలేక పోయేది. చిన్నముల్లు సంగతి సరేసరి నమ్మకం చాలక గాబోలు జేబు గడియారంతో తూకం వేసి తేడా లేదని తెల్సుకున్నాక చిరాగ్గా గదిలోనే ఓ మూలనుంచి మరోమూల వరకూ అదే పనిగా పచారు చేసేవాడు పగలంతా రోజూ ఇదేపని. ఒకటే గుడగుడు గుంచం, గోపాలం పంతులు కొత్తజీవితంలో. క్షణం వదల కుండ అతని మొగాన ఎప్పుడూ కనిపించే నవ్వు పెదాల వెనకాలే ఆగిపోయింది — ఆ కూనిరాగం అతని ఊపిరితిత్తుల మడతల్లో లాగే గోపాలం పంతులుది తిరిగేకాలు కాక పోయినా వంగని నడుం మాత్రంకాదు. అంచేత యీ గుడుగుడుగుంచం మరి భరించలేక ఓ రోజు ఉదయాన్నే పెరట్లోకి వెళ్ళి పరీక్షగా చూసాడు. ఒక దొండపాదూ, ఒక పొట్లపాదూ మాత్రం కనబడ్డాయి. రెండింటిమీదా గొంగళిపురుగులేగాని ఆకులూ, పిందెలూ చెప్పుకోతగ్గంతగా కనబడలేదు. అంత పెద్ద పెరడూ ఓ దండకారణ్యంలాగా

(గత సంచిక తరువాయి)

అవుపడింది నూతి వెనక పెరటి గోడకి దించిన ఆవుల పాలా, దానికి పక్కనే ఉన్న తాతలనాటి మామిడిచెట్టూ అది అడవి కాదని చెప్పడానికి సాహసించలేక బితుకు బితుకుగా చూస్తున్నాయి ముసలి జాతికా మందార మినహా మరో పూలమొక్క కనపడలేదు. పెరడంతా బాగుచేసి రకరకాల పూల మొక్కలతోనూ, క్రోటను మొక్కలతోనూ తీర్చిదిద్దితే ఎంత ముద్దుగా కనపడుతుందో! ఆ ఉత్సాహంతోనే మధ్యాహ్నం భోజనాల వేళవరకూ, మండుటెండలో పెరట్లోని డొంకని పీక్కలాగి కుప్పగా పోసాడు భోజనాలప్పుడు ఆ మాటా యీ మాటా చెబుతూ మధ్యలో దొర్లించింది అసలు విషయాన్ని భార్య వారి వాటాల ప్రకారం ఉమ్మడి హక్కు ఒక్క నూతిమీదే నట పెరడంతా పెద్దన్నగారు రామయ్య పంతులుదేనట. ఆవులకోసం పాక వేసుకో నివ్వటమే పెద్ద ఉపకారమట. తోటికోడలు అరగంటక్రితం జ్ఞాపకంచేసిన విషయాన్ని భర్తకు అందజేసింది "అలాగా!" అన్నాడు గోపాలం పంతులు, తెలీని అపరాధం ఏదో చేసి పశ్చాత్తాపం ప్రకటిస్తున్న గొంతుతో తోటిఉద్యోగులు రచ్చకెక్కాల్సొస్తుందిగదాని గ్రంధ రచన విరమించుకున్నట్టే అన్నగారి మనసును నొప్పించడం జరుగుతుందేమో అని మరి ఆ పెరడు పేరే ఎత్తలేదు గోపాలం పంతులు.

వంటింటిలోంచి పడకగదిలోకి వచ్చి ఇంకా ఏదో ఆలోచిస్తూనే పట్టుపంచ మార్చుకుని మామూలు పంచ కట్టుకున్నాడు, ఒదులుగా ఉన్న జంధ్యాన్ని పంచకట్టులోకి దోపి. పక్కజేబులూ, పొట్టిచేతులూ వున్న ముతక బనీను వేసుకొన్నాడు. ఇంతలో చిలకలు చుట్టిన తమలపాకులూ, వక్కా అందించింది భార్య యాంత్రికంగానే తాంబూలం వేసుకొన్నాడు గడియారం గంటల ప్రకారం అప్పుడు సరిగ్గా ఒంటిగంటన్నరయింది వీధి వరండాలోకివెళ్ళి బైటకి చూసాడు. మబ్బులేని ఆకాశం మించి చిరుకమ్మతో చూసు న్నాడు సూర్యుడు. మచ్చుకైనా పిట్టమనిషి కనపడలేదు వీధిలో తిరిగి పడక గదిలోకి వచ్చి మంచం మీద కూచున్నాడు దగ్గరగా నేల మీద చాప పరుచుకొని భారతం చదువుకుంటోంది భార్య

"ఎంతవరకు వచ్చింది, భారతం ?" అత్రుతలేని గొంతుతో అడిగాడు.

"యుద్ధ పర్వం"

"అది చదివేసావుగా !"

"చదివాను గాని బాగా నచ్చిన భాగాలు మళ్ళీ చదువుతున్నాను"

"ఓహో, అలాగా !"

"చూసారా, వార్ధక్యం వచ్చినా భీష్మాచార్యులవారు ఎంత ఉత్సాహంగా వున్నారో!"

"వార్ధక్యానికీ ఉత్సాహానికీ లంకె ఏమిటే? కాలం ఎంత ముదుకి తోసినా గ్రహం స్వక్షేత్రంలో వుంటే ఉచ్చదశేమరి ఉత్సాహానికి కొదవేం వుంటుంది ?"

"అదేంటోగాని, యుద్ధంలో చచ్చిపోయినా భీష్ముడు ఇంకా బతికున్నట్టే ఉంటుందండీ, భారతం చివరి వరకూనూ."

"అందుకే అంటారు యుద్ధంలో చచ్చిన వాళ్ళు జీవన్ముక్తులని."

"జీవన్ముక్తులు బాగుందిగాని, అందుకు

యుద్ధంలోనే చచ్చిపోవాలనడం ఏందుకో నాకు నచ్చటంలేదండీ''

"యుద్ధమంటే ఏమిటనుకుంటు న్నావ్ ?"

"యుద్ధమంటే ... యుద్ధమే."

"నువ్వెప్పుడేనా చూసావా ?" మిటకరిస్తున్న కళ్ళతో నవ్వుతూ అడిగాడు గోపాలం పంతులు.

"అయ్యోబాబో! యుద్ధకాండ చదువుతుంటేనే కళ్ళంట నీళ్ళు గిర్రున తిరుగుతాయి నాకు. యుద్ధం స్వయంగా చూస్తే మూర్ఛపోతానో! చచ్చేపోతానో, గుండాగిపోయి."

"అంతభయం దేనికే ? అదీ ఓ ఉద్యోగమే అనుకో."

"అయితే భీష్మాచార్యుల వారు ఉద్యోగం చేస్తూ చచ్చిపోయారంటారా ?"

"అనే అనుకోవాలి మరి"

"బాగుంది మీ వరస"

"కదూ ? యుద్ధం కాకుండా మరెక్కడో చచ్చిపోయాడనుకో, ఏ అడవిలోనో తావళం తిప్పుకుంటూ - అలాగే జరిగుంటే భీష్ముడు ఏమైపోయాడో వ్యాసుడికి కూడ తెలీకపోను."

"ఏమోగాని భీష్ముల వారు చచ్చిపోయినా బతికున్నట్టే అనిపిస్తుంది నాకు"

"ఏమో ఏమిటి ? చెప్పారుగా, ఉద్యోగ ధర్మంలో తనువు చాలించాడు కాబట్టి"

"మరి, ఆ రోజుల్లో కూడ పింఛను అనేదివుంటే భారతం కథ ఏ విధంగా నడిచేదో ?"

"ఏ విధంగా నడిచేదో! మంచి అనుమానమే వచ్చింది నీకు. నడిచేదో నడుం విరిగి పడిపోయేదో మనమెలా చెప్పగలం ? నీ సందేహాలింక చాలుగాని కూరల సంచీ అందుకో" అని భార్య నాదేశించాడు, మూలనున్న తెల్లగల్ల నల్లగొడుగును తీస్తూ. "ఇంత ఎండలో బజారు కెందుకండీ ?" అని అన్నా భర్త ఆదేశాన్ని ఉల్లంఘించిందా యిల్లాలు.

కూరలసంచి మడతపెట్టి చొక్కా పక్క జేబులో దూర్చాక గడప దాటుతూవుంటే అంది భార్య, ఆకర్షణ తరగని కంఠం, మాటల్లోకూడ కనబడే నవ్వు ముఖంతో

"తొందరగానే వచ్చేస్తారు కదూ ?"

ఇంజను పొగ, వాటరు కోలం దగ్గర కాల్తున్న సిండరు బొగ్గుల పొగవాసనా, అలంత దూరంనుంచి గుప్పుపెట్టి ఒకటి తానుగా జోరుగావచ్చి నిలబడి వుండిన పెట్టెల వరసలో చివరదాన్ని 'ధన్ను' మని 'ఢీ' కొట్టినప్పుడు వచ్చిన చప్పుడూ, తాము రైలుస్టేషను ప్లాట్‌ఫారం మీద నిల్చుని వున్నట్టు తెలియజేసాయి గోపాలం పంతులుకి. సిండరు బొగ్గు పొగవాసన ఓసారి గట్టిగా పీల్చుతు స్టేషను నాలుగు మూలల్లూ పరకాయింపుగా చూసాడు. దాని ఇంజను చిమ్నీలోంచి వస్తున్న దట్టమైన నల్లటి పొగ ఆకాశంలో మేఘాల్లాగా ఆకారాలు దిద్దుకుంటూవుంటే, తన బరువంతా గొడుగు మీదే మోపి, మెడకాయ మరీ పొడిగించి అటువేపే చూపునిలిపాడు గోపాలం పంతులు ఆనందం పొంగులు పొంగులుగా దొర్లుకొచ్చి పడింది. అప్రయత్నంగా కంఠం కదిలి 'సన్నగా' కూనిరాగం ఊడిపడింది. ఇంతలో బెంగాలీ బడాబాబూ పలకరించాడు, నమస్కారాలు



చెబుతూ. సిండరు బొగ్గుల కుంపటి మీద వేడిచేసిన 'చా' రెండు కప్పుల్లో పోసి టీస్టాల్ రాంగులాం ఇద్దరికీ చెరోకప్పు ఇచ్చి సలాములు చెప్పాడు. అంతలో మరో నాలుగైదు పాత మొగాలు ఆనందంగా పలకరించాయి గోపాలం పంతుల్ని అంతే. అక్కడే వుండిపోయాడు అతను, హౌరామెయిలు వెళ్ళిపోయేవరకూ.

మెయిలు బండి వెళ్ళాక ఎంగిలాకుల్నీ, చెత్తకాగితాలనీ గొడుగు మొనతో దొంతరగా గుచ్చి, కుండీలో దిగజార్చాక పరిచయమ్తులకి 'గుడ్‌నైట్' చెప్పేసి ఇంటి ముఖం పట్టాడు గోపాలం పంతులు. దార్లో సత్యనారాయణ మూర్తి ఆలయంలో పదినిమిషాలు ఆగి, చెరువుగట్టు సిమెంటు బెంచిమీద కాస్సేపు కూచ్చొని, ఇల్లు చేరుకునేసరికి రాత్రి

# బిళ్ళలేని నల్లటోపీ

తొమ్మిదిన్నరయింది. ఎందుకింత ఆలశ్యం అయిందనిగాని, ఎక్కడికెళ్ళారని గాని భార్య ప్రశ్నించలేదు "వంట చల్లారిపోతోంది, తొందరగా మడి కట్టుకోండి" అని మాత్రం అంది, సన్నగా నవ్వుతూ స్నానం చేసాక భోజనంచేస్తూ తానే అన్నాడు - "అలా స్టేషనవేపోసారి వెళ్ళేనే"అని ఆ మాటలకి ఆమె మళ్ళీ చిన్నగా నవ్వుకుంది - ఆ విషయం ముందుగానే తాను గ్రహించుకుందన్న అర్థాన్ని స్ఫురింప జేస్తున్నట్టుగా. భోజనం అయ్యాక పడకగదిలో కెళ్ళి పక్కమీద వాలేడోలేదో మత్తుమందు జల్లినట్టూ నిద్ర పట్టేసింది గోపాలం పంతులుకి. వంటింటి పని పూర్తిచేసుకొని పడకగదిలోకి వచ్చి పసిపాపడిలాగా నిద్రపోతున్న భర్తను చూసింది. ఆ ముదలో నిద్రపోతున్న అతన్ని చూసిన ఆమె మనసు సంవత్సరాల ద్వారాల్లోంచి పరుగులుతీస్తూ గతంలోకి పారిపోయింది.

చిలక్కొయ్యమున్న చొక్కా జేబులోంచి మడిచేఉన్న కూరల సంచీని వంటింట్లో మేకుకి తగిలిస్తూ ఆ వృత్తి సంచీనే ఆప్యాయంగా ఓసారి బుగ్గలకి అద్దుకుంది. అతిగావస్తున్న నవ్వును దాచుకుంటూ. ఆ నవ్వు పాతనవ్వుకాదు కాపరానికి వచ్చిననాటి లేతనవ్వే అది వింత మహా ఆనందంకలిగినా లేత పెసరకాయల్లాంటి పల్చని ఆమె పెదాలు విడీవిడనట్టే ఉంటాయి, ఆమె జడలోని విడీవిడని పూలచెండులాగే ఆమె ఆనందం అత్తా బుగ్గల్లో తేరిన ఆవగింజంత లొత్తల్లోనే కనబడుతుంది ఆ ఆనందం తోనే తిరిగి పడకగదిలో కెళ్ళి, భర్త మంచానికి పక్కగా నేలమీద చాప పరుచుకొని అతని వేపే చూస్తూ దిండును సర్దుకుంటున్న ఆమె వయసంమూస్తే కాలం దురాక్రమణంతా మనిషి శరీరానికే పరిమితం అవుతుంది గాని మనసు విడను కూడా తాకడానికి సాహసించదని తెలుస్తుంది

మరుచటి రోజు నుంచీ మధ్యాహ్నం సరిగ్గా రెండు గంటలకి బయలేరి, సరాసరి రైలు స్టేషనకి వెళడం తిరుగు దార్లో సత్యనారాయణమూర్తి ఆలయంలో పది నిమిషాలూ, చెరువుగట్టు సిమెంటు బెంచి మీద కాస్సేపూ ఆగాక రాత్రి తొమ్మిదిన్నరకి ఇల్లు చేరుకోడం నిత్య కార్యక్రమం అయిపోయింది గోపాలం పంతులు రిటైరు జీవితంలో హరికథలు ఉన్న రాత్రి మాత్రం యీ కార్యక్రమంలో చిన్న మార్పు ఉండేది. స్టేషను నుండి సరాసరి యింటికే వచ్చి, భోజనాలయాక నాళంవారి సత్రానికో, కన్యకా పరమేశ్వరీ ఆలయానికో హరికథా కాలక్షేపానికి భార్యాసమేతంగా వెళ్ళేవాడు

చిన్న గమ్యస్థానం చేరుకునే వరకూ ఎక్కడికో తెలీదు ప్రయాణం మరి ఇవాళ అలాకాదుగా! అంచేత ఆ బిళ్ళలేని చిన్న మేష్టు నల్లటోపీని దులిపి తలకి తగిలించుకున్నాడు, ఇత్తడి బొత్తాలు తీసేసిన తెల్ల

కోటు వేసుకున్నాక నీడను ఇచ్చే ఆ తెల్లగుడ్డ వలగొడుగు నీడలాగా తోడుగా ఎప్పుడూ ఉండాల్సిందే గోపాలపంతులుతోపాటూ.

కాలం గడుస్తున్నకొద్దీ అదిగో ఆ దట్టమైన నల్లటి ఇంజను పొగా, రైలు కూతా, షంటింగు బండి చప్పుళ్ళూ, తెల్లటి సిండరు బొగ్గు పొగ వాసనా తన జీవితపు పొరలడబ్బాలో ఎన్నటికీ నిండుకోడానికి వీలు పడని పరికరాలని గ్రహించుకున్నాడు గోపాలం పంతులు.

రిటైరైన కొత్తల్లో గోపాలం పంతులికి స్టేషనో అందరూ పరిచయస్తులే. రాంగులాం సలాములు చెబుతూ ఓసారికోసారి బలవంతంగా 'చా' ఇచ్చేవాడు గుడ్సుషెడ్డూ, పార్శెల్సు ఆఫీసూ, బుకింగ్ ఆఫీసులకీ వెళ్ళి పాత పరిచయస్తుల్ని పలకరిస్తూ వుండేవాడు. అందరూ ఆనందంగా కబుర్లు చెప్పుకునే వారు, పాత రోజుల్ని నెమరువేసుకుంటూ. అయితే చిన్న మేష్టు గదిలోకి వెళ్ళినప్పుడు కలిగిన ఆనందం ఇంకోచోట దొరికేది కాదు అతనికి చిన్నమేష్టు గదిలో ఎత్తు మేజాబల్ల మీద కూచొని కొత్త చిన్నమేష్టుకి సలహా లివ్వడం, ప్రతి విషయం వేళకు జ్ఞాపకం చెయ్యడం తన బాధ్యతగా భావించేవాడు చాలా వరకు ఆ చిన్నమేష్టు పని తానే స్వయంగా చేసేవాడు. టోకెను దిమ్మ పిడిని రెండు మూడుసార్లు నొక్కి పక్కకి తిప్పగానే జర్రుమంటూ దొర్లుకొచ్చేది టోకెను ఉండ, పాత చెయ్యిగదా అన్న భరోసాతో. టెలిఫోన్లో పెద్దగా అరుస్తూ పక్క స్టేషనుకీ, కంట్రో లరుకీ చెప్పేవాడు టోకెను నెంబరు రైలు బండి రాగానే వెదురు చక్రాలకి తోలు బెల్టుతో కట్టిన టోకెను ఉండను విప్పి గోపాలం పంతులు చేతికే ఇచ్చేవాడు జమేదారు. దిమ్మకి పై భాగంలో వున్న కన్నంలో ఆ టోకెను ఉండను వేసి పిడిని ముందుగు లాగి పక్కకి తిప్పగానే దిమ్మ టోకెను ఉండను లడ్డుండలాగా మింగేసేది పెద్దగా అరుస్తూ కంట్రోలరుతో చెబుతూ వుంటే ఆ టోకెను నెంబరు డైరీలో రాసుకునేవాడు కొత్త చిన్న మేష్టు.

గోపాలంపంతులుమీద గౌరవాభిమానాలు స్థానికం మాత్రమేకావు. ఇంజన్లో డ్రైవరూ, ఖలాసీ, ఫయిర్మనూ లగాయితూ గార్డూ, బ్రేక్స్‌మన్, టి. టి. సి., టి. టి. ఐ. ల వరకూ సర్వ వ్యాప్తంగా ఉండేది. ఆరోజుల్లో మెయిలు బండి డ్రైవర్లూ, గార్డులూ తెల్ల వాళ్ళే. వారి అసలు పేర్లు ఏవైనా వాళ్ళని 'హలో, జాన్' అనో, 'హలో, చార్లీ' అనో సంబోధించేవాడు గోపాలంపంతులు. వాళ్ళందరికీ అతను 'హలో, పాల్'

పాసింజరు బండి రాగానే 'టీ' 'కాఫీ' కుర్రాళ కన్న, జీడిపప్పు అరటిపళ్ళ వాళ్ళ కన్న, లైసెన్సు కూలీలకన్న ఎక్కువహడావుడి గోపాలంపంతుల్దే బండి ఆ చివరనుండి యీ చివర వరకూ తెగ తిరుగుతూ మధ్య మధ్య చిన్నమేష్టు గదిలోకి వెళ్ళి లైను క్లియరు వచ్చిందో లేదో, టోకెను నెంబరు డైరీలో రాయడం కొత్త చిన్న మేష్టు మర్చిపోయా డేమో ఓ కంట చూస్తూనే వుండేవాడు. సిగ్నలు వాలి, గంట కొట్టగానే గార్డు విసిలు వూది ఆకుపచ్చ జండా ఆడించేసరికి అప్ర యత్నంగా తానూ చేతిని ఆడించేవాడు— చేతిలో జండా లేకపోయినా. బండి ఘుప్‌ఘుప్ మంటూ ప్లాట్‌ఫారం దాటగానే ఎంతో బరువు తీరిన సంతోషంతో చిన్నమేష్టు గదిలోకి పోయి ఆ ఎత్తు మేజాబల్లమీద కూచొని కొత్త చిన్నమేష్టుకి ఆ బండి విశేషాలు చెప్పేవాడు ఏదో ఒక కథ రోజూ వుంటూనే వుండేది గార్డు పెట్టెకి పక్కనే వున్న కుక్కల పెట్టె ఖాళీగా లేని రోజున కుక్కలమీదే కథలన్నీనూ ఆ రోజుల్లో ఉండే కుక్కలు మచ్చుకైన ఇప్పుడు కనపడవే! కూడా వాటిని తీసుకెళ్ళారో, కాల్చి చంపే సారో ఆ దొరలు! ఇలా ఆనందంగా కబుర్లతో రైల్వే కార్యకలాపాలతో కాలం తేలిగ్గా సాగి పోతున్నాది గోపాలంపంతులు రిటైరు జీవితంలో.

గోపాలంపంతులు రిటైరయిన రెండేళ్ళకి బెంగాలీ బడాబాబూకి బదిలీ అయింది ఆ సందర్భంలో రైల్వే బృందం ఫోటోగ్రాఫు ఏర్పాటు చేశారు. పారంపర్యంగా వస్తున్న ఆచారం ఇది. గ్రూపు ఫోటోలో గోపాలం పంతులు కూడ ఉండాలా వద్దా అన్న విషయంమీద పెద్ద చర్చే జరిగింది. చివరికి పవతరావిదే గెలుపు. పాపం గోపాలంపంతులికి యీ తెరవెనుక భాగోతం తెలీనే తెలీదు. అతను ఫొటోగ్రాఫరుకి పక్కగా నిలబడి ఆనందంగా అందర్నీ చూస్తూ, మీట 'క్లిక్' మనగానే పరమానందంతో 'బడాబాబుకీ జై' అని కరతాళధ్వనులు చేశాడు. పూర్వం లాగా అందరూ కాకుండా చిన్నతరహా ఉద్యోగులు మాత్రమే గోపాలం పంతులు ఉత్సాహాన్ని పంచుకున్నారు. బడాబాబూ వెళ్ళిపోతు న్నప్పుడు రైలు దగ్గర మొట్టమొదటి పూల మాల గోపాలం పంతులే వేసాడు. గులాబి పూలమాల అది మిగతవన్నీ బంతీ, సంది వర్ధనం దండలే. వేసినవాళ్ళు, జెమెదార్లూ, కేబినువాళ్ళూనూ. క్రోటను ఆకులతో అలంక రించిన చావంతి పూలగుత్తి ఒకటి ఇచ్చి రాంగులాం బడా బాబు పాదాలకి నమస్కారం పెట్టాడు. కొత్త పెద్దమేష్టు కరచాలనం మాత్రంచేసి "ఆల్ ది బెస్ట్ విట్ పి.కె పి!" అన్నాడు. వెనుక నుంచి ఓ గొంతు వినిపిం చింది .. 'బదిలీ అయి మరో వూరువెళ్తూ వుంటే పూలమాలలూ, పంచాయితీలూ



తిందుకో! బానిసత్వం మన వాళ్లలో బాగా జీర్ణించుకుపోయింది' అని.

బడా బాబు వెళ్ళిపోయిన ఆరు మాసాలికి రాం గులాం మా వూరికి ఆఖరి సలాంకొట్టేసాడు అతని కాంట్రాక్టు కాలం అయిపోయింది. ఆనవాయితీ ప్రకారం మరో మూడేళ్ళు పొడిగింపు కోసం పెట్టుకున్న అర్జీ ఈసారి మంజూరు కాలేదు టీస్టాల్‌కి కొత్త యజమాని వెంకయ్య అతని బంధువెవరో గార్డెన్ రీచ్‌లో పెద్ద ఉద్యోగమే చేస్తున్నాడు స్వతంత్ర భారత పౌర లక్షణాలతోనే ప్రారంభమయింది వెంకయ్య యాజమాన్యం. వెట్టి చాకిరికి స్వస్తి 'టీ' కాఫీలు కావలసిన వాళ్ళు దమ్మిడీ పైసలతో సహా డబ్బు ముందుగా చెల్లించుకోవల్సిందే బడా బాబే కాదు, బడాబాబు బాబైనా అంతే. అది వెంకయ్య హుకుం. రాంగులాం హయాములో వుండే టీ, కాఫీ కుర్రాళ్లలో సగం మంది వేరే ఉద్యోగాలు వెతుక్కోవల్సి వచ్చింది.

గోపాలంపంతులు రైలుస్టేషను నిత్య యాత్ర నిరాటంకంగా సాగుతూనే వున్నా ఇప్పుడు అతను ఆఫీసు గదుల్లోకి వెళ్ళడం తగ్గించాడు, పలకరించిన వాళ్ల సంఖ్య పలచబడి పోయింది పాసింజరు బండీ, మెయిలు బండీ వచ్చేముందూ, వెళ్ళిపోయిన తర్వాతా యధా ప్రకారం ప్లాట్‌ఫారం మీద చెత్తని గొడుగు మొనతో పోగుచేసి కుండీలో రోజూ పోస్తూనే వున్నాడు. పూర్వం కన్న యీ చెత్త మరీ ఎక్కువైంది— ముఖ్యంగా అరటి, నారింజపళ్ల తొక్కలూ; సిగరెట్టూ, బీడీపీకలూను. కిల్లీ ఉమ్ముల మరకల విషయం వేరు నీళ్లతో కడుగుతేనేగాని అవి పోవు. పూర్వం అటువంటి మరకలు అతను ప్లాట్‌ఫారం మీద ఎప్పుడూ చూడలేదు. అంటే అతను చూడకముందే ఆ మరకల్ని చెప్రాసీ కడిగేవాడో లేక ప్రజలు ప్లాట్‌ఫారం మీద ఉమ్మేవారు కాదో తెలీదు. ఓ నాడు ప్యాసింజరు బండి వెళ్ళిపోగానే చెత్తని గొడుగుతోపోగుచేస్తున్నాడు గోపాలంపంతులు. తుడిచే మనిషి బెంచీమీద కూచొని సిగరెట్టు దమ్ము లాగుతున్నాడు ఆ చెప్రాసీ కొత్తవాడవటం చేత గోపాలం పంతులు అతగాణ్ని గుర్తుపట్టలేదు. ప్లాట్‌ఫారం శుభ్రంచేసాక చిన్నస్టేష్ను గదివేపు వెళ్తున్న గోపాలంపంతుల్ని చూసి ముసిముసి నవ్వులతో సిగరెట్టు పొగ తెరమాటు అయిన మొగాన్ని తెల్లటి జేబు రుమాలుతో తుడుచుకున్నాడు ఆ కొత్త చెప్రాసీ.

చిన్నస్టేష్ను గదిలో ఆ వేళ మేజాబల్ల మీద ఇంకెవరో కూచున్నాడు కబుర్ల ఉత్సాహంలో చిన్నస్టేష్ను గోపాలం పంతుల్ని పలకరించలేదు. గోపాలం పంతులు కాస్సేపు అక్కడే తచ్చాడేడు వాళ్ళ కబుర్లకి అంతూ లేదూ, హంసపాదూ లేదూ మరో రెండు గంటలకిగాని రాదు మెయిలు బండి అంతవరకూ ఏం చెయ్యాలో తెలీక, అక్కడే మరి ఉండలేక, ప్లాట్‌ఫారం మీద కొచ్చి ఆ చివరనుండి యీ చివర వరకూ రెండు మూడు సార్లు పచారు చేసాడు ఎండ తీవ్రంగానే వున్నా గొడుగు విప్పలేదు ఎందుకో. చెమటకి తడిసిన చొక్కాని మధ్య బొత్తాం దగ్గర పట్టుకుని కాస్త ముందుకి లాగి కాలరు సందులోంచి కడుపు మీదకి ఊదిచొక్కాని మెల్లగా జాడిస్తూ ఉంటే అతని దృష్టి తొలిసారిగా మొక్కలమీద పడింది ఎండి రాలిపోయిన ఆకులు మొక్కల కింద మళ్ళలోనే ఉన్నాయి మొక్కల్నింకా అంటిపెట్టుకున్న ఆకులు నీళ్ళు లేక ఎండి, వాలిపోయి ఉన్నాయి బాధగా ఓ కోటనుమొక్క దగ్గరకొచ్చి రాలిన ఆకుల్ని తీసి పోగుచేస్తూ వుంటే, ఎక్కడ్నుంచి చూసాడో మరి, జమెదారు రంగయ్య గబగబా వొచ్చి, బొంగురుపోయిన గొంతుతో అన్నాడు "పంతులూ, ఆటిజోలి మనకెందుకులే, ఆట్నిక్కడ ఒగ్గేత్తేనే మంచిది పెద్ద మేష్టు సూతే అగ్గి నిప్పయిపోతాడు" ఆ మాటలకి గోపాలం పంతులు కూర్చున్నవాడు కూర్చున్నట్టే బొమ్మలాగా వుండిపోయాడు కాస్త తేరుకున్నాక తలెత్తి రంగయ్యవేపు చూసాడు— ప్రశ్నార్థకంగా "ఏటి సెప్తమంటావ్, పంతులూ! మంచి మంచి మొక్కలన్నీ బంగాళాకి చేర్పించేసినాడు పెద్ద మేష్టు ఇక్కడి మొక్కల్ని ఓరూ ముట్టుకోకూడదంట ఆయనగోరి ఆగ్జ్ఞ మరది యెందుకొచ్చిన పీకులాట పంచాంగం మనకినిసెప్పు? ఆటి కర్మ అంతే అని వొలకుంటే సరిపోద్ది" అన్నాడు. "మరైతే మొక్కల్ని ఇప్పుడు ఎవరు చూస్తున్నట్టూ?" అడిగాడు గోపాలం పంతులు, నెమ్మదిగా లేచి నిలబడుతూ "దిక్కులేనోళ్ళ నెవరు చూత్తారో నువ్వేసెప్పు" అన్నాడు రంగయ్య పొంగుకొస్తున్న కన్నీళ్ళని రెప్పల వెనకే ఆపుకుంటూ, మనసు చివుక్కుమన్నా చేతుల్లో ఆకుల్ని అక్కడే జారవిడచి అడుగులు ముందుకు పోనిచ్చాడు గోపాలంపంతులు. అవుపడని బాధతో అలా వెళ్ళిపోతున్న అతన్ని చూసి రెప్పలమీద తడిని పీలి తుండుగుడ్డతో తుడుచుకుంటూ పెద్దమేష్టు గదివేపు వెళ్ళిపోయాడు రంగయ్య.

గోపాలంపంతులు మెదడంతా గుల్లబారింది, గుండెలో ఏదోగుబులు పుట్టినట్టే. ఆ అవస్థలో అప్రయత్నంగానే రైలుపట్టాలకి పక్కగా వున్న కాలిదారంట వార్తా కేబిను వేపు నడిచాడు. పాత పరిచయస్తుడు అప్పల్నాయుడే డ్యూటీలో వున్నాడు గోపాలం పంతుల్ని పలకరించి, నమస్కారాలు చెప్పాక కేబినులోకి రమ్మని ఆహ్వానించాడు అప్పల్నాయుడు. మూలమన్న కర్రకుర్చీని ముందుకి లాగి, పాత గుడ్డతో దులిపాక కూర్చొమని కళ్లతోనే చెప్పాడు. పరిచయ వాతావరణంతోపాటు ఆప్యాయతకూడ కనబడ

### జీవితం

కొందరికి తలకెక్కుతుంది
కొందరి తలపైకెక్కుతుంది
కొందరికి తలకెత్తుతుంది
కొందరి తలమొత్తుతుంది.

### తత్వాలు

మహారాజులు బోధించేది మహితతత్వం
మహానుభావులు శోధించేది మహిత తత్వం
మానవులు సాధించేది 'మని' 'షి'తత్వం!!

### ఆమె

స్పీక్‌లెస్ అయితే అదోలా చూస్తారు
షేమ్‌లెస్ అయితే లొట్టలే వేస్తారు
హెల్ప్‌లెస్ అయితే పగలే దోస్తారు!

### స్లోగన్

నిబ్బరంగా వాగుతుంది
నిదానంగా పేలుతుంది

— వరిగి రాధాకృష్ణ

గానే ఆనందంగా కుర్చీలో కూర్చున్నాడు గోపాలం పంతులు

ఏవో పొడి పొడి మాటల్లోనే వారిద్దరి సంభాషణా ప్రారంభమయినా పరస్పరం తొందర్లోనే గ్రహించుకున్నారు- ఇద్దరిలో నూ మార్పు ఏదీ లేదని. అప్పల్నాయుడే ముందుగా అంకించుకున్నాడు-

''గోపాలంపంతులూ, సూసినావా ఎట్టా మారిపోతూవున్నాయో రోజులు, మన కల్లెదుటే !''

ఆ మాటలో నిరుత్సాహం, బాధ, ఓ రకం అసహాయతా ధ్వనించాయి గాని అవి తనని ఉద్దేశించి అన్న మాటలు కావట్టుగా—

— ''అప్పల్నాయుడూ, ఇంటో అంతా కులాసానేనా?'' అని కుశలప్రశ్న వేసాడు గోపాలంపంతులు.

''ఆ సింహాద్రిరప్పన్న కటాచ్చాంవాల్లా, నీబోటోల్ల దయవాల్లా ఇంటో అంతా సేమంగానే వున్నాంగాని పంతులూ, యిక్కడే అంతా అరదంకాని అయ్యోమయంగా వుంది యవ్వారం'' అన్నాడు ఇద్దరూ మౌనంగా క్షణంపాటు చెరోవేపూ చూస్తూ ఉండిపోయారు. ఇంతలో తిరిగి అందుకున్నాడు అప్పల్నాయుడు ''సూడు యీ లీవరు యాండిల్సు సూడు యెప్పుడూ జిగజిగా మెరిసే యీ యాండిల్సు యెట్టా నల్లగైపోనాయో మవ్వేసూడు. అట్టి తుట్టం ఓరి పనీ కాదంట తీసేస్రా బాబుల్నారా నానే తుడుత్తానంటే యీ కొత్తోల్లు యెదిరిత్తారూ, బెదిరిత్తారూ. యీాట్టి తుట్టానికి యేరే మడిసిని యెయ్యాలంట. యీాలంతా పదుంకున్నోల్లులే పెద్ద మేస్త్రు యీాల్ల నెక్కల్లో మడిసేకాదు మరాల్లు యేడ్డాపీమకి రాసే కాగితాలకి లెక్కాడొక్కా! యెన్ని కాగితాలు రాత్తేనేం? పయోజనం సున్నే. కొత్తోదురాడా, యీాటి యేడుపు మొగాలూ పోవూ. యేటిసెయ్యాలి?'' ఒక్కగుక్కలో కడుపులోవున్న బాధనంతట్నీ కక్కేసాడు అప్పల్నాయుడు. లీవరు హేండిల్సు చూసాడు గోపాలం పంతులు వాటి వేపు అలా చూస్తూనే అన్నాడు ''ఏదీ బ్రాసోడబ్బా?

## బిళ్ళ లేని నల్లటోపీ

ఓ పాతజండా ముక్కకూడ అందుకో'' అని ''పాతజండా లెక్కడున్నాయ్ పంతులూ, కొత్త జండాలే కూరల సంచులుగ మారిపోతా వుంటే'' అంటూ బ్రాసో డబ్బా అందించాడు. ఆ బ్రాసోను కొంచెం తన పంచ కుచ్చిళ్ళ మీద వంపి, దాంతో లీవరు హేండిల్సు తుడవటం ప్రారంభించాడు గోపాలం పంతులు, మెరిసే హేండిల్సు చూసి కొత్త కుర్రాళ్ళు ఉచ్చుకుక్కల్లాగా రెచ్చిపోతారన్న భయం వేసినా కాస్త బ్రాసోని పాగా గుడ్డకి పులిమి తానూ హేండిల్సు తుడవసాగాడు అప్పల్నాయుడు. అరగంటలో అన్ని హేండిల్సూ నిగనిగ మెరవసాగాయి ఆనందంతో మురిసిపోతూ మౌనంగా కాస్సేపు ఇద్దరూ వాటి వేపే చూసాక అప్పల్నాయుడు అన్నాడు ''యెర్రిదొర్లు యెలిపోతే మన యవ్వారవంతా మూడుపువ్వులూ, ఆరుకాయలూ అవుద్దని సంబరపడిపోనాను పంతులూ గాని ఆల్లున్నప్పుడే మెరుగనిపిత్తా వున్నారు మనోల్లు'' ఉత్సాహం పిడుచుకుపోయిన నవ్వుతో అటువంటి విషయాల మీద తనకొక నిశ్చిత అభిప్రాయం ఏర్పడకపోవడం వల్లనే మౌనం జవాబుగా ''మరి నేను వెళ్ళొస్తా అప్పల్నాయుడూ'' అంటూ లేవబోతూ ఉంటే ''ఆగు పంతులూ, అరిజంట్లు యేటున్నాయని! కసిన్ని 'చా' నీల్లు తాగి యెల్దూగాని'' అని ఆప్యాయత ప్రదర్శించాడు గోపాలంపంతులూ కాదనలేకపోయాడు బ్రూక్‌బాండ్ పొట్లాంలోంచి కాస్త టీ గుండని కెటిలులోకి వంపి ''ఉప్పుడే వచ్చేత్తా'' అంటూ ఇనపమెట్లనిచ్చెన గబగబాదిగి, లైన్సు దాటుకుంటూ షంటింగు ఇంజన్లోంచి మరుగునీళ్ళు కెటిల్లో పట్టించుకొచ్చాడు. ఇద్దరూ 'చా' తాగక కేబిను మెట్లు దిగుతూ వెనక్కితిరిగి అపల్నాయుడితో ఏదో చెప్పాలనుకున్నాడు గోపాలంపంతులు. ఇంతలో తోపుడు ట్రాలీ మీద స్టేషనువేపు వెళ్ళున్న పి. డబ్ల్యూడి ఇనిస్పెక్టరు బెనర్జీ బాబూ ట్రాలీ ఆపి గోపాలం పంతుల్ని పలకరించాడు అప్పల్నాయుడికి చిన్న మంద హాసాన్ని మాత్రం చూపించి ట్రాలీ ఎక్కాడు గోపాలం పంతులు.

(ఇంకా వుంది)

## సచివాలయంలో తుపాకి ప్రేలుళ్లు !

అక్టోబరు 16వ తేదీన పట్టపగలు పంజాబ్ సెక్రెటేరియట్ (చండీఘర్‌లో) భవనంలో ఉన్నట్టుండి వో తుపాకీ పేలిన శబ్దం అయిందట. నిరంజన్‌సింగ్, ఐ ఎ ఎస్ ఆఫీసరు ఎగిరిగంతేశారట ఆయన కుడి అరచేతికి గుండు తగిలిందట. జనం కొయ్యబారి తేరుకొనేలోగా ఆయన తమ్ముడు మరీందర్‌సింగ్ నేలకొరిగి ప్రాణాలు పోగొట్టుకున్నాడట ముగ్గురు వ్యక్తులు విరువిరుగ పరుగెట్టి పారిపోయారట. లాలాజగత్ నారాయన్ అనే ఒహాయన లూడియానా— జలంధర్ రాజమార్గంలో సెప్టెంబరు తొమ్మిదిన కారులో వెళ్తూండగా సరికొత్త బుల్లెట్ మోటారుసైకిలు మీద పోతున్న వో ముగ్గురు ఆయన మీద పిస్టలు గుళ్ల అక్షతలు జల్లి చంపేశారటాయన్ని అదేమాదిరిగా 28వ తేదీన వో కొత్త బుల్లెట్ మోటారు సైకిలు మీద ముగ్గురు వ్యక్తులు జలంధర్‌లో గుళ్లవర్షం కురిపించి నలుగుర్ని చంపి, చాలామందిని గాయపరచి పారిపోయారట 22వతేదీన హరియానా, పంజాబ్ రాష్ట్రాలసరిహద్దులోవున్న తార్నతరన్‌అనేవూరిలో అదేమాదిరిగా ఒకర్ని చంపి, పెక్కుమందిని గాయపరిచారట ఆదేబులెట్‌వీరలు. దీనికి కారణమేమనా— సిక్కులు తమకువిడిరాష్ట్రం కోరుతున్నారట— ఇదేం పద్ధతి ?

## అంధ అడ్వకేటు

తమిళనాడు బార్ కవున్సిల్ ప్రప్రధమంగా వో అంధుణ్ణి కవున్సిల్ మెంబరుగా నమోదుచేసిందట. 24 ఏళ్ల పంచపగేశన అనే అంధుడు మద్రాసు క్రిస్టియన్‌కాలేజీలో పట్టా పుచ్చుకుని మద్రాసు లా కాలేజీలోనే లా పట్టా పుచ్చుకున్నాడట.

## సినిమా పద్ధతిలో బాలుని అపహరణ !

సేలంలో మొన్న 16 వ తేదీన 5 ఏళ్ళ సైదవ్యాన్ అనే కుర్రాడిని అతను చదువుతూన్న కాన్వెంటు స్కూలు నుంచి వో మగతనూ, ఆడామే పిలచి, బాబూ, మీ నాన్నగారుపిల్చుకురమ్మన్నారు అని చెప్పి తీసుకుపోయారట. కుర్రాడు మామూలు వేళకు యింటికి చేరనే లేదనే విషయం కారు డ్రయివరు చెప్పేసరికి ఆ పిల్లాడి తండ్రి సుబ్రమణ్యం అనేలక్షాధికారి విలవిల్లాడిపోయాడట. ఆ సాయంత్రం యింటి ప్రహరీ లోపల కుర్రాడు స్కూలు డ్రస్సు మూట కట్టిపడున్నదట. ఆ మూట విప్పేసరికి అందులో వో టేపు వో వుత్తరం వున్నాయట. టేపులో ఆ పిల్లాడి ఏడుపు గొంతు, నాన్నా నన్ను వీళ్లు చంపుతానంటున్నారు వాళ్ళడిగిన డబ్బిచ్చి, నన్ను విడిపించు అని వున్నదట. వుత్తరంలో వో ధనపతి మీ కొడుకు కావాలంటే మూడు లక్షల రూపాయలు



కోవై ఎక్స్‌ప్రెస్ సోమనూరు స్టేషను దాటాక వచ్చే బ్రిడ్జి వైపుగా పడేయ్. అనక కోయంబత్తూరులోని అలంకార్ లాడ్జిలో రూం తీసుకుని వుండు నీ కొడుకు దొరుకుతాడక్కడ పోలీసులకుచెప్తే మీ కొడుకు శవం దొరుకుతుంది అని వున్నదట అన్న రోజుకుఆయన మూడు లక్షలు వో పెట్టెలో పెట్టి కోవై ఎక్స్‌ప్రెస్ ఎక్కి సోమనూరు ప్రాంతంలో క్రింద పడేశాడట. ఆ పడ్డెటంలో పెట్టె మూత వూడిపోయి డబ్బు చెల్లాచెదరై పోయిందట దాంతో రైలు కట్ట బాగుచేస్తున్న గ్యాంగు వారు అంతా పోగుచేసుకున్నారట ఆ ప్రదేశంలో మాటు వేసిన పోలీసులు వారి వద్దనుంచి లాక్కున్నారట, మొత్తం లక్షా తొంభయిమూడు వేలుదొరికిందట. ఇంతలో ఆ దారిన వస్తూన్న మోటరు సైకిలు వాళ్ళు పోలీసుల్ని చూసి, వారి వాహనాలొదిలి, పక్క అడవుల్లోకి పారిపోయారట ఇహ చేసేదేమీలేకపోలీసులు దారికాసి, వచ్చే వాహనాలన్నీ సోదా చేస్తుంటే కోయంబత్తూరు నుంచి వస్తూన్న వో కారులో ప్రయాణం చేస్తున్న మురుగేశన్ అనే టీచరు తాను గోపిచెట్టి పాలయానికి చెందిన కోరమడ్డై గ్రామంలో వో కొత్త దంపతులు అయిదేళ్ల పిల్లాడితో బస్సు దిగినట్లు చూసిన వైనాన్ని చెప్పాడట. వెంటనే పోలీసు ఆ వూరు మీద విరుచుకు పడితే ఆ దంపతులూ, పిల్లాడు కూడా దొరికారట. ఇది సినిమాకథా కాదు, కథా కాదు.

## పాట తెచ్చిన తంటా !

వారణాసికి చెందిన వో చిన్న పిల్లాడు తాను చూసిన హిందీ సినిమాలోని వో పాట జిస్కీబీవీ మోటీ— ఉస్కా భి బడా నామ్ హై పాడుకుంటూ ఆనందాతిశయాలతో ఆ దారి పోయే గరల్స్ ఇంటర్ కాలేజీ వైస్ ప్రిన్సిపాల్ కేసిచూసేసరికి ఆవిడకి కోపం వచ్చి, తన మీదే యీ పాట అని నిర్ణయించుకుని, నడిరోడ్డనయినా యోచించకుండా ఆ కుర్రాడి వెనుక పరిగెత్తి, పట్టుకుని అతన్ని చావ దెబ్బలు కొట్టిందట. దాంతో ప్రమాద పరిస్థితిలో ఆ కుర్రాడు ఆసుపత్రి పాలయ్యాడట పొట్టలో బలమైన దెబ్బలు తగలడమేగాక,అతని వో చెవిలోపల డ్రమ్ము పగిలే పోయిందట.

## వింత కోరిక !

తమిళనాడుకు చెందిన తుక్కాలె అనేవూరిలోని పద్మనాభపురం రాజభవంతి అలనాటి రాజదర్పము చూడ్డానికి కొంతమంది పార్లమెంటు మెంబర్లు వెళ్లారట అలనాటి రాజు పాయిఖానాలు చూసి ముచ్చటపడి, తానూ వో సారి ఆ పాయిఖానాను వుపయోగించి, జన్మను చరితార్థం చేసుకో ముచ్చటపడిన వో ఎం పి ని అక్కడి గార్డు నిలిపి అయ్యా అది పబ్లిక్కు లేవేటరీ కాదు చూసి తరించండి గాని, వుపయోగించ తలచరాదు అన్నాడట. దాంతో యం పి లంతా ఒకటై అతనితో పోట్లాట పెట్టుకున్నారట చివరికి గార్డే గెలిచాడట !

## భార్యపై రిపోర్టు !

తాను గల్ఫ్ దేశాలకు సంపాదనార్థం భారత దేశంలోని తన వూరు పాంజిమ్ (గోవా) వదలి వెళ్లి నప్పుడు కొన్ని ఖరీదయిన తన వస్తువులు తన భార్యకు అప్పగించి వెళితే ఆమె తన విలాసార్థం వాటిని తెగనమ్మి సుఖ జీవనం చేసిందని ఒహాయన పోలీసు రిపోర్టిస్తే పోలీసులు విచారించి అతని భార్యను అరెస్టు చేశారట. ●








## 1-1-1982 శుక్రవారం మొదలు 7-1-1982 గురువారం వరకు

మేషం గ్రహ మండలిలోని మార్పులు మీ రాశికి ధనయోగాన్ని అందించ గలవు వ్యాపారంలో నూతన ప్రయోగాలు ప్రయత్నాలు చేయనున్నారు. అధికారం చెలాయించవలసిన పనులు వ్యాపార రంగంలో కనిపించ గలవు స్త్రీలకు నూతనోద్యోగ ప్రయత్నాలు ఫలవంతం కాగలవు

వృషభం ఆరోగ్యలోపం లేదు క్రమమైన పద్ధతులలో మీ వ్యాపారం, వ్యవహారాలు రాగలవు కళాసాహిత్య క్రియలలో మీ అనుభవం ఫలితానికి రాదు భూ విక్రయాలకి దిగటం కూడా గమనించ గలరు స్త్రీలకు ఆదాయం, లాభం, అప్పులు వసూళ్ళు సంభవం

మిథునం మిత్రులో, బంధువులో మీతో సహకరించనున్నారు క్రయ విక్రయాలలో లాభించే మార్గం, సభ కార్యక్రమంలో జోక్యం కలుగజేసికోవటం, పత్రికా ప్రకటనలో ప్రగతి కనిపిస్తుంది దూర దేశాన్నుండి వార్తలందనున్నవి. స్త్రీలకు ఉద్యోగ, వృత్తులందు అనుకూలం. మిత్రులవలన ఒకానొక వ్యాపార విషయం పరిష్కరింపబడనున్నది

కర్కాటకం కళాసాహిత్యరంగాల్లో అనుకూలత, ఆదాయం, నెరవేరవనుకొన్న పనులు సులువుగా నెరవేరటం, భూ సంబంధంగా ఆదాయం సంభవించటం, అయిన వారితో బంధుత్వం కలుపుకొనే ప్రయత్నాలు, క్రీడారంగాలలో నూతనావకాశాలు లభించటం, గమనింపదగిన అంశాలు. స్త్రీలకు నాలుగు విధాలా మేలుంటుంది.

సింహం వైద్యవృత్తి, న్యాయవాద వృత్తి కంట్రాక్టు వ్యవహారాలు, కిరాణా వ్యాపారం ఫలదాయకం ఆదాయం ఎలాగా సంభవించనున్నది వృత్తిలో మీకు అనుకూలత సంభవించటం, కార్మికులకు అనుకూలత గలవారం. స్త్రీలకు నూతనోద్యోగాల ప్రయత్నాలు ఫలింపనున్నవి. వస్తు సేకరణకు అవకాశమున్నది.

కన్య వస్తు సేకరణకు అనుకూలం కుటుంబానందం, సంతానం వలన ఆనందోత్సాహాలకు అవకాశం, ధనం రావాలసినది ఉంటే కొంతరో కొంత చేతికందటం, దూర ప్రయాణాలకు అవకాశం కలగటం, ఆరోగ్యం బాగుండటం జరుగుతుంది స్త్రీలకు రచనా వ్యాసంగం ఫలించటం, నూతన విషయాలు గ్రహించటం జరిగే వారం.

తుల బంధువుల వలన జరుగవలసిన పనులు, మిత్రుల మూలాన ఏమైనా జరుగదగిన పనులుంటే, నిశ్చయంగా జరుగ గలవు నూతనంగా ఏవో ప్రయత్నాలు వ్యాపారరంగాన సాగిపోగలవు ఆరోగ్య లోపం లేదు స్త్రీలకు ధనాదాయం, క్రయ విక్రయాలలో లాభం చేకూర గలవారం.

వృశ్చికం నూతన వ్యాపారాలకు నాంది ప్రస్తావన జరుగుతుంది. అందాలసిన పైకం చేతి కందే మార్గమున్నది మీతో సహకరించగలవారుంటారు పొగడ్తలకు పొంగి పోరగిన కాలంగాదు క్రీడావనిలో అవకాశాలు చిక్కటం, రాజకీయంగా కొందరకు అనుకూలత చేకూర గలదు. స్త్రీలకు సుఖం, శాంతి, ఆదాయం, అనుకూలత గలవారం

ధనుస్సు ధనలబ్ధికిగాని వ్యాపారంలో అవకాశాలకుగాని, క్రీడారంగంలో, రాజకీయ వ్యవహారాలలో, కళా సాహిత్య రంగాలలో, అనుకోకుండా మీకు అవకాశాలు లభింపనున్నవని గ్రహించాలి స్త్రీలకు సంతాన మూలక ఆనందం, హాయి, లబ్ధి గల వారమే.

మకరం రాజకీయంగా కొందరకు, క్రీడావనిలో కొందరుకు, సాహిత్య రంగంలో కొందరకు వృత్తిలో కొందరకు, క్రయ విక్రయాలలో కొందరకు, భూసంపదలో అనుకూలతకు అవకాశమున్నది అప్పులు వసూలగుటకు అనుకూల వారం. స్త్రీలకు నూతన వస్తు సేకరణకు, ఉత్తరాల మూలాన కొన్ని ముఖ్య విషయాలు గ్రహించటం జరుగుతుంది.

కుంభం ప్రయత్నాలు సుకరంగ సాగిపోతాయి. ప్రయాణాలు సాగే మార్గం కూడా కనిపిస్తుంది. శుభకార్యాలోచనలు కొందరి విషయంలో చెప్పదగిన అంశం. ఉత్తరాషాఢ వారికి అన్నివిధాలా అనుకూలత ఆదాయం, పెద్దల ఆదరణ లభించగల వారం. ఆరోగ్య లోపంలేదు స్త్రీలకు ఉద్యోగానుకూలత చెప్పవచ్చు.

మీనం కళా రంగంలో ప్రవేశం గలవారికీ, సాహిత్య రంగంలో అనుభవమున్నవారికి, పత్రికా రచనలో అనుభవం గడించిన వారికి ఆదాయం, అనుకూలత కనిపిస్తుంది సభా కార్యక్రమంలో కొందరకు, ఈ రాశి జాతకులకు అవకాశం లభించే అవకాశం గల వారం. స్త్రీలకు ఉద్యోగంలో ప్రగతి కనిపించటం, నూతనంగా నగలో, వస్త్రాలో కొవటం, బంధు వర్గీయుల దర్శనకు అవకాశం గల వారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



# వంటలు

## క్రిస్‌మస్ కేక్

కావలసిన వస్తువులు. 450 గ్రాముల మైదాపిండి, 115 గ్రాములు పంచదార, 8 కోడి గుడ్లు, 1టీ స్పూన్ బేకింగ్‌పౌడర్ కొద్దిగా పాలు, కేక్ తయారైన తర్వాత మనకువచ్చిన రీతిలో ఆకర్షణీయంగా అలంకరించడానికి 80 గ్రాముల వెన్న, 80 గ్రాముల అయిసింగ్ షుగర్, కొంచెం ఎసెన్స్, కావలసిన రంగు వుపయోగించాలి

తయారుచేయు పద్ధతి ఎగ్ బీటర్‌లోకి కోడిగుడ్డుసొన, పంచదార తీసుకొని బాగా మరుగు వచ్చేంతవరకూ గిలకొట్టాలి మైదా పిండిలో బేకింగ్ పౌడర్‌ను కలుపుకొని బాగా జల్లించండి ఇప్పుడు పాత్రలోని కోడి గుడ్డు, పంచదార మిశ్రమంలో ఈ పిండిపోసి, బాగా కలపండి. ఇది జారుగా వుండాలంటే, కొంచెం పాలు కలుపుకోవచ్చు నెయ్యిరాసిన ట్రేలోకి ఈ పదార్థాన్ని తీసుకుని ఒక గంట పదిహేను నిమిషాల పాటు 400 డిగ్రీల ఫారెన్ హీట్ వేడిలో వుంచండి.



తయారీ పూర్తయిన తర్వాత, కావలసిన రంగులన్నీ కేక్‌లో కలుపుకొని, పైన అందంగా అలంకరించండి క్రిస్మస్‌కేక్‌రెడీ!

-ఎస్. ప్రేమకుమారి

## వెజిటబుల్ బ్రెడ్

కావలసిన వస్తువులు: మోడరన్ బ్రెడ్ 1 ప్యాకెట్, బీన్సు 10, క్యారెట్లు 2 ఉల్లిపాయలు 3 లేక 4, బంగాళదుంపలు 2, పచ్చిమిర్చి, 4లేక5, ఉప్పు తగినంత, కార్న్‌ఫ్లోర్ 5 చెంచాలు.

తయారుచేయు విధానము: బ్రెడ్ స్లైసుని మధ్యకు కోయాలి రెండుభాగాలుగా బంగాళా దుంపలు ఉడికించి వుంచుకోవాలి బీన్సు, క్యారెట్లు చిన్నచిన్న ముక్కలుగా కోసి నీళలో వేసి ఒకే ఉడుకురానిచ్చి దింపెయ్యాలి. ఉల్లిపాయ, పచ్చిమిరపకాయలు చిన్నచిన్న ముక్కలుగ తరిగి వుంచుకోవాలి. కార్న్‌ఫ్లోర్ ప్యాకెట్ బజారులో దొరుకుతుంది- మెత్తగా కస్టర్డు పౌడరులా వుంటుంది ఆ ప్యాకెట్‌లో నుండి 4లేక5 చెంచాలు పౌడరు ఒకపళ్లెంలో వేసి ఈ ఉడికించిన క్యారెట్, బీన్సుముక్కలు, బంగాళాదుంపముద్ద, ఉల్లి, పచ్చిమిర్చి ముక్కలు కలిపి తగినంత ఉప్పు, కొద్దిగా కారం వేసి, కొద్దిగా నీరుపోసి ఈ ముక్కలు ఆ పొడి బాగా కలిసిపోయేలాగా కలుపుకొని ఉంచుకోవాలి.

మూకుడలో నూనెవేసి మరిగిన తర్వాత సగం చెయ్యబడిన బ్రెడ్‌ముక్కమీద ఈ కూరని పరిచి నూనెలో వేయించాలి గోధుమరంగు వచ్చాక తీసివెయ్యాలి .. ఇవి చల్లారితే కన్నా వేడిగా తింటే రుచిగా, కమ్మగా వుంటాయి.

-ఆదెళ్ళ లక్ష్మి

# హైదరాబాద్ నోట్ బుక్

తిరుమల రామచంద్ర

## కేరళలో ప్రాకృతం :

కేరళలో సంస్కృతమేకాక ప్రాకృతం కూడ జీవించి వుందని కేరళ విశ్వ విద్యాలయం సంస్కృత శాఖాధ్యక్షులు ప్రొఫెసర్ ఎన్. పి ఉణ్ణి నవంబర్ 24 సాయంకాలం 51 జీరాలో జరిగిన సమావేశంలో ప్రసంగించారు ఈ సమావేశం ప్రాకృత అకాడెమీ అధ్వర్యంలో జరిగింది. ఉస్మానియా సంస్కృత శాఖాధ్యక్షులు డాక్టర్ ప్రమోద్ గణేశ్ లాల్వే అధ్యక్షత వహించారు. ప్రాకృతంలో రచనలు కేరళలో ప్రతి శతాబ్దంలోనూ సాగుతూనే ఉన్నాయనీ, ఈ శతాబ్దం ప్రారంభంలో వాసుదేవ కవి భృంగ సందేశం అనే కావ్యం ప్రాకృతంలో రచించాడని, అది ఇప్పుడు లభ్యం కావడం లేదు గనుక దానిని పునర్ముద్రించవలసిన అవసరం ఉందని ప్రొఫెసర్ ఉణ్ణి అన్నారు. కేరళలో తరచు సంస్కృత నాటకాలు ప్రదర్శిస్తుంటారని వాటిలోని ప్రాకృత వాచికాన్ని పాత్రలు మొదట పలికి తర్వాత సంస్కృతచ్ఛాయ పలుకుతారని. ఈ విధంగా ప్రాకృతం కేరళలో ఇంకా జీవించే ఉందని ఆయన వివరించారు. తాతాన్ కోట దేవస్వం బోర్డు కాలేజీలో సంస్కృతాచార్యులు శ్రీ ఎం రమ ఫ్ట్నాన్ కేరళలో విద్యావ్యాప్తి ముఖ్యంగా సంస్కృత విద్యా వ్యాప్తి గురించి ప్రసంగించారు. మలయాళ భాష ద్రావిడ కుటుంబానికి చెందినా నాటికి 95 శాతం సంస్కృత పదాలు వుంటాయని అందువల్ల సంస్కృతం కేరళలో జీవించే వుండడానికి ఇదొక నిదర్శనమని ఆచార్య రామ కృష్ణన్ అన్నారు ప్రసంగానంతరం జరిగిన చర్చలో శ్రీయుతులు తిరుమల రామచంద్ర, కేశిరాజు కృష్ణ ఫణి (ఆంధ్రబ్యాంకు టెక్నికల్ ఆఫీసర్) ప్రహ్లాద్ (ఉస్మానియా సంస్కృత శాఖ రీడరు), డాక్టర్ కమల (నిజాం కాలేజి సంస్కృత శాఖ రీడరు) శ్రీమతి సింధుతాయిలాల్వే మున్నగు వారు పాల్గొన్నారు. భృంగి సందేశం ముద్రణకు నిర్ణయం జరిగింది

## ఆదవాని కళాసమాఖ్య :

ఇటీవల ఆదవాని కళాసమాఖ్య ప్రముఖ సభ్యులు శ్రీ సి రామలింగనగౌడ (అన్నపూర్ణ ఫైర్ వర్క్స్) మేనేజింగ్ డైరెక్టర్ను కలుసుకొన్నప్పుడు ఆదవాని యువకుల కళాభిరుచి తెలిసి చాల సంతోషమయింది ఆదవానికి వ్యాపార రీత్యా లిటిల్ బాంబే అనీ పేరు ఆంధ్రప్రదేశ్‌లోని ప్రధాన వ్యాపార కేంద్రాలలో ఒకటి ఆదవాని వ్యాపారంలో తలమునకలుగా వున్న వారికి వినోదం కూడా అవసరం ఆ అవసరం ఏ జూదంగానో పరిణమించకుండా నాటక ప్రదర్శనగా మంచి అభిరుచితో పెనగొని కళా సమాఖ్యగా రూపొందడం యువకుల సంస్కారానికి తార్కాణ ఈ కళా సమాఖ్య సభ్యులు ధర్మవరం రామకృష్ణమాచార్యులు, బళ్ళారి రాఘవ ఆదర్శంగా రోజుకు దాదాపు నాలుగుగంటలు ప్రాక్టీస్ చేస్తారు. సాయంకాలం 5 00నుంచి రాత్రి 9—00 వరకు. కురుక్షేత్రం మొదలయిన పౌరాణిక నాటకాలు ప్రదర్శిస్తుంటారు సభ్యులలో చాల అనుభవమున్న వారూ ఉన్నారు. అధ్యక్షుడు శ్రీ జి వెంకటరామిరెడ్డి దుర్యోధన పాత్రలో నిపుణుడు కార్యదర్శి శ్రీ బి. హనుమంతరెడ్డి కృష్ణపాత్రధారి. ఇంతవరకు 150 నాటకాలలో నటించారు. శ్రీ ఎం శాయిరెడ్డి ధృతరాష్ట్ర పాత్రలో విఖ్యాతులు. శ్రీ నక్షత్రరెడ్డి శ్రీ సి రామలింగనగౌడ అర్జున కృష్ణ పాత్రలు నిర్వహిస్తారు. వీరికి మంచి పేర్మనిస్ట్ లభించారు. ఆయన పేరు శ్రీ పాండురంగయ్య ఆయన ఆ పాత్రలను అనుసరించి నాటకానికి రక్తి కట్టించడం బాగా తెలుసు. ఈ సమాఖ్య నెలకొక నాటకం ప్రదర్శించడం విధిగా పెట్టుకొన్నది అప్పుడప్పుడు పొరుగూళ్ళలోను ప్రదర్శన లిస్తుంటుంది ధర్మవరం రామకృష్ణమాచార్యులు కోలాచలం శ్రీనివాసరావుగారి నాటక సంఘాలస్థాయికి మీరు ఎదగాలి, వాటి కీర్తి నిలిపించాలి అన్నాను. శ్రీ రామలింగన గౌడతో అంతటి భాగ్యమా మేము పిల్లవాళ్లం. అంతటిస్థాయి కోసం ప్రయత్నిస్తాము అన్నాడు శ్రీ రామలింగనగౌడ సవినయంగా ఆయన వినయాన్ని బట్టి కళా సమాఖ్యకు మంచి భవిష్యత్తు ఉందనే నమ్మకం నాకు కలిగింది.

## త్యాగరాజ కృతుల సంపుటాల ఆవిష్కరణ

రాష్ట్ర సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి అధ్యక్షతన నవంబర్ చివరివారంలో రవీంద్ర భారతిలో జరిగిన సమావేశంలో అన్నమాచార్యుల ఆధ్యాత్మక శృంగార సంకీర్తనల మూడవ సంపుటిని, త్యాగరాజకీర్తనల మూడు సంపుటాలను ముఖ్యమంత్రి శ్రీ టి అంజయ్య ఆవిష్కరించారు. కృతులను సంస్కరించి స్వరపరచినందుకు శ్రీ నూకల జగన్నాథరావును శ్రీ భాట్టం అభినందించారు. అన్నమాచార్యులు త్యాగరాజు అవతార పురుషులైన మహాభక్తులని, వారి కృతులను రక్షించి సంప్రదాయన్ని ముందు తరాల వారికి కూడా అందుబాటులో వుండే రీతిగా స్వరపరచి ప్రచురించడం ముదావహమని శ్రీ భాట్టం తిరుమల తిరుపతి దేవస్థానం వారిని ప్రశంసించారు. ముఖ్యమంత్రి శ్రీ జగన్నాథరావును సన్మానించారు. తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వహణాధికారి శ్రీ సి. వి. ఆర్. కె. ప్రసాద్ ప్రసంగిస్తూ, దేవస్థానం ధర్మ రక్షా కార్యక్రమం కింద త్యాగరాజ కృతులను స్వరపరచి పెక్కు సంపుటాలుగా ప్రచురించదలచిందని దానిలో భాగంగా మూడు సంపుటాలు ప్రచురించామని అన్నారు.



# మహిళాలోకం ముందడుగు



శ్రీమతి ఇందిరాగాంధి
ప్రధానమంత్రి

"తరాలుగా ఆర్థిక స్వేచ్ఛకుగాని, విద్యాగ్రంథానికిగాని నోచుకోని కోట్లాది మహిళల జీవన పరిస్థితులు మెరుగుపరిచేందుకు మనం కృషి చేస్తున్నాం. తమలో అంతర్లీనంగా ఉన్న మహత్తర శక్తిని వారు తెలుసుకుని తమ ప్రతిభను పెంపొందించుకొని జాతి అభివృద్ధి కృషి చేయాలని మనం భావిస్తున్నాం,"



శ్రీ టి అంజయ్య
ముఖ్యమంత్రి

★ మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధిగారి ఈ ప్రపంచ మహిళా సంక్షేమ రంగంలో మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల విధానాన్ని వెలడి చేస్తున్నది. మన రాష్ట్రావతరణ రజతోత్సవాల సందర్భంగా శ్రీమతి ఇందిరాగాంధి పుట్టిన రోజును మహిళా దినోత్సవంగా మనం జరుపుకోవడం మన కెంతో గర్వకారణం.

★ మహిళలకు ఒక ప్రత్యేక ఆర్థిక సంస్థను ఏర్పాటు చేసిన మొట్టమొదటి రాష్ట్రం ఆంధ్రప్రదేశ్. ఇంతవరకు 42,000 మంది బలహీన వర్గాల మహిళలు స్వయం ఉపాధి పథకాలు చేపట్టి ఈ సంస్థ ద్వారా ప్రయోజనం పొందారు.

★ హైదరాబాదులో ఉన్న దుర్గాభాయ్ దేశ్‌ముఖ్ మహిళా సాంకేతిక శిక్షణ సంస్థ యువ మహిళలకు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంలో శిక్షణ యిస్తున్నది. నెల్లూరులో కూడా ఇటువంటి సంస్థ ఒకటి ఏర్పాటు చేస్తున్నారు.

★ విశాఖపట్నం, హైదరాబాదు, తిరుపతిలలో ఉద్యోగాలు చేసే మహిళల కోసం, వసతి గృహాలు నిర్వహిస్తున్నారు. స్వచ్ఛంద సంస్థలు నిర్వహిస్తున్న ఇటువంటి వసతి గృహాలకు సహాయాన్ని అందచేస్తున్నారు.

★ చిత్తూరు, హైదరాబాదులలో వృద్ధులకోసం రెండు వసతిగృహాలు నిర్వహిస్తున్నారు

★ రాష్ట్రంలో 18,000 మహిళా మండలులు పనిచేస్తున్నాయి.

★ మహిళల కోసం వృత్తి శిక్షణ కేంద్రాలు, సర్వీసు గృహాలు, టైలరింగు సెంటర్లు, చేతి పనుల శిక్షణ కేంద్రాలు, యూనిఫారం దుస్తుల తయారీ కేంద్రాలు, ఆశ్రయ గృహాలు పనిచేస్తున్నాయి.

★ మన ప్రధానమంత్రి ఆశయాలకు అనుగుణంగా ఆంధ్రప్రదేశ్‌లో మహిళా లోకాన్ని జాగృతం చేసేందుకు తగిన కృషి జరుగుతున్నది.

Advt No 53

సమాచార పౌరసంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము, హైదరాబాదు. DIPR No 52428/Advt-1/C3/81

## హైదరాబాద్ నోట్ బుక్

**అటెండెన్స్ వేయనందుకు :**

విద్య యొసగును వినయంబు— అని భర్తృహరి ఎంత పొరపాటుగా అన్నాడా ? అని నేటి విద్యారంగపరిస్థితి చూస్తే అనుమానించవలసి వస్తుంది. మల్కాజిగిరి టీచర్స్ ట్రెయినింగ్ ఇన్‌స్టిట్యూట్‌లో నవంబరు 24న జరిగిన దుర్ఘటన ఈ అనుమానానికి కారణం. తనకు అటెండెన్స్ వేయలేదన్న కోపంతో విద్యార్థి శ్రీ కొండల్‌రెడ్డి ప్రిన్సిపాలు శ్రీ కిష్టయ్యను కత్తితో పొడిచాడు తర్వాత భయంతో పారిపోయాడు తోటి విద్యార్థులు అతనిని పట్టుకొన్నారు. ఏమవుతుందోనని భయంతో పిదప తనను కూడ పొడుచుకున్నాడు. ఇద్దరిని చికిత్స కోసం గాంధీ మెడికల్ ఆసుపత్రిలో చేర్చారు ఇదీ చదువు తెచ్చినస్థితి అటెండెన్స్‌కోసం విద్యార్థులు అంగలార్చడం పోగా తోటి విద్యార్థులను తనకు మారు హాజరీ చెప్పమనడం, అలాగా తక్కువయితే ఉపాధ్యాయులను బెదరించడం, కొట్టడం, కత్తులు కటార్లు వాడడం సర్వసాధారణమయింది. ఈలాంటివారే రేపు బాధ్యతగల పదవులకు వస్తారు. క్రమ శిక్షణతో పెరగని వీరు పదవులను ఏమి నిర్వహించగలుగుతారు గనుక ? అక్కడా ఇలాగే ప్రవర్తించక తప్పదు. పదవుల నిర్వాకమూ అంతంతగానేఉంటుంది అందుకేనా మిత్రుడొకడు విద్యయొసగను వినయంబు అన్న పద్యపాదానికి రెండు పాఠాంతరాలు ప్రతిపాదించాడు. విద్య యొసగునె వినయంబు అని, విద్య యొసగదు వినయంబు అని. వీటిలో ఎవరికి నచ్చింది వారు గ్రహించవచ్చు.

**స్వాతంత్ర్య యోధుడు**

**దిగంబరరావ్ బిందూ కాలధర్మం :**

నిజాం రాష్ట్ర స్వాతంత్ర్య సమరకురువృద్ధుడు బూర్గుల మంత్రి వర్గంలో హోం శాఖ మంత్రి శ్రీ దిగంబరరావు బిందూ నవంబర్ 24న నాగపూర్ రైలు ప్లాట్‌ఫారంమీదే గుండెపోటుతో మరణించారన్న వార్త స్వాతంత్ర్యయోధులకందరికీ, ముఖ్యంగా ఆయన నిష్కాపట్యం, చిత్తశుద్ధి, ఆత్మీయత, రాజకీయ రంగంలో ముక్కుకు సూటిగా పోయే నైతికబలం తెలిసిన నాబోటివారికి తీరని దుఃఖం కలిగించింది. శ్రీ బిందూ సరసత, సహృదయత ఆనాటి హైదరాబాద్ రాజకీయాల్లో శత్రు మిత్రులందరిమన్ననా పడసినవి ఆయన ఎట్టి విమర్శకైనా తట్టుకొని నవ్వివేసేవాడు ఆయన పచ్చి నిర్మొగమాటం, చాల కరుకై ఒకొకప్పుడు ఎదుటివానికి కష్టం కలిగించేది. కాని దాని అట్టడుగున ఎలాటి దురుద్దేశమూ ఉండేది కాదు గనుక ఎవరికీ స్నేహభంగకరం కాలేదు. తన మాట సాగదని కాని, తనదో, తన పక్షం వారిదో ప్రతిపాదనను ఎవరూ ఒప్పుకోరని కాని పసిగట్టిన వెంటనే ఆయన ఇతరుల జోక్యానికి అవకాశమివ్వకనే

సంతోషంతో రంగంనుంచి నిష్క్రమించే పట్టు విడుపులుగలవారు రాజకీయరంగంలో క్రీడాకారుల సరసత ఆయనకు ఉండేది. శ్రీ బిందూ పాత నిజాం రాష్ట్రంలోని, ప్రస్తుతం మహారాష్ట్రలో చేరిన నాందేడ్ జిల్లాలో భోకర్ గ్రామంలో 1896 జూలై 12వ తేదీన జన్మించారు. భోకర్, నాందేడ్ లలో ప్రాథమిక విద్య తర్వాత పూనా, హైదరాబాద్ లలో ఉన్నత పాఠశాల విద్య ముగించి న్యాయవాద పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు 1918లో "నిజాం విజయ" అనే మరాఠీ వారపత్రిక ప్రారంభానికి కారకులైనవారిలో బిందూకూడా ఒకరు. కాని, బ్రిటిష్ ప్రాంతంలో స్వాతంత్ర్యోద్యమం బలపడిన తర్వాత ఆయన స్వాతంత్ర్యోద్యమంలో చేరాడు. 1920లో ఆయన హైదరాబాద్ సంస్కరణల సంఘంలో సభ్యులయ్యారు దీనివల్ల ఆయనకు ప్రజా సమస్యలతో సన్నిహితత్వం ఏర్పడింది 1936లో ఆయన ప్రథమ మరాట్వాడా మహాసభను ఏర్పాటు చేసి ప్రధాన కార్యదర్శి అయ్యారు. 1938లో నిజాం స్టేట్ కాంగ్రెస్‌స్థాపనకు ప్రయత్నించిన ప్రముఖులలో బిందూ కూడా ఒకరు. అది పుట్టక ముందే నిజాం ప్రభుత్వ నిషేధానికి గురి అయినా, పిదప శ్రీ గోవిందరావు నానక్ అధ్యక్షుడుగా, స్వామి రామానందతీర్థ ప్రధాన కార్యదర్శిగా స్టేట్ కాంగ్రెస్ ఏర్పడింది రామానంద తీర్థ నాయకత్వంతో ప్రభావితులైనబిందూ స్వాతంత్ర్యోద్యమంలో తనను పూర్తిగా ఒడ్డి వేశారు పిదప శాసనోల్లంఘన సత్యాగ్రహంలో పాల్గొన్నారు 1945లో మరాట్వాడా మహాసభకు అధ్యక్షులయ్యారు 1946లో స్వామి రామానందతీర్థ స్టేట్ కాంగ్రెస్‌అధ్యక్షులు కాగా, బిందూ కార్యదర్శి అయ్యారు పిదప నిజాం రాష్ట్ర సరిహద్దులకు ఆవలినుంచి రాష్ట్ర కాంగ్రెస్ కార్యాచరణ సంఘం అధ్యక్షుడుగా స్వాతంత్ర్య సమరం కొనసాగించారు 1948లో పోలీసు చర్యలు జరిగాయి. రాష్ట్ర కాంగ్రెస్‌లో పెక్కు చీలికలు వచ్చాయి కాని బిందూ స్వామిరామానందవర్గం లోనే ఉన్నారు 1950లో బిందూ నిజాం రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు అయ్యారు ఆయన అధ్యక్ష కాలంలో 1952లో హైదరాబాద్‌రాష్ట్రంలో తొలి సాధారణ ఎన్నికలు జరిగాయి. కాంగ్రెస్ అఖండ విజయం సంపాదించింది. శ్రీ బూర్గుల రామకృష్ణా రావు నాయకత్వాన తొలి కాంగ్రెస్ మంత్రివర్గం ఏర్పాటయింది. శ్రీ బిందూ హోంశాఖామంత్రి అయ్యారు ఆంధ్రప్రదేశ్ అవతరించిన పిదప, 1957లో బిందూ రాజకీయాలనుంచి విరమించి నిర్మాణ కార్యక్రమంలోనిమగ్నులయ్యారు. పిదప హైదరాబాద్ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర రచనా సంఘానికి అధ్యక్షులుగా ఉండి తన చిర వాంఛితాన్ని స్వాతంత్ర్య సమర చరిత్ర రచనను నెరవేర్చుకొన డానికి పూనుకున్నారు. ఈ సంఘాన్ని శ్రీ పి. వి నరసింహారావు అధ్యక్షతన ఏర్పడిన స్వామీ రామానంద తీర్థ స్మారక సంఘం నియమించింది. శ్రీ బిందూ వయస్సు 85 సంవత్సరాలు. ఆయన అంత్య సంస్కారాలు నాగపూర్‌లోనే జరిగాయి ఆయన చితాభస్మాన్ని నవంబర్ 28న ఆయన పెద్ద కుమారుడు శ్రీ దినకరరావు బిందూ హైదరాబాద్‌కు తెచ్చినప్పుడు రైల్వేస్టేషన్‌కు పలువురు వెళ్లారు రాష్ట్ర సాంకేతికశాఖామంత్రి శ్రీ టి హయగ్రీవాచారి ముష్నుగూరారు ముసారాంబాగ్‌లోని శ్రీబిందూ ఇంటికి వెళ్లి చితాభస్మమున్న కరండంపై పుష్పగుచ్ఛాలుంచారు

**ఉపశ్రుతి :**

మాచారా వెట్టి చాకిరీలో మన రాష్ట్రందే అగ్రస్థానమట!— అన్నారుఒకరు నవ్వుతూ మరెం! మనది కర్మభూమిగదా!— అన్నారు మరొకరు. మిత్రులు రాష్ట్ర విధానసభసభ్యులు శ్రీ హెచ్. సత్యనారాయణరావు "కర్మభూమా, ఆయుష్కర్మ భూమా" అని ప్రశ్నించారు దేశమేమీ ప్రగతి సాధించడంలేదు గనుక ఆయుష్కర్మ భూమే — అన్నారు మరొకరు.

# అవీ...ఇవీ...అన్నీ

## విశ్వంభర

వచన కవితలో సమగ్ర కావ్యం రచన డాక్టర్ సి నారాయణరెడ్డి, ప్రకృతినే పద్యంగా, మానవ మానస ప్రవృత్తులని ఆధారంగా తీసుకుని ఆదిమదశ నుంచి ఆధునికదశవరకు మనిషి చేసిన ప్రస్థానాలని ఈ కావ్యంలోని ప్రకరణాలలో హృద్యంగమంగా చిత్రీకరించారు 100 పేజీలు గల ఈ పుస్తకం వెల పది రూపాయలు ప్రతులకు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు

## దేవేంద్రన్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్

ప్రచురణ, సంపాదకత్వం శ్రీ కె దేవేంద్రాచారి. 56 పేజీల ఈ పుస్తకంలో మొత్తం 494 ప్రపంచ రికార్డులని పొందుపరచారు. వెల రు 2లు. ప్రతులకు దేవేంద్రన్ సూపర్ లేటివ్స్ (ప్రై లి) 4—214, పెద్దకాపువీధి, తిరుపతి—517501.

## ఓ తెలుగుతల్లీ మా కల్పవల్లీ

గేయ సంపుటి రచన శ్రీరామకృష్ణ కటాక్ష 14 పేజీలు, వెల రు 12లు. ప్రతులకు సుమిత్రా పబ్లికేషన్స్, 17—4—40, సుందరయ్య వీధి, చిత్తూరు.—517001.

## సమాలోచన

శ్రీ బులుసు సీతారామశాస్త్రి సంపాదకత్వంలో వెలువడుతున్న జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక ఐదవ ప్రత్యేక వార్షిక సంచిక మా కార్యాలయం చేరింది. 52 పేజీలు గల ఈ సంచిక వెల రూపాయున్నర. ప్రతులకు సంపాదకుని పేర రిటైర్డు తెలుగు లెక్చరర్, వి. టి. జె. కాలేజి, 6—8—7, ఇన్నీసుపేట [త్యాగరాజ నగర్] రాజమండ్రి—1 అన్న చిరునామాకు వ్రాయాలి

## అక్షరాంజలి

శ్రీ నాగేశం స్మారకసమితివారు నటభారతి కీ శే నాగేశం ద్వితీయ వర్ధంతి సందర్భంగా వెలువరించిన ఈ స్మారక సంచికలో కీర్తిశేషుని గుణగణాలని, నటనా ప్రతిభని ప్రస్తుతిస్తూ పలువురు ప్రముఖుల రచనలు, పలు సందర్భాలలో తీసిన ఛాయాచిత్రాలనేకం ఉన్నాయి. 60 పేజీలు,వెల రు 10లు. ప్రతులకు. శ్రీ నాగేశం స్మారకసమితి, 462, భవానీనగర్, తిరుపతి—517501. ●


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.
Editor : S. Radhakrishna.

ఇప్పుడు 60 సంవత్సరాల హిమాని అనుభవంతో నిజంగా పనిచేసే నూతన టర్మరిక్ క్రీమ్

## పసుపు యొక్క తైల రసంతో
## పూర్తిగా నూతన కల్పన
# గోల్డ్
## టర్మరిక్ వానిషింగ్ క్రీమ్

వారంలో ప్రతి రోజూ మీ చర్మాన్ని లేతగా,
మృదువుగా, సువాసనలీనుతూ వుంచటానికి
పసుపు యొక్క సహజ విలువలు సంరక్షిస్తూ,
దాని తైల రసంతో (ఒలియొరెసిన్లతో
తయారు చేయబడి చందనంతో
సమృద్ధి పరచబడింది.




హిమాని టర్మరిక్ సబ్బుకూడా లభిస్తుంది.

అమాయిక చర్మంకొరకు హిమాని
గోల్డ్ టర్మరిక్ వానిషింగ్ క్రీమ్

7875B/9 TEL/R